


"తలుపు దగ్గర"

చిత్రకారిణి: శీలం ఇందిరాదేవి — అబ్బినేనిగుంటపాలెము.



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

## వచ్చేదే సంవత్సరాది సంచిక

ప్రత్యేకాకర్షణ: కొత్త సీరియల్

## బంగారం - సింగారం

[ఐదు బొమ్మలకథ]

ముందేం జరుగుతుందోనని మీలో మీరు పందెంవేసుకునేలా చేసే కొత్త తరహాకథ బంగారంకోసం బంగారం వేసే ఎత్తులూ, వాటి కతని మేనల్లుడు సింగారంవేసే పై ఎత్తులూ, వారం వారం చదివి ఆనందించండి.

ఇతర ముఖ్యాకర్షణలు

అంతలో కలిసి అంతలో విడిపోయే అత్తాకోడళ్ళను రంగుటద్దాల్లోంచి మనోహరంగా చూపించే

## శ్రీమతి భానుమతీ రామకృష్ణ ప్రత్యేక వ్యాసం

❖ ❖

భారత రాష్ట్రపతి నివసించే నాలుగు భవనాలనుగూర్చి సచిత్రవ్యాసం

❖ ❖

శ్రీ భమిడిపాటి జగన్నాథరావు, "శాండిల" మున్నగు ప్రముఖ రచయితల కథలు, వ్యాసాలు, గేయాలు, పండుగ చిత్రాలు, ఇంకా ఎన్నో ఇతర విశేషాలు.



సంవత్సర చందా
రు. 13—0—0
విడిప్రతిక 25 న.పై

Founder: K. NAGESWARA RAO

విలంబ ఫాల్గుణ బహుళనవమి బుధవారం

సంపుటము 53
సంచిక 27
1-4-59

# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
గీతాపిక్చర్సవారి 'ఋష్యశృంగ'లో
లత





# రాజధాని కబుర్లు

## మాస్కో బృందం 'బొమ్మలాట'

బొమ్మలాటల్లో రకాలెన్నో ఉన్నాయి. అన్నిటిలోను ప్రావీణ్యత ఉందిట మాస్కో మనుష్యులకి. అంతేకాదు మాస్కో మనుష్యు లాడించిన బొమ్మలు దాదాపు మనుష్యుల్లాగే ఉంటాయ్. మనలాగే తాగుతాయి, తింటాయ్; నవ్వుతాయి, ఏడుస్తాయ్. ఈ విషయం స్పష్టమైంది ఈ వారం రాజధాని పౌరులకి.

ఈ వారం రాజధానివాసులకి ఇంకో విషయం కూడా స్పష్టమైంది. మాస్కో మనుష్యులు మధ్యలో తెరలు వత్తిగించి, 'టెక్నిక్' అంతా చూపించేస్తారు. 'ఇవి బొమ్మలుసుమా? ఈ బొమ్మల్ని ఈ విధంగా ఆడిస్తాం' అంటారు. అలా చూసి కూడా, మనం భ్రమపడక తప్పదు: 'ఆ తాగేది, తినేది మనుష్యులేనని; ఆ నవ్వే, ఏడ్చే బొమ్మల్లో మానవత్వం ఉందని.'

బొమ్మలాడించడంలో రకాలున్నాయి. ముక్కుకు తాడేసి ముందుకు లాగవచ్చు. వెనకనుంచి కర్రపుచ్చుకుని ముందుకు నెట్టవచ్చు. మనకీ తోలుబొమ్మలున్నాయి కొన్ని శతాబ్దాలుగా. కర్ర పట్టుకొని వెనక నిలబడి మనుష్యు లాడిస్తొంటారు ఈ బొమ్మల్ని. కాని ఏం ప్రయోజనం? తోలుబొమ్మల్ని తోలుబొమ్మలుగా చూసి ఆనందిస్తామే గాని 'ధృతరాష్ట్రుడు, ద్రౌపది, కర్ణుడు, కుంభకర్ణుడు' అనుకోం. మాస్కో మనుష్యుల బొమ్మల్ని చూస్తే మనుష్యులే ఏమో అనిపిస్తుంది,

*   *   *   *   *

మాస్కో పపెట్ థియేటర్ బృందం ఈవారం రాజధాని నగరం వచ్చి ప్రదర్శన లిచ్చింది. ప్రదర్శనలు వేలకొలది ప్రేక్షకులకు ఆనందాన్నిచ్చాయి. ప్రేక్షకులనుంచి వచ్చిన సొమ్ము ప్రధానమంత్రి నిధికి చేరింది. ఈ బృందం ఈ విధంగా దేశంలో అనేకచోట్ల ప్రదర్శన లిస్తోంది. భారతీయులకు పాఠాలు నేర్పుతోంది. పాఠాలు నేర్చుకుంటున్నారా మనవాళ్ళు?



మాస్కోబృందం ప్రదర్శించిన కీలుబొమ్మలాటలో పాల్గొన్న బొమ్మలు



సోవియట్ బొమ్మలాట డైరెక్టర్ శ్రీ యస్. వి. ఒబ్రాజోవ్ సతీసమేతంగా మార్చి 14-న హైదరాబాదువచ్చినప్పుడు, పలువురు అధికార, అనధికార ప్రముఖులు బేగంపేట విమానాశ్రయంవద్ద వారికి స్వాగతం చెప్పారు.

#  రాజధాని కబుర్లు 

మార్చి 14 వ తేదీన దర్శకుడు శ్రీ ఒబ్రజోవ్ అతని సతీమణి బేగంపేట విమానాశ్రయంలో విమానం దిగారు. మార్చి 15 వ తేదీన ప్రదర్శనాపూర్వకమైన ఉపన్యాసం చేశారు శ్రీ ఒబ్రజోవ్. మార్చి 16 న 'అలాదీన్, విచిత్రదీపం' ప్రదర్శన ఇచ్చింది. మార్చి 17 న ఈ బృందం గౌరవార్థం విందు. తరువాత అతిథుల నిష్క్రమణ. ప్రత్యక్షంగా: పరోక్షంగా బృందం నేర్పిన పాఠంఏమిటంటే. క్రమశిక్షణ ప్రాతిపదికగా వారి ప్రదర్శనలలో గల వైశిష్ట్యం.

హైదరాబాదులో మాస్కో పపెట్‌బృందం ఉన్న రెండు మూడురోజులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అతిథులుగా ఉన్నారు. ఒక అధికారిని ఆతిథ్యానికి, ప్రదర్శనలకు ఏర్పాట్లు చేయమంది ప్రభుత్వం. ప్రభుత్వంలో ఉన్నారు ఎందరో మహానుభావులు. ఈ నిర్ణయానికి పుణ్యంకట్టుకున్న మహానుభావులు ఎవ్వరో మరి తెలియదు. ఇటువంటి ప్రదర్శనల నిర్వహణకు కాకపోతే ఎందుకుంది ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ? పలుమార్గోజులు విజయవంతంగా సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటుచేసిన ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం ఏమైంది? ప్రభుత్వాధికారులే, ప్రభుత్వ శాఖలే ఇవి నిర్వహించాలనుకుంటే సమాచారశాఖ లేకపోయిందా? అసమర్థతకి, ఆలోచనాశక్తి హీనతకు చిహ్నంగా మూడు సంవత్సరాలు నడిచింది: హైదరాబాదుకి, సంస్కృతికి, రెంటికి దూరంగాఉన్న హైదరాబాదు సంగీతనాటక అకాడమీ అనే సంస్థ. ఆ సంస్థకు చెందిన వ్యక్తుల్ని ఇప్పుడు ప్రభుత్వం ఎందుకు బయటపులాగాలో అర్థంకాదు.

విదేశీబృందం రాజధానికి విచ్చేసినప్పుడు, బృందం రాజధానికి రాకముసుపే ఏర్పాటన్నీ స్థిరంకావాలి. ప్రభుత్వం సమాచారశాఖకి ఈ కార్యక్రమం అప్పగిస్తే, ఏర్పాటన్నీ చక్కగా సాగేవనడంలో సందేహంలేదు. 13 వ తేదీ శనివారం శాసనసభా సమావేశ కార్యక్రమాలతో సతమతమవుతున్న పత్రికా ప్రతినిధులను బేగంపేట విమానాశ్రయంవద్దకు చేరవేశారు. అతిథులను పరిచయంచేయాలన్న ఆలోచనకూడా ఎవరికీ ఉదయించలేదు. మళ్ళీ పత్రికా ప్రతినిధులు నగరం చేరుకున్నారు-ఒక గంట తర్వాత. ఇది రసాభాస కార్యక్రమంలో 'పుల్లయ్యవేంపార'ఘట్టం!

విమానాశ్రయంవద్ద ఏం చేయాలో తెలియక నిలబడ్డ పాత్రికేయులపరిస్థితి శ్రీ ఒబ్రజోకి అర్థమైయ్యుండాలి. 'ప్రెస్ కాన్ఫరెన్సు ఉందా?' అని అడిగారు. 'రేపు' అని సమాధానం ఇచ్చారు అధికారులు. ఆ రేపు ఎప్పుడో అప్పటికింకా నిర్ణయంకాలేదు. అందువల్ల శ్రీ ఒబ్రజోకి వారుచెప్పలేదు. వచ్చినవారిలో ఎవరెవరు పత్రికలవారో వారికి తెలియదు. అందువల్లకూడా వీరికి చెప్పలేదు. ఫోటోలు తీయించుకోవడంతో పాటు, ఆఫీసర్లకు మిగిలిన విషయాల్లోకూడా శిక్షణ ఇస్తే బాగుణ్ణు.

మరునాడు ఉదయం ప్రెస్ కాన్ఫరెన్సని ఆరాత్రి నోటీసులు వచ్చాయి. పత్రికాప్రతినిధు లందరూ హాజరు కాలేకపోయారు.

*   *   *   *

ఆదివారం, సోమవారం రాత్రులు జరిగిన ప్రదర్శనలు మాస్కో కళాకారుల ప్రతిభకి నిదర్శనాలు. దర్శకుడు శ్రీ ఒబ్రజోకి ఆంగ్లభాషాజ్ఞానం లేకపోలేదు. కాని ఆయన రష్యన్ భాషలో

ప్రసంగించారు. ఒక రష్యన్ సుందరి ఆయన ప్రసంగాన్ని ఆంగ్లంలోనికి తర్జుమా చేసింది. వారి మాతృభాషపట్ల వారికిగల గౌరవం అట్టిది. ఆదివారం రాత్రి విద్యామంత్రి ఇంగ్లీషుభాషలో ప్రసంగించారు. సోమవారం రాత్రి అంతరంగికశాఖామంత్రి స్వచ్ఛమైన ఉర్దూభాషలో ప్రసంగించారు. మనవారికి మన మాతృభాషపైగల గౌరవం ఇటువంటిది.

స్వచ్ఛమైన ఇంగ్లీషులో మాట్లాడడంకంటె తప్పుల తెలుగులో మాట్లాడడం మంచిదన్నారు శ్రీ కాశేశ్వరరావు ఒకసారి.

● * ● *

అమెరికాని సామ్రాజ్యవాద దేశంగా, అమెరికనులను యుద్ధోన్మాదులుగా ప్రచారం చేయడం భారత కమ్యూనిస్టులకు అలవాటే. స్టాలిన్‌యుగంలో పుట్టింది ఈ ప్రచారం. చెప్పినట్లు కనపడకుండానే చెప్పడం క్రుశ్చేవ్ తరహా కమ్యూనిస్టుల లక్షణం. శ్రీ ఒబ్రజో అమెరికనుల పేరెత్తలేదు. ఆయన నవ్వుతూనే ఉన్నారు; ప్రేక్షకులను నవ్విస్తూనే ఉన్నారు. ఆయన పదివేళ్ళను ఆధారంగా చేసుకొని ఆడిన తోలుబొమ్మలు ప్రజల్లో రకరకాల బలహీనతలను సహృదయతతో పరిహసించాయి. తరువాత ఆయన బృందం బొమ్మలతో 'కన్సర్ట్' ప్రదర్శించింది. ఒకతరహా నటీనటులపై, గాయకులపై, సమీక్షకులపై విమర్శ ఇది అని ముందే చెప్పారు. బొమ్మలు లేచివచ్చి హాలీవుడ్ బ్రాండు 'సంగీతం' వినిపించాయి. రాక్ అన్ రోల్ గెంతులు చూపించాయి. సంగీతం కాని ఆ సంగీతాన్ని, నృత్యలక్షణాలులేని ఆ నృత్యాలను అవహేళనచేయడంలో ప్రేక్షకులు కలిశారు. చప్పట్లు మిన్నుముట్టాయి.

భారత కమ్యూనిస్టులు భారతదేశంనుంచి ఏమీ నేర్చుకోకపోతే మానె! రష్యానుంచైనా కొంత నేర్చుకోవాలి!

* * * *

సోమవారంరాత్రి మాస్కో బృందం ప్రదర్శించిన 'అల్లాద్దిన్' నాటకం సాంకేతిక దృష్టితో పరిశీలిస్తే అద్భుతం; అన్నీ మరిచిపోయి, మనస్సుకు స్వేచ్ఛనిచ్చి చూస్తే ఆహ్లాదకరం. ప్రదర్శన ఎంత బాగుందో, సంఘటనలు అంత సహజంగా ఉన్నాయి. 1931 లో ప్రారంభించి, ఇంత ముందుకు వచ్చింది మాస్కో థియేటర్. మనం వెనక్కి తిరిగి నడవడం ఎప్పుడు మానేస్తాం?

## రైళ్ల రాకపోకలు

కుక్క మనిషిని కరిస్తే వార్త కాదట; మనిషి కుక్కను కరిస్తే వార్త ఔతుందన్నాడు ప్రబుద్ధుడొకడు. పూర్వం నిజాం స్టేట్ రైల్వే ఉన్నప్పుడు రైలు అరగంట ఆలస్యంగా చేరితే, అది వార్తా పత్రికలకు వార్తలు ప్రచురించడానికి అవకాశం కల్పించేది. ఇప్పుడు రైలు సమయానికి వస్తే, అది మనకి వార్త.

మూడో తరగతి ప్రయాణీకులను మనుష్యులుగా చూసే అలవాటు రైలువాళ్ళకి ఎన్నడూ లేదు. పూర్వం గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ అంటే గొప్ప. అది వస్తే, మామూలు ఎక్స్‌ప్రెస్‌లు పక్కన గౌరవంగా నిలబడాలి. ఎక్స్‌ప్రెస్ వస్తే పేసెంజర్ పక్కన నిలబడాలి. సామాన్లు బండి దూరంగా నిలబడి పేసెంజర్ బండిని గౌరవించాలి. ఇది పూర్వం. సామాన్ల బండితో పోల్చి చూసుకొని పేసెంజర్లు మీసాలు మెలివేసుకొనే రోజులవి.

ఇప్పుడు దేశం అభివృద్ధి పంథాలో నడుస్తూన్న రోజులు. ఉత్పత్తి-ఉత్పత్తి కావాలి ఏదైనా సరే! ఉత్పత్తి ఐనదల్లా రవాణా ఐపోతూండాలి. మనుష్యులు పనులు కట్టుకోడానికి తప్ప మరెందుకూ పనికిరారు. ఇప్పుడు గుడ్స్ బండి వస్తూందంటే—గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ తలవంచి నమస్కరించి పక్కన నిలబడుతోందిట.

వేగన్లు కదలకపోతె విదేశీమారకద్రవ్యం తగలడిపోతుంది. రైల్వే కాన్ఫరెన్సు ప్రతీ రైల్వేకి ఇన్ని వేగన్లు కదలాలని ఆదేశం ఇచ్చింది. సెంట్రల్ రైల్వేనుంచి ప్రతిదినం ఇన్ని వేగన్లు సదరన్ రైల్వేకిపోతే, సదరన్ రైల్వేనుంచి ప్రతిదినం ఇన్ని ఇక్కడికి రావాలని నియమం. అలా రాకపోతే, వేగనుకి నలభైయో ఏభైయో చా॥న జుల్మానా. స్టేషన్‌మాస్టర్లు, గార్డులు అందరూ వేగన్ల కదలికలో నిమగ్నులై ఉన్నారు.

మంత్రులుకూడా మనుష్యులే కాబట్టి, మనుష్యులెవ్వరూ సామాన్ల బండ్లలో ప్రయాణం చేయకూడదు కాబట్టి, మంత్రులు ప్రయాణంచేసిన రైళ్ళుకూడా ఆలస్యంగా రాజధానినగరం చేరవలసిందే. సెంట్రల్ రైల్వే కేంద్రస్థానం బొంబాయిలో ఉంది. సదరన్ రైల్వే కేంద్రస్థానం మదరాసులో ఉంది. ఎంత మంత్రులైతే మాత్రం, మన తెలుగువారికి అడగడానికి ధైర్యం ఉండొద్దూ?

—"ప్రవీణ్"

# తెలుసుకోతగిన విషయాలు

జాతీయ నమూనా సర్వేవారు (జూలై 1954 - మార్చి 1957) కాలంలో సాగించిన ఎనిమిదో మజిలీ సర్వేప్రకారం భారతదేశపు గ్రామాల్లో మొత్తం 6.5 కోట్ల కుటుంబాలు నివసిస్తున్నట్లు తేలింది.

వీరి అధీనంలో 31 కోట్ల ఎకరాల భూమి వుంది. దేశ వైశాల్యం రీత్యా యిది నూరింట 38 వంతురు. దేశంలో వుపయోగకరమైన భూమితో పోలిస్తే నూరింట 61 వంతులు.

వీటిలో 1వ వంతు అంటే ఒక కోటిన్నర కుటుంబాలకి భూవసతి అంటూ లేదు. ఈ గ్రామాల్లోని కుటుంబాల్లో సుమారు నాలుగోవంతువరకూ ఒక ఎకరంకన్నా తక్కువ భూమే కలిగివున్నారు. సగానికి కొంచెం తక్కువ మందికి అసలు భూమి లేకపోవడమో, ఎకరంకన్నా తక్కువగా ఉండడమో పరిస్థితిగా వుంది. గ్రామాల్లో వున్న అన్నికుటుంబాల యాజమాన్యంలో వున్న భూమితో యీ వీరివంతు నూటికి ఒకటికి కొంచెం పైచిలుకు.

ఈ కుటుంబాలలో నాలుగింట మూడు వంతులకు అసలు భూమి లేనేలేదు. లేదా 5 యకరాలకి తక్కువగావుంది. మొత్తం భూవైశాల్యం రీత్యా వీరి వాటా ఆరింట ఒకవంతు.

ఈ అన్ని కుటుంబాల యాజమాన్యంలోను వున్న సగటు భూమి సుమారు 4.7 యకరాలు. ఇందులో అసలు భూమి లేనటువంటి వారిని కూడా చేర్చి యీ దామాషా లెక్కకట్టారు.

గ్రామాల్లోవున్న మొత్తం కుటుంబాల్లో నూరింట 63.5 వంతులు భూమిని కౌలుకివ్వలేదు. 12.5 వంతుల మంది కొంత వరకు కౌలుకిచ్చారు. నూరింట 2 వంతుల మంది పూర్తిగా తమ భూమి నంతనూ కౌలుకిచ్చారు. మిగిలిన 22 వంతుల మందికి అసలు భూవసతి లేదు.

కుటుంబాల్లో నూరింట 90 వంతులు తమభూమిని వ్యక్తిగతంగానే సాగు చేసుకుంటున్నారు. ఈ సర్వేప్రకారం కొన్ని జనాభా మండలాల్లో యిటువంటి కుటుంబాలు నూటికి 90 వంతులకుపైగా వున్నాయి. దేశం మొత్తంమీద కుటుంబాల్లో నూరింట 10 వంతులు యితరులతో కలసి వుమ్మడిగా భూవసతి కల్గివున్నాయి. నూరింట 6 వంతులు కేవలము వుమ్మడిగా భూమి చేసుకుంటున్నాయి, మిగతా నాలుగు వంతులు వుమ్మడిగాను, వ్యక్తిగతంగాను కూడా భూమిని చూసుకుంటున్నాయి. మొత్తం భూమిలో నూరింట ఎనిమిదోవంతు వుమ్మడి మానేజిమెంటు క్రింద వుంది.






# సహకార సేద్యంపట్ల వైముఖ్యం

ప్రజాస్వామ్యంపట్ల భారత ప్రధాని వైఖరిలో వచ్చిన మార్పు స్పష్టంగా కనిపిస్తోంది. దీన్ని "వాస్తవికతవైపు తిరోగమనం" అంటున్నారు కొందరు.

మార్చి 19వ తేదీన ప్రధాని పత్రికా విలేఖరుల సమావేశంలో మాట్లాడుతూ "మన ఆలోచనలను ఒకపద్ధతిలో మలచుకోవటం నేర్చుకోవాలి," అన్నారు. దీన్నె విశదంగా వివరిస్తూ "ఆలోచన అంటే క్రమశిక్షణతో కూడిన ఆలోచన" అన్నారాయన.

ఆతరవాత ఆయన కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ సమావేశంలో మాట్లాడుతూ సహకార సేద్యంపై నాగపూర్‌లో చేసిన తీర్మానానికి సుముఖంగా లేనివారు కాంగ్రెసునుంచి తప్పుకోవచ్చునని చెప్పినట్లు లాబీవర్గాలద్వారా తెలిసింది.

నాగపూర్ తీర్మానాలను, కాంగ్రెసు ఇతర విధానాలను బహిరంగంగా వ్యతిరేకించే కాంగ్రెసు సభ్యులందరిమీదా చర్యలు తీసుకోవలసిందిగా కాంగ్రెసు సంఘాలన్నిటికీ ఉత్తర్వు లివ్వాలని కాంగ్రెసు కార్యవర్గం నిశ్చయించింది.

ఇదంతా చూస్తే, మనుషుల మనసులపై నియంత్రుత్వం ప్రారంభమైనట్లే కనిపిస్తుంది. "మనతోపాటు రానివాళ్ళు మనకు శత్రువులే" అన్న ధోరణి కనిపిస్తుంది. నాగపూర్ తీర్మానాలను కాంగ్రెసువారు బహిరంగంగా విమర్శించటానికి ఇక వీల్లేదు. పోనీ చాటుగా విమర్శించుదామనుకుంటే, కాంగ్రెసు లోంచి పొమ్మంటున్నారు.

అల్లరిమూకలను స్నేహభావంతో ఎదుర్కోవాలని పోలీసువారికిచ్చిన ఆదేశానికీ, పైనచెప్పిన ధోరణికీ పొంతన కుదరటంలేదు. అంతేకాదు. ప్రజాస్వామ్యంలో తిరుగులేని నిర్ణయాలులేవని ఇదివరలో ప్రకటించిన సిద్ధాంతంతోకూడా దానికి పొంతనకుదరటంలేదు. బొంబాయినిగూర్చి కేంద్ర మంత్రిమండలి చేసిన నిర్ణయాన్ని ఉన్నట్లుండి మార్చుకోగాలేనిది, నాగపూర్ తీర్మానాలనుమాత్రం మార్చుకోగూడదా, అవి పవిత్ర శిలాశాసనాలా అని ఇక్కడ కొందరు ప్రశ్నిస్తున్నారు. అయితే ప్రధానమంత్రి వైఖరే సరైనవైఖరి అని మరికొందరు భావిస్తున్నారు. "ప్రజాస్వామ్యం అంటే అరాజకంకాదు. ప్రజాస్వామికంగా వ్యవహరించాలంటే కొందరికి బాధ కలిగించే పనులు చేయక తప్పదు;" అని వారు ఉద్ఘాటిస్తున్నారు. ఏ పార్టీకైనా క్రమశిక్షణ ముఖ్యం అంటున్నారు. సభ్యులు క్రమశిక్షణతో ప్రవర్తించేట్లు చేసితీరాలి అని నిర్ణయించిన పక్షంలో కాంగ్రెసు అధిష్ఠాన వర్గం చేసిన నిర్ణయం సరైనదే; సబబైనదే. వచ్చిన చిక్కల్లా ఏమిటంటే, ఈ ప్రబోధాలు, ఉద్బోధాలు, క్రమశిక్షణతో ప్రవర్తించేట్లు చేసితీరాలనే పట్టుదల—ఇవన్నీ గాలికబుర్లుగానే పరిణమిస్తాయేమో, ఆఖరి క్లిష్టక్షణంలో అధిష్ఠానవర్గం నిర్ణయాలు మార్చుకుంటుందేమోనని భయం. ఢిల్లీలోనే కొన్ని ఉదాహరణలు చూపిస్తాను:—

జమునాబజార్‌లో రోడ్డు ప్రాంతాన్ని ఒక డజనుమంది వ్యక్తులు ఆక్రమించి ఉండటంచేత రింగ్‌రోడ్డును పూర్తిచేయటం ఇంతవరకూ సాధ్యపడలేదు. కేంద్ర ప్రభుత్వంలోని కొందరు ప్రముఖుల మద్దతు వీరికి ఉండటంచేతనే వీరిలా ఆక్రమించగలిగారు. పార్లమెంటు రింగ్‌రోడ్డు వెయ్యటానికి ధనం మంజూరు చేసింది. ఆ ప్రముఖులు రింగ్‌రోడ్డు వెయ్యకూడదని పైకిగాని, చాటునగాని అడ్డుపడటం లేదనేది నిజమే. కాని ఆక్రమణదారులను కదల్చరాదని మాత్రం ఆజ్ఞాపించారు.

పురాణాఖిలాలో చాలా ఏళ్ళుగా కొందరు నిర్వాసితులు నివసిస్తున్నారు. వీరికి వేరేచోట నివాసం చూపించారు. కాని అక్కడికి కదిలిపోవటానికి వారిష్టపడటం లేదు. ఈలోగా మరెవరో ఆ నివాసాన్ని ఆక్రమించుకున్నారు. "స్నేహభావం" అనేసిద్ధాంతాన్ననుసరించి, ఆక్రమణదారులు తమ ఇష్టం వచ్చినంతకాలం పురాణాఖిలాలో ఉండవచ్చునని చెప్పారు. దుజానాభవనం విషయంలో కూడా ఇలాగే జరిగింది.

కాంగ్రెసు నాయకులకు దేశంమీదకంటే తమ పలుకుబడిమీద ఎక్కువ అభిమానమనే భావం ప్రబలుతోంది. పలుకుబడికి భంగం కలిగించే పనులేవీ చేయటానికి వారిష్టపడటం లేదు.

మనసులపై నియంత్రుత్వ వైఖరి వెనకాల గూడా ఇదే దృక్పథం, అంటే పలుకుబడిని కాపాడుకోవాలనే భావం కనిపిస్తోంది. భూములులేని వారికి భూములు పంచిపెడితే కాంగ్రెసు నాయకుల పలుకుబడి తప్పకుండా పెరుగుతుంది. భూములు కోల్పోయే "స్వార్థపరులు" సుసంఘటితులు కానందువల్లా, అలజడి చేయగల సత్తా వారికి లేనందువల్లా, వారిని నిర్మొహమాటంగా నిర్లక్ష్యం చేయవచ్చు.

ఇక ఆహార ధాన్యాల వ్యాపారాన్ని జాతీయం చేయటం విషయం—దీనివల్ల మూడవ తరగతి గుమాస్తాలకు ఉద్యోగాలు లభిస్తాయి. తద్వారా వారిలో కాంగ్రెసు నాయకుల పలుకుబడి పెరుగుతుంది. కాని, ఆహార ధాన్యాల వ్యాపారాన్నే వృత్తిగా పెట్టుకుని జీవించే లక్షలాది వ్యక్తులకు జీవనాధారం పోతుంది. అయితే వారూ సుసంఘటితులు కారు. వారిని సంఘ ద్రోహులకింద జమకట్టేశారు. కనుక వారేమైపోయినా ఫరవాలేదన్న మాట.

భూవసతికి పరిమితి, ఆహార ధాన్యాల వ్యాపారాన్ని జాతీయం చేయటం, సహకార సంస్థలు—ఈ మూడు నాగపూర్ తీర్మానాలకు కాంగ్రెసువాదులు వ్యతిరేకులు కారని భోగట్టా చేయగా తెలుస్తోంది. ఈ కొత్త పనులను నెరవేర్చగలిగిన సంస్థ లేదని మాత్రమే వారి విమర్శ. ఫలితాలనుగూర్చి జాగ్రత్తగా ఆలోచించకుండా నిర్ణయాలు చేశారని మాత్రమే వారి ఆక్షేపణ.

పరిహారం యివ్వకుండా ఎవరి ఆస్తినీ స్వాధీనం చేసుకోరాదని రాజ్యాంగం నిర్వచిస్తోంది. భూవసతికి పరిమితి పెట్టాలంటే పరిహారం ఇవ్వాలన్నమాట. ఈ పరిహారం ధనం రూ. 300 కోట్లదాకా ఇవ్వాల్సి వస్తుందని ఒక అంచనా. ఇంత డబ్బు ఎక్కణ్ణించి వస్తుంది? బాండు రాసిచ్చినా ఏటేటా వడ్డీ ఇచ్చుకోవాలి. అసలులో కొంత ఇచ్చుకోవాలి. అభివృద్ధి శిస్తు వేసినందుకు ఇప్పుడు జరుగుతున్న ఆందోళన చూస్తే భూములులేని వ్యవసాయ కూలీలకు భూములు పంచిపెడితే భూమి ధరలో కొంతైనా వాళ్లు ఇవ్వటానికి ఒప్పుకుంటారా అనేది అనుమానంగా ఉంది. భూవసతికి పరిమితి పనికిరాదని కాదు దీని అర్థం. భూమిసంస్కరణలు మంచివే, మెచ్చదగినవే. అయితే చిక్కులున్నాయని మాత్రమే నేననేది.

ఆహారధాన్యాల వ్యాపారజాతీయకరణను గూర్చి, సహకార సంస్థలనుగూర్చి ముందు నిర్ణయాలుచేసి, తరవాత వాటికి కార్యకర్తృసంఘాలను నియమించటం చూస్తే, ఆ నిర్ణయాలపై వచ్చిన విమర్శ సబబే అనిపిస్తోంది.

ఈ విమర్శకు సమాధానం ఏమిటి ? ఏం లేదు. "సూత్రప్రాయంగా దీనికి మీ రొప్పుకోండి. తరువాత దాన్ని ఎలా అమలు చెయ్యాలో చూస్తాం" అని సమాధానం. వెనకటికి పాకిస్థాన్ స్థాపనవిషయంలో జిన్నా ఇలాగే అనేవాడు.

దేశంలో ఆర్థిక పరిస్థితులు అధ్వాన్నంగా ఉన్నాయి గనక వాటిని మరిపించటం కోసమే ప్రభుత్వపక్షం ఇలా ఎప్పుడూ

(63 వ పేజి చూడండి)



# డెన్మార్క్ లో భారతీయ ప్రదర్శనలు

డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగెన్‌లో కిందటినెల రెండు భారతీయ ప్రదర్శనలు ఏర్పాటయ్యాయి. ఒకటి "నేటి భారతదేశం" అనేది. ఇది టౌన్ హాలులో జరిగింది. ఇంకోటి ఒక పెద్దషాపులో జరిగింది. దీంట్లో మన దేశపు కుటీరపరిశ్రమలలో తయారైన వస్తువులు ప్రదర్శించారు.

ఈ ప్రదర్శనలను ఐక్యరాజ్యసమితి విద్యా, వైజ్ఞానిక, సాంస్కృతిక సంస్థ తాలూకు డేనిష్ జాతీయసంఘంతో కలిసి డేనిష్ అంతర్జాతీయ సహకార మండలి ఏర్పాటుచేసింది. మైసూరులో వయోజన విద్య, వ్యవసాయ విద్య కార్యక్రమాలుగా పెట్టుకున్న విద్యాపీఠాలకు ధనం సేకరించేందుకు, ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల పరస్పర పరిచయానికి సమితి చేస్తున్న కృషికి దోహదం చేసేందుకూ ఈ ప్రదర్శనలు ఉద్దేశింప బడాయి. "నేటి భారతదేశం" ప్రదర్శనను డేనిష్ విద్యామంత్రి జోర్గెన్ జార్గెన్‌సెన్ ప్రారంభించారు.

కోపెన్‌హాగెన్ షాపులోని భారతీయ కుటీర పరిశ్రమల ప్రదర్శనం దృశ్యాన్ని పై ఫోటోలో చూడవచ్చును. ❖

# స్వామివారి ఉత్సవం



తడిపా తడిపా ఇంకా తుప్పర పడుతూనే వుంది. నేలంతా తడిసి బురద బురదగా వుంది. రాత్రిపూట కూడా పెద్ద వానకురిసే వుంటుంది. అంతా క్రొత్తచోటు.

గోపాలస్వామి గుడివుంది. ఆ వుత్సవాలు చూడటానికి ఎక్కడెక్కడ జనం, పనికట్టుకొనివచ్చి వాలుతారు. అప్పటికే జనం కిక్కిరిసిపోతున్నారు. ఉండటానికి చోటు కనిపించటం లేదు. అదేమీ అంత పెద్ద ఊరు కాదు. ఏ హోటలులోను బసచెయ్యటానికి ఏవైనా ఎరుగున్న వాళ్లుంటేఉండిపోవటం ఇది వీలుపడకపోతే అవీ ఇవీ తెచ్చుకుని వంట పెట్టటం. పరిచితులు ఎవ్వరూ లేరు. స్వయంపాకం అంతకంటె చేతకాదు. తీరా ఈ ఊరు వచ్చిపడినతర్వాత ఏదో మార్గం అన్వేషించాలిసే వస్తుంది. అంతేగాని వెనక్కు తిరిగి వెళ్ళం కదా!

తీవ్రంగా ఆలోచించుకుంటున్నాను. చూచాయగా తెలిసింది. ఇక్కడే ఎవరో డబ్బు పుచ్చుకుని భోజనం పెడతారని ఎవరో పుణ్యాత్ముడు ఆపూటకూళ్ళమ్మ ఇల్లు చూపించాడు.

మండువాయిల్లు. ముందూ వెనకా ఖాళీస్థలం. ఆ కాస్త ఆవరణలోనే పూలమొక్కలు, రకరకాల కాయగూరలు — ఆతోటను యెంతో శ్రద్ధగా పెంచుతున్నట్లు కనిపిస్తోంది. మండువాయిల్లు అవటం వలన లోపల కావలసినంత వెలుతురు. అయిదారుగదులున్నట్లున్నాయి. ఆగదుల్లో యెవరెవరో వున్నారుకూడా. పూటకూళ్ళమ్మ నాకు ఖాళీలేదని చెప్పి, బాటసార్లను యిరకాటంలో పెట్టటం మాకిష్టం వుండదంటూ, వాళ్ళస్టోరు రూములో ఓ భాగంలో సర్దుకోమని చెప్పింది. 'ఏ గదైనా ఖాళీ అవుతే మీకు యిస్తాను. మీరు యెన్నిరోజులుంటా' రేమిటి అన్నది.

'ఎన్నో రోజులు కూడా ఇక్కడ? స్వామివారి దర్శనం చేసుకుని వెళ్లిపోతాను' అన్నాను.

'ఆ! స్వామివారి దర్శనం అయినట్టే, మీరు వెళ్లినట్టే' అని నవ్వింది.

ఏమిటో వెకిలినవ్వు అనుకున్నాను.

దొడ్లోకి దారి చూపించింది బావి. చేద చూపించింది. నాకళ్లు కాగుపొయ్యికోసం వెదుకుతున్నాయి.

'ఏమయ్యా చలేస్తోందా!... చెప్పు. వేన్నీళ్లు యిస్తాన్లే' అనది.

ఆమాటకు బాగా చిరాకు కలిగినా, తమాయించుకుని, 'ఉంటే అట్లాగే యిప్పించండి' అన్నాను.

ఓబిందెడు నీళ్ళు అమాంతం తెచ్చి దొడ్లో పడేసింది. 'అదుగో బిందెలోనే చెంబుంది' అంటూ లోపలికి వెళ్లిపోయింది. ఏమిటో ఆమనిషి స్వభావం అనుకున్నాను.

'ఇప్పుడు మీరు వెళ్లలేరండి. నేను చెపుతున్నాగా. నాకిది కొత్త కనకనా! ఎన్నేళ్లబట్టి చూస్తున్నాను. సాయంత్రం వెళ్ళొచ్చు...' మంగమ్మ తన పనులేమిటో చేసుకుంటూనే చెప్పుకునిపోతోంది.

ఓండ్రునీళ్ళు వేడిచేసి తీసుకొచ్చింది ఓ గ్లాసునిండా 'కాఫీ తాగ'మంటూ.

'దీంట్లో పంచదార వున్నా వేశారా' అన్నాను.

'కాఫీలో పంచదార వెయ్యరటయ్యా, ఒట్టి అమాయకుడులాగా వున్నావే' అంటూ నావైపు చూసింది.

ఎవరో యిద్దరు పిల్లలు నేనున్న స్టోరురూముకు వస్తున్నారు, వెళుతున్నారు. ఏవేమిటో తీసుకుపోతున్నారు. ఏదైనా గది ఖాళీఅవుతుందేమో, కాస్త కుదురుకుందామనుకుంటున్నాను. ఆ యోగ్యతేమీ కనిపించటం లేదు. స్టోరురూముకు అనుకునే యింకోగది వున్నది. ఆ గది వాలకం చూస్తే, మంగమ్మదై

వుండాలనుకున్నాను. తలుపుతీస్తుంది. మళ్ళీ వేస్తుంది. ఆ యింట్లో మంగమ్మ బాణంలాగ దూసుకుపోతోంది. ఎప్పుడొస్తుందో, యెక్కడికివస్తుందో యెవ్వరికీ తెలీదు. ఇట్టే వస్తుంది. అట్టే వెళుతుంది. ఆ పనిచేస్తుంది. ఈ పనిచేస్తుంది. మధ్యలో చెణుకులు విసురుతుంది.

'నువ్వు ఆ స్టోరురూములో అంటిపెట్టుకుని కూర్చుంటే యెట్లాగయ్యా? భోజనం వేళవంగానే పిలుస్తానే, వాకిట్లో అరుగుమీద కూర్చోరాదూ! కొస్త చనువిస్తే సరి, మీదకెక్కుతారు. అందుకనే యిక్కడికి యెవ్వరినీ రానీయను...' బడబడా అంటూనే మంగమ్మ లోపలికి వెళ్ళిపోయింది.

నాకు చెడ్డకోపంవచ్చింది. చెర్రుమన్నాను. చివాలున లేచాను. మొహం చిటచిటలాడించుకుంటూ గదిబైటకువచ్చాను.

ఎప్పుడువచ్చిందో వచ్చేసింది మంగమ్మ. నాయెదురుగానే నిలబడివుంది.

'ఏమండీ కొస్త అరుగుమీదకువెళతారూ. మా అమ్మాయి చిన్నబట్ట కట్టుకుని యిటు వెళ్ళటానికి సిగ్గుపడుతోంది. మళ్ళీ యిప్పుడే వద్దురుగాన్లేండి! ......ఏమిటే అమ్మా, యీ సిగ్గు......బట్టకట్టుకునే వున్నావుగా, చప్పున పోవటానికి యేమిటలా వెనకాముందు చూస్తున్నావు...' మంగమ్మ అంది.

నేను వెళ్ళబోతుండగానే, ఆ అమ్మాయి తడిబట్టలతో శరీరం అటూ యిటూ కదిలించుకుంటూ, మధ్యమధ్య వంగుతూ అటూ యిటూ బిత్తరుచూపులు చూసుకుంటూ ఆ గదిలోకి తుర్రుమన్నది.

'వాళ్ళమ్మాయండి వాళ్ళమ్మాయి...' అన్నాడు ఒకాయన. నావంక వ్యంగ్యంగా చూస్తూ నవ్వుతూ.

'తెలుసు తెలుసు' అన్నాను.

'ఏవేళయిందే ఏవేళయింది చెప్పు. ఈ శృంగారం యిప్పటినుంచి యెందుకే. నీకేమన్నా మతిపోయిందా?......' మంగమ్మ ఓ కోరచూపుచూసి వెళ్ళిపోయింది.

'నీ బెడ్డింగులో యేమైనా ఖరీదుగల వస్తువులున్నాయా. అయినా నీ చొక్కా గదిలో పెట్టేవచ్చావా! అవుతే దాంతో యింక నీకేం పనిలేదన్నమాట...' అన్నాడు ఒకతను నావైపు దర్జాగాచూస్తూ.

'ఏం అక్కడపెడితే!...' అన్నాను.

'ఏం ఏమిటయ్యా! మంగమ్మ ఒట్టిదొంగమనిషి. ఏదుంటే అది కాజేస్తుంది... పైకి అట్లా మాట్లాడుతుందిగాని ఒట్టిదొంగది ...అదుగో యిటే వస్తున్నట్టున్నది,' అన్నాడు.

'అబ్బ! ఏంకోపాలయ్యా, నేను నిన్ను వాకిట్లో కూర్చోమన్నానే అనుకో. కూర్చోవటమే! అయినా మా అమ్మాయి వెళ్ళి యెంతసేపయింది! లోపలికి రా' అంది మంగమ్మ.

నేను అడుగులు చప్పుడులేకుండా వెనక్రొతే గదిలోకివెళ్ళి త్వరత్వరగా బెడ్డింగు చుట్టేసి, చొక్కా జేతులోకి తీసుకున్నాను, అమాంతం మంగమ్మ వచ్చేసింది.

'ఇదిగో యిటురండి. మీతో ఓ మాట. వాకిట్లో మీరు యెవరితో మాట్లాడుతున్నారో తెలుసా!... పచ్చిరాడి, ఒట్టి దొంగవెధవ. ఏదందుతే అది పట్టుకు వెళ్ళిపోతాడు. ఆ ఎదురుగదిలో వుంటాడు. వెళ్ళిపొమ్మంటే వెళ్ళడు. కొస్త జాగ్రత్తగా

## ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

వుండండి బాబు. తీరా మాయింటికి వచ్చిన తర్వాత, మీది పూచికపుల్లపోయినా మా ప్రాణం చివుక్కుమంటుంది. తర్వాత మీ యిష్టం...' మంగమ్మ అప్పటికే గంతేసింది.

మెల్లిగా చొక్కా మళ్ళీ చిలుకకొయ్యకు తగిలించాను. ముడిచిన బెడ్డింగు కూర్చుని మెల్లిగా విప్పుతున్నాను.

'ఏమండీ...' వెనకాతే నవ్వులు వినిపించినాయి. చప్పున వెనక్కు తిరిగి చూశాను.

మంగమ్మకూతురు. తడిబట్టలతో వెళుతున్నప్పుడు చూసిన మంగమ్మకూతురే!

'ఇదిగో తాళం, తాళంచెవి, ఆ మూల గది ఖాళీఅయింది. మిమ్మల్ని అక్కడవుంటమని మాఅమ్మ చెప్పింది'. నా చేతికి అందిచ్చి నీటుగా వెళ్ళిపోయింది.

బెడింగు చంకనపెట్టుకుని గదిలోకి వెళ్ళేటప్పటికి, పనిచేసేది గదియింకా వూడుస్తూనే వుంది. చప్పున నన్నుచూసి చేతిలో బెడ్డింగు అందుకుని లోపలపెట్టింది.

'రండి బాబుగారు' అన్నది.

'అయ్యా మీదేవూరు?...'

'నాదా?...' ఆశ్చర్యంగా పనిచేసేదానివైపుకు తిరిగాను.

'అవునండీ మీదే!... మిమ్మల్ని యెక్కడో చూసినట్టు వుందండి...'

'...ఎవర్నిచూసి యెవర్ననుకున్నావో. తొందరగా కానీ...' చివరగావున్న కుర్చీలోకివెళ్ళి కూర్చున్నాను విసుగుగా.

'అయ్యగారూ! మెల్లిగానండీ...ఆ కుర్చీకి మూడుకాళ్ళేనండి. అందుకనే అమ్మగారు



# ★ స్వామివారి ఉత్సవం ★

గోడకుఆనిచ్చిపెట్టారు.. 'అన్నది నవ్వుతూ.

పనిచేసేది నిష్క్రమించగానే, మంగమ్మ కూతురు చివాలున వచ్చింది.

'ఇదిగో మీ జేబురుమాల అక్కడ పడిపోయింది...పనిచేసేది యేమన్నా అడిగిందా? అది ఇక్కడకు వచ్చినవాళ్ళందర్నీ అలాగే అడుగుతుందిలెండి...ఊహూ.. హు' అంటూ నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

నేను గది గుమ్మందాకా చప్పున వెళ్ళి, సిగ్నలుదగ్గర రైలు ఆగిపోయినట్లు నిలబడిపోయాను.

'ఒరే ముత్యాలు! ఓముత్యాలు...ఎక్కడ చచ్చావురా. అసావిడి వూడవరా అంటే... సులోచన యెక్కడకు పోయింది. పనున్నప్పుడే అందరూ మాయమైపోతారు.. బాలకోటిదగ్గర వుందేమో చూసిరా...' మంగమ్మ తీవ్రంగా నా గదిలోకి వచ్చేసి 'ఏం నాయనా. యీ గది బాగుందా? ఏదో పల్లెటూరి వాళ్ళం. బస్తీ సౌకర్యాలు ఇక్కడే కావాలంటే ఎట్లా దొరుకుతాయి నాయనా?' నడిచిపోయింది.

'విస్తళ్ళెయ్యరా, విస్తళ్ళెయ్యి. ఏమిటి దిక్కులు చూస్తున్నావ్...పనులు చురుకుగా కానీండి...ఒసేయ్ అమ్మాయీ! అలా నుంచుంటే పనవుతాయిటే! ఆ!...ఎవరి స్తళ్ళో వాళ్ళొచ్చి కూర్చోండయ్యా!...

'అమ్మగారు అట్లాగే అంటారులెండి. మీరొచ్చి విస్తరిముందు కూర్చోండి' నన్ను చూసి ముత్యాలు నవ్వాడు. సులోచన నవ్వింది. నలుగురూ నవ్వారు. మంగమ్మ కూతురు నవ్వింది. నేను నవ్వాను.

'కత్తీలేని నెయ్యి. కాస్తంత వేయించుకో ...ఏమిటే అవస్థనే? చెంగులు ఓమూల విస్తట్లోనే వేలాడుతున్నాయి, కాస్త పైకిదోపుకుంటే యేం!...కట్టయ్యగారు పప్పందుకోండి...' మంగమ్మ ఒక్క మాపుతో బారువంతా కనుక్కుంది.

వడ్డన చురుకులో భోజనాలు ఇట్టే అయిపోయినాయి. గదిలోకి వెళ్ళి పడుకున్నాను. తలుపు ఓరగా వేసివుంచాను. తలుపుదగ్గరగా ఎవరో నుంచున్నట్టుగా అనుమానం వేసింది- 'ఎవరూ' అన్నాను.

'నేనేనండి కట్టయ్యనండి...మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుగా వుంది. జ్ఞాపకం రావట్లేదు. ఎక్కడా అని ఆలోచిస్తున్నాను.'

'నన్నా! నువ్వు చూశావా! చూసేవుంటావులే గాని...కాసేపు పడుకోనీ...' అటువైపుకు వత్తిగిలాను.

తలుపు లాగి కట్టయ్య వెళ్ళిపోయినట్లున్నాడు. ఇట్టే నిద్ర వచ్చేసింది. రాత్రికూడా నిద్ర లేదేమో బండనిద్ర పట్టింది. ఏమిటో లీలగా మాటలు వినిపిస్తున్నాయి. నిద్రలో కాలగమనం తెలీదు.

కళ్ళు తుడుచుకుంటూ లేస్తూనేవున్నాను, బాలకోటి తలుపు తోసుకుని వచ్చాడు.

'మీరు నిద్రపోతున్నారుగదా అని లేపలేదు. ఆ కట్టయ్యను లోపలికి యెంగుకు రానిచ్చారు. అంతనిద్ర వస్తుంటే తలుపు ఘడియ వేసుకుని పడుకోకపోయారా? పచ్చిదొంగండి. దొంగ. ఏవస్తువు బైట పెట్టుకోవటానికి ఆస్కారం లేదు. ఇట్టే మాయమైపోతుంది. కాస్త జాగ్రత్తగా వుండండి...' హెచ్చరికచేసి వెళ్ళిపోయాడు.

'మా అమ్మ కాఫీ యిస్తుందిట లోపలికి రమ్మంటోంది...' మంగమ్మకూతురు కబురు చెప్పి వెళ్ళిపోయింది.

అక్కడకు వెళితేగదా కాఫీ యిచ్చేది అని మెదలకుండా వూరుకున్నాను.

పొద్దువాలుతోంది. సులోచన చీపురుకట్ట పట్టుకునివచ్చి ఊడుస్తోంది. గదిగుమ్మం దగ్గర నిలబడ్డాను. 'అయ్యగారు, అయ్యగారు' అంటూ లోపల్నుంచి పిలుపులు వినపడ్డాయి.

'ఏమిటి ఊడవటంకాలా యింకా?' అన్నాను విసుగ్గా.

'అయ్యగారు' ఓమాట,' అన్నది. యెంతో సాహసంగా నేను లోపలికి వెళ్ళాను.

'మీరు కొత్తారుకాబట్టి చెపుతున్నా. ఆశమంచిదికాదు. కాస్త ఆగితే మీకే తెలుస్తుంది...హి...హి...' అంటూ వెనక్కు తిరిగింది.

'ఆశేమిటి'...గట్టిగా కసిరాను.

'ఆశమ్మగారండి. పెద్దమ్మగారికూతురు.'. సులోచన యింకోగదిలోకి వెళ్ళిపోయింది.

చొక్కా తొడుక్కున్నాను. చెప్పులు వేసుకుంటూ జేబులోకి మామూలుగానే చేతిని పోనిచ్చాను. ఏది మనీపర్సేది! రెండోజేబులోకి ఆదుర్దాగా చేతిని పోనిచ్చాను. ఎంతో గాభరా వేసింది. మనీపర్సు లేదు. తత్తరబిత్తరగా అటూయిటూ తడిమి చూశాను. బెడ్డింగు మడతలోవుంది. ఇప్పుడేగా జేబులోంచి తీసిపెట్టింది అప్పుడే అంతలోకీ మరిచిపోయాను. గదితాళం వేశాను ఇప్పుడేవస్తానంటూ బజారుకు బయలుదేరాను.

ఆ వూళ్ళో ఓచిన్న గ్రంథాలయం వుంది. దానికి ఆనుకునే ఓగుడి వున్నది. మండపంమీద యెక్కి ఏమిటో ఆలోచిస్తున్నా. ఆలోచిస్తూనే మనీపర్సు తీశాను. మనీపర్సు తెరిచిచూస్తున్నాను. మూడు నయాపైసలు అట్లాగే వున్నాయి. నోట్లు కాస్తామాయమయి పోయినాయి. గుండె ఆగినంత పనయింది. సరాసరి యింటికి వెళ్ళాను. 'మంగమ్మగారు, మంగమ్మగారు' అని బిగ్గరగా పిలిచాను.

'ఏమిటి నాయనా' అన్నది మంగమ్మ ఆప్యాయంగా. 'నా పర్సులో డబ్బు పోయిందండీ,' అన్నాను ఆదుర్దాగా.

'మా పనిచేసేదానికి చేతిదురుసుతనం వుంది. నాయనా! నేను చెపుదామనుకుంటూనే మరిచేపోయాను. ఎన్నెన్ని జ్ఞాపకం వుంటాయి కనక! అది డబ్బు తీస్తుంటే నేను పట్టుకుని చివాట్లుపెట్టి పంపించా.

నువ్వు బజారు వెళుతున్నట్టే నాకు తెలీదు. లేకపోతే అప్పుడే యిచ్చివుందును. ఇదిగో నాయనా నీ డబ్బు లెక్కపెట్టుకో నాయనా. ఆ బొత్తి బొత్తి భద్రంగా దాచివుంచా...' మంగమ్మ నావైపుకే చూస్తూ రెండు తుణాలు నిలబడింది.

'పది. పదిహేను రూపాయలు తగ్గినాయే!...'

'అయ్యో! అయ్యో! నా పిల్లమీద వట్టు నాయనా! పరాయివాళ్ళ సొమ్ము తిని నేను బాగుపడతానా? నీ డబ్బు తీసుకున్నవాళ్ళు నాశనం అయిపోతారు...'

'నేను మిమ్మల్నేమీ అనలేదే!...'

'ఇంకా పేరుపెట్టి అనాలేమిటి! డబ్బు తక్కువగా వుందంటే యేమిటి అర్థం. ఆ పని చేసేదానిదగ్గరతీసి మీకివ్వటంవచ్చింది. యింతకీ అనర్థం... అసలు యీ లోకంలో మంచికిమంచీ వుంది కనకనా!...' బడబడా అనేసింది మంగమ్మ.

గదిలోకి వెళ్ళాను. బెడ్డింగువిప్పిచూశాను. బట్టలన్నీ సరిగ్గానే వున్నట్టున్నాయి. అయితే కొత్త తుండుగుడ్డ తెచ్చానా లేదా అని అనుమానంగావుంది. ఏమయితేనేం అది కనిపించటం లేదు. మధ్యాహ్నంనుంచి ఎండ

ఫెళ్లున కాయటంవలన ఉక్కపోతోంది. అంత పెద్దవర్షం కురిసి, మళ్ళీ ఎండవచ్చి పడేటప్పటికి ఆ యిల్లంతా అదోరకం వాసనగా వుంది. ఆ గదిలో పడుకునేటట్టు కనిపించటంలేదు. పోనీ అరుబైట ఏ చాపన్నా వేసుకుని పడుకుందామా అంటే, మన డబ్బు మనకుంటుందో వుండదో అని అనుమానం. ఈ సందిగ్ధావస్థలో సతమతమవుతున్నాను. తలుపు తాళంవేసి వాకిట్లో అరుగుమీదకు వచ్చి కూర్చున్నాను.

అరుగు చివర ఒకమ్మాయి కూర్చుని ఖంగు ఖంగున దగ్గుతోంది. ఆయాసపడుతోంది. ఇంత మంచినీళ్లు తెచ్చి యిచ్చే దిక్కు కూడా కనిపించటంలేదు. చూస్తూ చూస్తూ అక్కడ కూర్చో బుద్ధి పుట్టలేదు. గిర్రున తిరిగి వాకిట్లోకి వెళ్ళిపోయాను. ఆ కాస్త వూళ్లో యెంతసేపు యెట్లా తిరిగినా, మళ్ళీ మంగమ్మ పూటకూళ్ళయిల్లే కనిపిస్తోంది. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, యిద్దరు ఆడవాళ్లు గబగబ ఆ యింట్లోకి ప్రవేశించారు. ప్రొద్దున్నుంచీ నాకు యెక్కడా తగిలేరే అనుకున్నాను. నేను యింట్లో అడుగు పెట్టానో లేదో, మంగమ్మ యెదురుగా వచ్చి నిలబడింది.

'దాసయ్యా చూశావా! యిదిగో అయిదు రూపాయలనోటు, స్టోరు రూములో బియ్యపు బస్తాకింద పడింది. నువ్వేమో యెక్కడపడితే అక్కడ డబ్బు పారేసుకుంటావు. మమ్మల్నేమో దొంగలంటావు.' మంగమ్మ నోటు అందిచ్చింది.

నేను మెదలకండా తీసుకుని జేబులో పెట్టుకున్నాను. చీకట్లు అప్పుడప్పుడే సాగుతున్నాయి. అంత మండువాకొంపలోను మధ్యలో బిక్కు బిక్కుమంటూ ఓ లాంతరు వెలిగించి పెట్టింది. దాని వెలుతురు ఆ గ్లాసు మసిలోపలే వుండిపోయింది. నేను గదిలోకి వెళ్ళాలన్నా, బైటకు రావాలన్నా ప్రాణాంతకంగా వుంది. ఈ చీకట్లలో యెవరు యెట్లా తాసిల్లుతారో అని ఎవరిగదిలో వాళ్లు ఓ బెడ్ లైటు పెట్టుకున్నట్టున్నారు. ఇంకా నాగది అంధకారంగానే వుంది.

'మంగమ్మగారూ' అని పిలవటానికి నా వళ్లు గలతరిస్తోంది. బాలకోటి గదిలో కూర్చుని దీపం ముందర నవ్వుకుంటున్నాడు. నాకు కనిపించని వ్యక్తి ఆ గదిలో యెవరో వుండివుండాలని అనుకుంటున్నాను. ఆయన దగ్గరకు వెళ్లి దీపం సంగతి అడుగుదామనుకుంటున్నాను. మళ్ళీ పస్తాయిస్తున్నాను. కాసేపు కూర్చుంటే, యెవరైనా తెచ్చి యిస్తారేమో చూద్దామనుకుంటే, యీలోపల యే తేలో అంటపాడిస్తే, వున్నది వుండగా యిదొకటి తెచ్చిపెట్టుకున్నవాళ్లం అవుతామని, అటూ ఇటూ చూసి ఆ మండువాలో లాంతరు మెల్లగా పైకితీశాను. నా గదివైపు అడుగు వేశానో లేదో, వెనకాల్నుంచే వచ్చేసి, 'యిది యిక్కడ పెట్టండి. మీకు వేరే దీపం యిస్తాం' అన్నది ఒకమ్మాయి, నా చేతిలోంచి లాంతరు తీసుకుంటూ. నా గుండె ఝల్లుమన్నది. ఇంతలోకే ఆశ ఓ దీపం పుచ్చుకుని నా గదిలోకి వచ్చింది. కిటికీలో దీపం పెట్టింది. నేను గదిగుమ్మందగ్గర నిలబడ్డాను. ఎంతసేపటికి లోపల్నుంచి బైటకురాదే! బైటకు రమ్మనమని పిలవటం యెట్లా! అట్లాకాదని నేను లోపలికి పోవటం యెట్లా!

'దీపం పెట్టావుగా' అన్నాను అక్కసుగా.

'పెట్టా'నంది.

తర్వాత మాట్లాడాలసింది నేనేగా!

'ఏంచేస్తున్నావు లోపల!...' అన్నాను.

'మా అమ్మ నీతో మాట్లాడమంది...'

'మీ అమ్మను పిలుచుకురా...' గట్టిగా గద్దించాను.

'మా అమ్మకాదు! నేనే!...' ఆశ నవ్వింది.

నా వళ్లు మండింది. చరచర వెనక్కు తిరిగి వెళ్లిపోతున్నాను. ఇద్దరు ఆడపిల్లలు విడ్డూరంగా చూస్తున్నారు. వాళ్ళ దృష్టిలోంచి తప్పించుకుని వాకిట్లోకి వెళ్లాను. సులోచన నిలబడివుంది. నదురూ బెదురూ లేకండా నావంకే చూస్తోంది. సులోచనను చూస్తుంటే, డబ్బు నిజంగా యెత్తుకుపోయిందా అనిపించింది. ఏమీ అనలేక పోయాను.

'అయ్యగారూ' అన్నది.

'ఏంకావాలి!...'

'ఇవ్వాళ యింట్లో యేం లేవండి!... మరి మీ గది నేను వూడవటంలా!...' నవ్వింది సులోచన.

ముత్యాలు, బాలకోటి నలుగుర్ని వెంట పెట్టుకుని గబగబ వస్తున్నారు. సులోచన యెక్కడికి వెళ్ళిందో యిట్టే మాయమైపోయింది. కొంతమంది భోజనంచేసి వెళ్ళిపోతున్నారు. మరికొంతమంది భోజనానికి వస్తున్నారు.

'డబ్బులు మా అమ్మాయి యిచ్చిపోండయ్యా...' అరుస్తోంది మంగమ్మ.

ఆశ, డబ్బులు వసూలు చేస్తూ నిలబడింది. ఒకళ్లిద్దరు కొంటెగా ఆశతో సరసాలాడుతున్నారు. ఆశ జవ

(64 వ పేజీ చూడండి)



ఒక సింహమూ, కుందేలూ కాఫీ హోటల్‌కు వెళ్లాయి. కుందేలు కారట్ హల్వా ఆర్డరిచ్చింది. "ఒకటా, రెండా" అని సర్వరు అడిగాడు. "ఒకటే" అంది కుందేలు. అది తిన్నతరువాత రెండు ఇడ్లీ సాంబారు ఆర్డరిచ్చింది.

"సింహంగారికి కూడా తెమ్మంటారా?" అని సర్వర్ అడిగాడు.

"అక్కర్లేదు" అంది కుందేలు.

తరువాత ఒక కాఫీ ఆర్డరిచ్చింది. "సింహంగారు కాఫీకూడా తాగరా?" అన్నాడు సర్వరు.

"తాగరు" అంది కుందేలు.

"ఏం వారికి ఆకలిలేదా?" అని ఆశ్చర్యపడుతూ సర్వరు అడిగాడు.

కుందేలు చిరాకుపడుతూ "వారికి ఆకలిగా ఉంటే నేనిక్కడెందుకుంటాను?" అని జవాబిచ్చింది. ★



# కళ్యాణి నైపుణ్యం

మా మామగారి దేశాటనానికి దాఖలాగానూ, స్వయం సంపూర్ణత్వానికి సాక్షిగానూ ఉండే పెద్ద సైజు హోల్డాలు ఒక శీతాకాలం సాయంత్రం మా ఇంటికి దొర్లుకొచ్చింది. ఆ సర్వజ్ఞుడి రాకంటే నాకెప్పుడూ అదోరకం హడలుగానే ఉంటుంది. ఆయన మా సంసారాన్ని బహుముఖంగా పరిశీలించి నా మీద సుడిగాలిలాంటి సలహాలనీ, వడగళ్లలాంటి విమర్శలనీ కురిపిస్తుంటారు.

ఆనాడూ అనుమాయతకి లోపం లేకుండా ఆయన ఓం ప్రథమంగా అన్నాడు: ఏమోయ్! నీ వాటం చూస్తే ఇల్లూ, ఆఫీసూ అనే ఎనిమిది గోడల మధ్యా గుడుగుడుగుంచాలాడడం తప్ప నీ జీవిత సరణిలో మార్పేమీ ఉన్నట్లు తోచదు!"

ఆ మాట మా ఆవిడ కళ్యాణి గుండెల్లో మెదిలే పాత ఫిర్యాదుని పైకి తెచ్చింది: ఎన్నాళ్లనుంచో అడుగుతున్నా సర్కసుకి తీసుకెళ్ల లేదని! "ఆ ఏనుగులు వృద్ధాప్యం వచ్చి హరీ అనే లోపులో మనకి సర్కసు చూడడం పడుతుందంటారా?" అందామె.

నిజానికి బ్రతుకే ఒక సర్కసు లేవే! అందామనిపించింది నాకు. ప్రొద్దున్నే బస్సుకోసం పరుగెత్తి దాంట్లో ఏ కడ్డీయో పట్టుకొని వేళ్లాడి బాలెన్సింగు ఫీట్లు చెయ్యడం, రోజంతా ఆఫీసరుగారి ఆగ్రహానుగ్రహాల ప్రకారం నడుచుకోవడమనే కత్తిమీద సాము

DL. 467A-X52 TL.

చెయ్యడం, సాయంత్రం ఇంటికి వచ్చి వన్యమృగాలవంటి... అబ్బే, ఆ మాటంటే ఇంకేమైనా ఉందా?

కనక పైకన్నాను: "మన పాత రాతియుగపు పెట్టిలోనుంచి నా స్వెట్టరు పైకి తియ్యి. ఈ రాత్రి వేడదాం."

"సరే కాని, ముందు మీ కాఫీతోపాటు ఫలహారం కావాలంటే అటకమీదనుంచి లడ్డూల పళ్లెం దింపి పెట్టండి." అందామె.

మా రామిగాడు పదేపదే దండయాత్రలు చేసి గంటకి రెండు చొప్పున లడ్డూలు కొట్టేస్తూంటే, ఆ పళ్లెం అటకని శరణు జొచ్చిందట. నేను ముక్కాలిపీట వేసుకుని పళ్లెం తీయ బోయాను. అంతలోనే షాక్ తగిలినట్లు చెయ్యి లాక్కోవలసి వచ్చింది. చీమలు! సూదంటురాయిని చుట్టుముట్టే ఇనప రజను లాగ కోట్లకొద్దీ చీమలు నా చేతిమీదకి పాకేశాయి!

"భయపడకండి! అవి ఋషి చీమలు. ఏమీ చెయ్యవు!" అంటూ కళ్యాణి నవ్వింది.

"మరే! నల్ల చీమలు కదూ?" అంటూ సర్వజ్ఞుడు అందుకున్నాడు. "చీమల్ని గురించి మనం నేర్చుకోవలసిన విషయాలు బోలెడున్నాయి. విను..."

కాఫీతోబాటు పెద్ద మోతాదున మామగారి లెక్చరు కూడా పుచ్చుకున్నాను. చీమలు ఆహార సేకరణ, అవి వర్షాకాలం కోసం వేసవిలోనే ఎల్లా ఆహారం నిలవేసుకుంటాయో, శీతల దేశాలలో జంతువులు చలికాలాని కెల్లా సిద్ధపడతాయో, కొన్ని జంతువులు దొరికినప్పుడు ఆహారాన్ని భక్షించేసి శరీరంలో క్రొవ్వుగా మార్చుకుని చలికాలమంతా హఠయోగిలాగ బొరియలలో ఎల్లాగ సమాధిలో ప్రవేశిస్తాయో...వగైరా. వగైరా.

"అల్లాగ భారీ ఎత్తున శరీరంలో క్రొవ్వు నిలవచేసుకునే ఏర్పాటు మానవుడిలో లేదు — నీవంటి కొద్దిమంది విషయంలో తప్ప!" అంటూ నా సైజుకేసి వేలు చూపించేడు. మళ్లీ లెక్చరందుకుని అన్నాడు: "కనక మానవుడు తనకు కావాలసిన క్రొవ్వు పదార్థాన్ని దైనందిన భోజనంతో తీసుకుంటూ ఉండాలి. క్రొవ్వు మనకు శక్తినిస్తుంది కనక మనకు కావలసిన క్రొవ్వు పదార్థాలని జాగ్రత్తగా ఎన్నుకోవాలి."

మళ్లీ బళ్లో సైన్సు క్లాసులో కూర్చున్నట్లనిపించింది నాకు! కాని ఒక విషయం ఆందోళనను కలిగించింది. మేము వంటలన్నిటికీ జాగ్రత్తగా ఎన్నుకున్న పదార్థం డాల్డా వనస్పతి. ఆయన సర్వజ్ఞుడే కాని 'డాల్డా' యొక్క గుణగణాలు ఆయన సర్వజ్ఞత్వం పద్ధతిలో ప్రవేశించాయా? లేక ఆయన చాదస్తంగా అది 'నవనాగరిక' పదార్థమని కుళంకలు తీస్తాడా? ఆ విషయమై మా ఆవిడతో మాట్లాడడానికి వంటింట్లోకి వెళ్లేను.

"మన వంటంతా మామూలులాగే 'డాల్డా'తో చేసేవమనుకుంటాను, మీ నాన్నగారేమేనా చాదస్తపు గొడవ పెడతారేమో!" అన్నాను.

నాకు తెలియకుండా నా వెనక్కాలే వచ్చిన మామగారు నే నులిక్కిపడేటట్లు పలికేడు: "నాకేం చాదస్తం లేదోయ్! కావలిస్తే 'డాల్డా'ని గురించి నీకు కొన్ని విషయాలు చెప్పగలను. ప్రశస్తమయిన కాయగూరల నూనెలతో చేసిన 'డాల్డా'లో శరీరారోగ్యానికి ముఖ్యమయిన ఎ., డి. విటమినులు కలుపుతారు. ఖర్జూరపు చెట్టు బొమ్మవేసిన డబ్బాలలో కల్తీలకి వీలు లేకుండా సీలువేసి అమ్ముతారు. 'డాల్డా'ని మా ఇంట్లో పిండివంటలకి వాడుకుంటూనే ఉంటాము."

ఆయన సర్వజ్ఞత్వం మీద విజయం సాధించడానికి నా కవకాశం దొరికింది. "అంత తెలిసిన వారు మరి ప్రశస్తమూ, పోషకమూ అయిన 'డాల్డా'ని రోజూ వంటలన్నిటికీ వాడుకో! ఒక్క పిండి వంటలకే వాడుకుంటారేం? మమ్మల్ని చూడండి! ప్రొద్దున్న ఉప్మా వగైరా ఫలహారాలకీ, భోజనాలలో కూరల వేపడాలకీ, పోపులకీ...అన్ని వంటలకీ 'డాల్డా'యే వాడుకుంటాం!"

"మరేనోయ్! నీ మాట సబబుగానే ఉంది." అని ఒప్పుకున్నాడాయన. భోజన మయ్యాక 'డాల్డా'తో చేసిన వంటకాలు స్వాదిష్టంగా ఉన్నాయని కూతు ర్నభినందించేడు.

తరువాత సర్కసుకి వెళ్లడానికి నా పాత స్వెట్టరు తొడుక్కోబోతే అది బిగువయి, దాంట్లో దూరడం సర్కసు ఫీటంత పనయింది.

"చచ్చాను, పదిహేను రూపాయలిచ్చి కొత్త స్వెట్టరు కొనుక్కోవాలి!" అన్నాను నేను.

"'డాల్డా'తో చేసిన రుచికరమూ, పుష్టికరమూ అయిన ఆహారం తింటూంటే పాత స్వెట్టరు బిగువవడంలో ఆశ్చర్యమేముంది?" అని మామగారు చమత్కరించేడు.

"ఫరవా లేదులెండి. ఆ డబ్బు నా 'డాల్డా' సేవింగ్సు బ్యాంకినుంచి తీసి ఇస్తాను." అంది మా ఆవిడ.

నా కళ్యాణి వంటలో ఎంత నిపుణురాలో పొదుపు చెయ్యడంలో కూడా అంత నేర్పరి అని వేరే చెప్పాలా?

శ్రీ శివశంకరస్వామి సింహాసనారోహణంసందర్భంలో సురభి సమాజ నటీ బృందం నీరాజనమిస్తున్న దృశ్యం.

# శ్రీ శివశంకరస్వామికి సన్మానం



శకారపాత్రధారి శ్రీ అవేటి నాగేశ్వరరావు, శివశంకరస్వామి, వసంతసేన పాత్రధారిణి శ్రీమతి చల్లాయమ్మ

బహుళ గ్రంథకర్త, కవి పండితులు శ్రీ శివశంకరస్వామిగారికి మార్చి 11 వ తేదీన నిడుబ్రోలులో న్యూ పూర్ణానంద థియేటర్సు — సురభి నాటక కళామండలి ఆధ్వర్యాన సన్మానం జరిగింది. సన్మాన సభకు శ్రీ నోరి నరసింహశాస్త్రి అధ్యక్షత వహించారు. శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి సభను ప్రారంభించారు. స్వామివారికి నాటక సమాజ కార్యదర్శి శ్రీ అవేటి నాగేశ్వరరావు పాదపూజ చేశారు. ఈ సందర్భంలో సురభి సమాజంవారు శూద్రకవిరచిత "మృచ్ఛకటికం" నాటకానికి శ్రీ మల్లాది వెంకటకృష్ణశర్మగారి అనువాదాన్ని జయప్రదంగా ప్రదర్శించారు. నాటకంలో శకార పాత్రను నాట్యకళాధురీణ శ్రీ అవేటి నాగేశ్వరరావు, వసంతసేన పాత్ర శ్రీమతి చల్లాయమ్మ, మైత్రేయ పాత్ర శ్రీ అనంతరామయ్య ధరించారు. 

# మంచుమనిషి

కాశీపట్నపు శ్రీనివాసరావు

ఇప్పటికి హిమాలయ పర్వతాల్లో మహోన్నత శృంగాలన్నీ అధిరోహింపబడినట్లే. ఇప్పుడు, మరోకవిషయం ప్రపంచ ప్రజల నాకర్షిస్తోంది. అది 'యేటి' అనే మంచుమనిషిని గూర్చి. ఆ మంచుమనిషిని అన్వేషించడానికనుమతికోసం ఆ మధ్య పాశ్చాత్యులవద్దనుండి నేపాల్ ప్రభుత్వానికనేక అభ్యర్థనలొచ్చాయి. మొత్తంమీద మానవాకృతిగల ఒక జంతువు హిమాలయాలలో సంచరిస్తోందన్న విషయం రూఢి. దానినే అచటివారు 'యేటి' అంటారు. పర్వతారోహకులు యేటీని చూడకపోయినా, మానవాకృతితో ఒక జంతు వచట వున్నదనీ, అది యెలుగు కాదనీ, కోతి కాదనీ కూడా విశ్వసించారు.

ఎవరెస్టు శిఖరవిజేత టెన్సింగ్ నార్గేనడిగితే, ఎవరెస్టు శిఖర మెంత నిశ్చయమో, యేటీకూడా అంత నిశ్చయమే నన్నాడు. ద్వితీయవిజేత, సర్ జాన్ హంట్, "హిమాలయాల్లో యేటీ వున్నది. దాని అడుగుజాడలను చూచాను. దానికూతను విన్నాను. అచటి ప్రముఖ వ్యక్తులకు దానితోగల స్వానుభవములను గూర్చి తెలుసుకున్నాను. లేకపోవడమేమి?" అన్నాడు.

ఆ మధ్య అచటికి వెళ్ళిన యాత్రికులు ఖాట్మండులో వెయ్యిమంది షెర్పాలను విచారిస్తే, దాదాపు వందమంది దానిని గురించి తెలుసునన్నారట. అందు పదిమంది యేటీతో తమకుగల స్వానుభవాలే చెప్పారట. ఖాట్మండుకు కొద్దిదూరంలో వున్న టార్కె గ్రామంలోని ఫర్పాషెర్పా తన స్వానుభవమునే చెప్పాడట. ఒకనాడాతడు మామూలుగా గ్రామం వెలుపలవున్న తన పిండిమిల్లువద్దకు ఉదయం పది గంటలకు వెళ్ళాడు. రోజూ సాయంత్రం మిల్లుకు తాళంవేసి, ఉదయం వెళ్ళేవాడు. అలాగే ఆనాడూ ఉదయం వెళ్ళాడు. మిల్లు తలుపులు తీసి వుండడం చూసి ఆశ్చర్యపోయాడట. తనకంటె ముందే తనవారెవరన్నా పిండి తీసికెళ్ళారనుకోడానికి తన భార్య ఒక్కర్తే, సుస్తీతో లేవలేని స్థితిలో మంచంలో వుంది. కాబట్టి దొంగలెవరో ఆ పని చేశారని నిశ్చయించి, కాపలా కాశాడు.

ఈ మాటు అడుగుల చప్పుడు కాకుండా మిల్లువద్దకు చాటుగా పోయాడు. తలుపులు తీసవున్నాయి. చాటుగా వుండి తొంగి చూశాడు. తానను కున్నట్లు మనిషికాదు. కాని మానవాకృతిలో పెద్ద జంతువు. దాని శరీరమంతా పొడుగాటి బొచ్చున్నది. అది ఒండినంతా తిని, యింకా పిండికోసం గ్రైండరులోకి తొంగి చూస్తోంది. అది షుమారు తొమ్మిదడుగుల యెత్తున్నది. అజానుబాహువట. తానదివరకు విన్న యేటీ అదేనని గ్రహించాడు. అంచేత భయంతోనే దాన్నింకా పరిశీలించాడు. దానిముఖం బల్లపరుపుగా వుంది. ముడతలున్నాయి. కోతివలెవున్నది. కాని ముఖాన బొచ్చు లేదు, దానితల యెత్తుగానూ, కోణాకృతిలోనూ వుంది. వెంట్రుకలు నడుమువరకు పైకి, నడుముక్రిందనుండి క్రిందికి వున్నాయి అది చాలా బలశాలి. కనీసం పదిమంది మనుషులనైనా ఒక్క ఊపులో చంపగలదు.

భల్లూకపు గోళ్ళున్నాయి. అడివిమృగమల్లే అరచింది. పిండిని రెండుచేతుల్తోనూ తిన్నది. అది తన్ను చూడకముందే, ప్రాణాలర చేతిలో పెట్టుకుని, చల్లగా దాటుకుని. దూరంపోయి, తన వాళ్ళకోసం కేకలు పెట్టాడు. ఆ కేకలను వినీవినగానే, అది గబగబా చేరువలోవున్న మంచుకొండలోకి రెండుకాళ్ళతోనూ పరుగెత్తి పారిపోయింది. వెంటనే పిలుపునందుకుని వచ్చిన గ్రామస్థులు కూడా దానిని చూచారట.

మకాలూ శిఖరాన్నెక్కిన ఫ్రెంచి జట్టువారు కూడా బారన్ కనుమవద్ద మంచులో యేటియొక్క అడుగులను చూచామన్నారు, గీడో మాగ్నోనుకు, హిమాలయ ప్రాంతమంతా అనేకసార్లు వెళ్ళడంచేత, చిరపరిచితము. ఏటీలనుగురించి అతని అభిప్రాయం:—ఏటీ అనేది తొలిమానవుని జాతికిచెంది, వన్యలక్షణాలు కలిగి, హిమాలయాలలో యెనిమిది మొదలు యిరువది యొక్క వేల అడుగుల మధ్య యెత్తున బ్రతికే జీవి. సాధారణంగా యేటీలన్నీ మకాలూ శిఖరాని కొఖరుగ్రామ మయిన సాదువా గ్రామాని కావల అడవులలో వుంటాయట. ఏటీ మనిషికి రెండింతలుండి. పదిమంది మనుషుల బలం కలిగి, వుంటుందట. అంచేతనే యేటీలు హిమగిరి మంచుపైకి సునాయాసంగా వెళ్ళగలుగుతున్నాయనీ, పైకి వెళ్ళినకొలదీ మానవునికంటె అనేక రెట్లుగా చలికి తట్టుకు నేశక్తి వవాటి కున్నదనీ చెబుతారు. ఒంటినిండా బొచ్చుతో పర్వతాలలో దట్టమైన అటవీవృక్షాలలో అవి నివసిస్తుంటే, అచటి స్థానిక షెర్పాలకయినా దానిని గుర్తింప నలవికాదట.

ఎప్పుడో కొన్ని సంవత్సరాల క్రితం, సిక్కిం సంస్థానంలో జలాప్ కనుమలకు మూడుమైళ్ళలో నున్న చుమింగ్ టాంగ్ వద్ద ఇండియన్ పోస్టు అండ్ టెలిగ్రాఫ్ల డిపార్టుమెంటు తాలూకు పన్నెండుగురిని, ఒంటినిండా బొచ్చుతో పంద్రెండడుగుల నిడివిగల ఒక జంతువు చంపినట్లు అధికారికంగా దాఖలాలున్నాయట. దరిమిలా సిక్కింలో పొలిటికల్ అఫీసరుగా వుంటున్న సర్. చార్లెస్ బెల్ కొంతమంది బ్రిటిషు సోల్జర్లతో, దానిని చంపించి, గాంగ్ టాక్ కు తెప్పించాడట. దానికి రెండు మూడంగుళాల పొడవుగల బొచ్చున్నదట. పాదాలు వెనక్కి వున్నాయట. అది యేటీ అని స్థానికులు గుర్తించారట.

1954లో స్విస్ పర్వతారోహకుడు రేమండ్ లాంబర్టు నాయకత్వాన ఎమ్. జూల్స్ డెట్రీ అను బెల్జియన్ వ్యక్తి గణేశ్ హిమాల్ కు వెళ్ళివచ్చి యిలా అన్నాడు: 'పైన చాలాయెత్తు ప్రదేశమున కొన్ని అడుగుల జాడలను చూశాము. అవి మనిషివిగాని, జంతువువిగానీ కాదు. అటివి బర్నాకొండల్లో చూచాము. అవి యేటీవి. తొలిమానవునిజాతి మనుషులు. హిమాలయాల్లో వుంటున్నాయి' అని.

ఏటీఅనేది మనిషీ, జంతువూ కాని మధ్యస్థ సృష్టి అనీ, అది పచ్చిమాంసమూ, దుంపలూ, పళ్ళూ తింటుందనీ, హిమాలయాలలో ఎనిమిదివేలు మొదలు, యిరువదియొక్క వేల అడుగుల యెత్తున, మహారణ్యాలలో వుంటుందనీ, అదెట్టి మంచుకొండలమీద కయినా, తన రెండుకాళ్ళతోనే అలాగ్గా యెక్కిపోగలదనీ, యెప్పుడో అవసరమైనప్పుడు, చేతులనుకూడా ఉపయోగించి యెక్కుతుందనీ, దానికి గృహనిర్మాణం విషయం తెలియ



ఎనిమిదిమంది భారతీయచిత్రకారులు వేసిన ఇరవై తైలవర్ణ చిత్రాలను ఇటీవల వాషింగ్టన్, వాట్కిన్స్ గ్యాలరీలో ప్రదర్శించారు. ఈ ప్రదర్శనకు భారతరాయబారి శ్రీ ఎమ్. సి. చాగ్లా ప్రారంభోత్సవం చేశారు. ప్రదర్శనకు హాజరైన చిత్రకారుడు శ్రీ సమంత్, ఏషియా సొసైటీ డైరెక్టరు పాల్ షెర్బర్డ్ శ్రీ హుసేన్ వేసిన "స్వరములు" అనే చిత్రం చూస్తున్నారు.

---

## ★ మంచుమనిషి ★

దనీ, సాధారణ వనజంతువులవలె అగ్ని అంటే దానికి కూడా భయమేననీ, అది ఒంటరిగా గానీ, మూడునాలుగు కలిసిగాని, సంచరిస్తాయనీ, ఖాట్మండూలోని షెర్పాసర్దారుల అభిప్రాయం.

పూర్వమచట అడవులు దట్టంగావుండి, మానవులూ పైకెళ్లిపోయి వ్యవసాయం చేయని రోజుల్లో—అనగా నర సంచారం లేని రోజుల్లో, యేటీలచట నిరాటంకంగా తిరుగుతూ, హిమాలయ పర్వతప్రాంతమంతా విశేషసంఖ్యలో వుండేవట. దరిమిలా జనసంఖ్య పెరుగుతున్న కొలదీ, అచటిజను లా ప్రదేశాన్నాక్రమించుకుంటూ వచ్చారు. అప్పుడచటి షెర్పాలు తమయిళ్లూ, వ్యవసాయాలూ రక్షణార్థం, రాత్రిళ్లు కుండల్లో మత్తుపదార్థాలు నింపి, అందులో విషం కలిపి, బయటవుంచేవారట. రాత్రులా యేటీలొచ్చి ఆ మద్యాన్ని త్రాగి, కొల్లలుగా చచ్చిపోయేవట. అలా చాలా యేటీలు నశించాయట. ఇప్పుడాయేటీలు బహుకొద్దిగా మాత్రమే వున్నాయనీ, అవికూడా జనసంచారానికి చాలా దూరంగా వుండిపోతున్నాయనీ, తెలుస్తోంది. అందులో మొగయేటీలు మన ఆడపిల్లలనూ, ఆడయేటీలు మన మగపిల్లలనూ కోరుతాయట. అదికాక మగయేటీకి మన మగపిల్లలను చూస్తేనూ, ఆడయేటీకి మన ఆడపిల్లలను చూస్తేనూ గిట్టదట.

వాటిలో బహు భార్యాత్వం వుంది. మీ—టే (Mee-Teh) అనే పెద్ద ఆడయేటీ, తెగకు పెద్ద. ఆడయేటీల వక్షములు క్రిందికి నడుమువరకూ వ్రేలాడుతుంటాయి. అంచేత అవి పరువెత్తునపుడు వాటిని తమ భుజములమీదకు వేసుకుంటాయట. పూర్ణిమ రోజుల్లో యేటీ లొక మహావృక్షం క్రింద గుంపుకూడుతాయి. అందులో మిక్కిలి బలంగలయేటీ ఆ వృక్షముయొక్క పెద్దకొమ్మను పట్టి, బలంగా క్రిందికివంచి, బలం ప్రదర్శించి, ఆ కొమ్మను గభాలున విడుస్తుంది. అలా విడవగానే ఆకొమ్మ, సుంయ్‌మంటూ వెనక్కిపోతుంటే, యేటీలానందంతో ఆర్భాటం చేస్తాయట. అలా ఆరాత్రంతా గడుపుతాయట. అది బహుశః ఒక ఆడయేటీ యొక్క మన్నన పొందడానికే అయ్యుంటుంది.

అంతేకాదు. అవి పెద్దపెద్ద కొండరాళ్ళ నెత్తి, బలంగా దూరానికి గిరవాటు వేస్తాయి. ఇదొక బలప్రదర్శనం. ఆ ఒక్కొక్క మహాశిలనూ, పదిహేనుగురు మనుషులు కలిసి కూడా యెత్తనైనా లేరట. అవి అంత బలంకలవి.

మానవులకూ యేటీలకూ సాంసారిక సంబంధం కూడా వుండడం సంభవమని తెలుస్తుంది. లాంగ్‌టాంగ్ పర్వతశ్రేణి పాదమున టార్కే అనే గ్రామంలో ఒక షెర్పా కుటుంబమున్నది. ఆ కుటుంబం వారు మగయేటీకినీ షెర్పా స్త్రీకినీ జన్మించారట. ఆ కుటుంబీకులు, అసాధారణంగా యెత్తుగానూ, కోతి ముఖాలతోనూ,

(64-వ పేజీ చూడండి)





కందుకూరి లింగరాజు

# సమన్వయం

(గత సంచిక తరువాయి)

పేరవధానులు ముఖం చూచినప్పుడే యాజులు అనుకున్నాడు. అతనికి మంత్ర శాస్త్రంలో ప్రవేశముందని. పైగా తెలుగు నాడులో ముంగరిడ, పులేటిపుర్రు మంత్ర శాస్త్రానికి ఆటపట్టులు అనీ తెలుసు. ఇటువంటి కానిదేశంలో ఏదో ఇలాంటి అవాంతరాలు తప్పించుకునేందుకు, రక్షణ పొందేందుకు కూడా వాటి అవసరం ప్రతి పండితుడికి కావలిసే వుంది.

మొదట్లో వసుపతి విద్యాభ్యాసం అయిన తర్వాత 'వాణ్ణి ఇందులో ప్రవేశ పెడితేనే కాని రక్షణలేదు' అన్న ఆలోచనలోనే ఉన్నాడు సోమయాజి. కాని వాడి ఉద్రేక ప్రవృత్తి, చిన్నవయస్సు, చెపితే ఏ దుందుడుకు పనులు చేస్తాడో అన్న భయంతో మానేసేడు. పైగా సంసార మమకారం కొంతవరకు తీరి, వ్యక్తిత్వం నిలబడ్డ తర్వాతనే చెప్పవచ్చు అన్న వాయిదాలో వుండిపోవడం తటస్థించింది, ఇన్నాళ్లూ.

తనే న్యాయస్థానంలో నుంచుని, వాది ప్రతివాదులిద్దరూ కూడా చెప్పింది విని తీర్పు చెప్పవలసివస్తే, వసుపతి చెప్పింది శాస్త్రసమ్మతంగానే వుంది. అందులో వాదన కూడా క్రమబద్ధంగా వుంది. అవతలాయనది మాత్రం పిడివాదనసరళిలో ఉందే తప్ప ఇంకోలా కన్పించనేలేదు. కాని ఒక్కటి మాత్రం, వసుపతి ఉద్రేకంలో పడిపోయి అతిక్రమణ చేసేడు, అనిపించింది. శాస్త్రాన్ని భుజబలం మీద, మంత్ర తంత్ర కుటిలోపాయాలమీద నిలపెట్టాలన్న మూర్ఖత్వం వసుపతిలో కన్పించింది.

దానికి ప్రతిక్రియ? ఇదే ఇదమిత్థంగా తేలక సంశయంలో పడిపోయేడు యాజులు. మనస్సు పరిపరివిధా లయిపోయింది. శకలాలు అయ్యింది.

పేరావధానులు ఖంగారుగా వస్తూనే "ఏమిటి; ఇల్లా కాలవిలంబనం చేస్తే వసుపతి దక్కడు మనకు" అనేసేడు.

ఆమూలాగ్రం ఓసారి చూచి, తల వంచేసుకున్నాడు యాజులు.

ఉడుతూ మడుతూవెళ్ళి, వూరంతా తిరిగి, ఓ వృద్ధ "సంచికట్టు" ఆయుర్వేదవైద్యుణ్ణి 'వరహా ఇస్తాం' అన్న ఆశ పెట్టి తీసుకు వచ్చేరు రామశాస్త్రీ, సుబ్రమణ్యశాస్త్రుల్లూనూ. గదిలో ప్రవేశపెట్టి నాడి చూపించేరు.

"చచ్చువాతం" అంటూనే ఆయన ఓ రెండు నల్లటిమాత్రలు ఇచ్చి వెళ్ళిన్నీ పోయేడు, కటక రోహిణి కషాయంతో వెయ్యమని.

అవధానులు ఇవన్నీ చూస్తూనే వుండిపోయేడు. సోమయాజులు మౌనం అర్థంకాక; పైగా ఆతనిలోని గాంభీర్యానికి అతనికి కాళ్ళు చేతులు ఆడనేలేదు. నోరు కట్టేసినట్లే అయింది.

రామశాస్త్రుల్లు, సుబ్రమణ్యశాస్త్రీ వస్తూనే, వీళ్లిద్దరి వైనం చూచి, అల్లాగే నుంచుండిపోయేరు; టీక తెలియక.

పేరావధాని ధైర్యం వచ్చినట్లుగా "అది చచ్చువాతమూ కాదు. పైత్యమూ కాదు. మంత్రప్రయోగం. భైరవుణ్ణే వదిలేడువాడు" అనీ అనేసేడు.

నిప్పు త్రొక్కినట్లు, నల్లత్రాచుని చూచినట్లు ఎగిరి గంతేసి బొమ్మలే అయ్యేరు వాళ్లిద్దరూ.

ఖంగారుగా, సభాపతీ, వగైరా వాళ్లంతా, వార్త వినగానే వచ్చేరు. పండరిపుర గౌరవం పోతుందని వలవలలాడుతూ వాళ్లు ప్రశ్నలు వేసేరు. ఏంచెయ్యాలి? 'ఆవృత్తపరుస్తాం' అన్న ఆత్రుతా కనపరిచేరు.

ఇంక వుండపట్టలేక సోమయాజి, వాళ్ళందరినీ మర్యాదచేసి కూర్చోమన్నాడు. నెమ్మదిగా అదే ఓ సభ అయినట్లయ్యింది.

"సభాపతిగారూ, ఆలోచిస్తూనే వున్నాను, ఏంచెయ్యాలీ అని. దాని పర్యవసానం తేలక సతమతమయ్యాపోతున్నాను.

ఓ ఉన్నత గౌరవం నా మెడకు మీరంతా చుట్టబెట్టేరు. దాన్ని సజావుగా, దేశ గౌరవం దృష్టిలో వుంచుకుని నిర్వహించగలను అన్న ధైర్యంతోనే అధిష్ఠించేను ఆ పీఠం.

కాని ఉన్న సత్యం—

శాస్త్రం శాస్త్రంలా విడమర్చి, తర్జన భర్జన చేసి, వాద ప్రతివాదాల్లో, తర్క వితర్కాలతో మెరుగులు దిద్ది, దేశ కాలపరిస్థితుల దృష్ట్యా తీర్చి దిద్దడం, పండితులకు, శాస్త్రవేత్తలకు, లక్ష్యం. దాన్ని పొందడం తమ విద్యలకు ఇంకోవన్నె పెంపొందించి

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## బాలల సంఘం
[సభ్యత్వపు దరఖాస్తు]

**GROUP**
**A లేక B**

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు ....
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు : ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీథి: నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, ఫారము : ....
పాఠశాల పేరు : ....
ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) :

ఆర్యా :
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1959]

(సంతకము)

* వరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

**సంచిక: 1-4-59 |** ఈ దరఖాస్తు **4-4-59** నాటికి మాకు చేరాలి |



## సమర్పణ



నట్లవుతుంది. గౌరవం, విలువ, ప్రతిష్ఠ హెచ్చవుతుంది. అది పండిత పామర జనానికి ఆమోదం అవుతుంది. శివప్రీతికరం కూడాను.

ఆ కల్యాణదృష్టి లేకపోతే, వాడు పండితుడూ కాడు. పామరుడికన్న, ఆఖరుకు పశువుకన్న అధముడే అవుతాడు," అని ఆగేడు. ఓసారి అందర్నీ కలయచూస్తూనే, అందరూ 'ఔ'నన్నట్లు తలలూపడంతో తృప్తి పొందేడు.

'ఈ మెట్టవేదాంతం మొదలుపెట్టేశేమిటి ఈయన. అవతల కొడుకు చావుబ్రతుకుల మధ్య వుంటే," అని పేరావధానులు పిసుక్కున్నాడు. రామశాస్త్రి సుబ్రమణ్యశాస్త్రి కూడా, "ఈ శాంతం ఎందులోకి వెళ్ళుతుంది ?" అన్నది అర్థంకాక ఊహల్లో పడిపోయేరు. 'ఏదో తప్పేదు' అన్న గాలి నింపుకున్నారు.

"ఇక శాస్త్రసహాయం సంపాదించుకోలేక, లోగసానుగా పరిస్థితులు కలిగినపుడు, ఓటమి అంగీకరించడం, ఎదుటి కక్షిని సమర్థించడం పండిత కర్తవ్యం. సర్వజన సమ్మతం.

కాని,—ఈ ఉత్కృష్టత సంపాదించుకోవాలని, తోటివారిలో తన పరువూ, ప్రతిష్ఠా భంగమైపోతోంది అన్న ఆవేశంలో, పండితులు క్షుద్ర మార్గాలను అవలంబిస్తూ, మంత్ర తంత్రాలతో ప్రతికక్షిని నిస్సహాయుణ్ణి చేసో, చిత్రవధచేసో జయించాలనుకోవడం పండితుడికే అగౌరవం, అప్రతిష్ఠ. సరస్వతీదేవికే ద్రోహం. వాడు పశువే అనాల్సి వస్తుంది. "అది క్షుద్రం. నీచాతినీచం అవుతుంది."

దీంతో ఉన్నవాళ్ళల్లో ఏ ప్రేక్షక దృష్ట్యా వచ్చినవాళ్ళకోతప్ప, తక్కిన వాళ్ళందరికీ అర్థం అయిపోయింది. దాంతో "ఇంత భండాలం జరిగిందా ?" అన్న ఆశ్చర్యం కల్గింది. దాంతో కొన్ని నిర్ణయాలకు వచ్చేసేరు. సభాపతి తలెత్తుకోలేకపోయేడు.

అతి నెమ్మదిగా "అదే జరిగింది ఇప్పుడు." అని పూరుకున్నాడు యాజులు.

"అమానుషం," అన్నాడు సభాపతి, పూర్తిగా ఉన్నది, విన్నది అర్థాలతో విపులీకరణ చేయబడితే. దాంతో వసువెంటే మరికొందరు పెద్దలు "ఏమి విపరీతకాలాలు వచ్చేయి," "ఎంత నీచాతి నీచానికి పాల్పడుతున్నారు పండితులు" "మన కందరికీ కూడా పెద్దతలవంపు, "ఆయన్ని సభలకు రాకుండా బహిష్కరించాలి" "బుద్ధి చెప్పాలి" ఆ వరసలో అనునయంచూపేరు.

చిరునవ్వు నవ్వుతూనే యాజులు విన్నాడు, కాని పేరావధాని అగ్గిబుగ్గి అయిపోయేడు, ఈ ముసలి బ్రాహ్మడు దాసోహం అనేస్తున్నాడన్న ఉక్రోషంలో.

"ఒకపెడ న్యాయాధిపతిని. ఇంకోపెడ ఆ పిల్లవాని తండ్రిని, మూడోపెడ విజ్ఞానం, విద్యకు దాసుణ్ణి; భృత్యుణ్ణికూడా.

ఈ పరిస్థితుల్లో ఏమిటి కర్తవ్యం అనే ఆలోచించి నిర్ణయానికి వచ్చేను.

మీ రిచ్చిన గౌరవపదవిని ఈ నాడే మళ్ళీ మీకు వప్పగించేస్తున్నా. ఎందుచేతనంటే మరోఘడియనుండి నేను తండ్రిగా, నా పుత్రుడుకోసం, ఆ సరస్వతీమతల్లి ముఖం చూచి, ఆయనకు ప్రతికక్షిగా అయ్యేపోతున్నాను."

ఒక్కసారి 'ఆ' అన్న ఆశ్చర్య సంభ్రమాలు వినవచ్చాయి.

పేరవధాని నోరు వెళ్ళబెట్టేసేడు.

"ఆయనకీ ఈ మంత్రశాస్త్రంలో బలాబలాలు చూపించుకోవాలన్న ఆశపుట్టి వుండవచ్చు. అంత చేతకాని దద్దమ్మలు, వాజమ్మలూ కారు తెలుగువాళ్ళు. అందులోనే

చూపించమనండి.

ఇది మీరు ఆయనకి చెప్పొచ్చు. నా నిర్ణయం అని తెలియచేయొచ్చు.

ఒక్కదినప్రమాణంలో మారణం చేసేందుకే ఉగ్రభైరవుణ్ణి ఆయన పంపించేరు. అందుకు నేను నా అంతట ఏమీ విచారించటం లేదు. అలజడి పొందటం లేదు. భీరువునై పోనూ లేదు. ఇదీ చెప్పవచ్చు మీరు.

ఇక వీటికి న్యాయమా ? ఆ చంద్రభాగ, పాండురంగడున్నా" అంటూనే లేచి నమస్కారం చేసేశాడు.

"పేరావధానీ! ఇంకా కూర్చున్నావేం? సంభారాలన్నీ ఏర్పాటు చేయించు. స్నానంచేసి సంధ్యవార్చుకుని వస్తా," అని ఒక్క కేక వేసేడు.

అంతవరకూ కూడా సోమయాజులికి మంత్రశాస్త్రంలో ప్రవేశంవుందని అనుకోని పేరవధానికి, గుండెలు తోడేసినట్లయ్యింది. ఆవేశంలో ఉప్పొంగిపోయేడు. ఊరుకే ఆగుమ్మం దాటడంలో.

అందరి ముఖాలమీద భయం, భీతి, పెనుభూతంలాగే నాట్యంచేసేయి. 'దీని పర్యవసానం ?' అన్న బెరుకూ కల్గింది.

రామశాస్త్రి, సుబ్రమణ్య శాస్త్రికూడా తను వెర్రివాక్కాయతనంలో వైద్యుణ్ణి పిలిచినందుకు నాలిక కరచుకుంటూనే, ఒక్కొక్క వ్యక్తే జారుతున్నప్పుడు "ఓరదేశ త్త పండితుల్లారా! మా ఆంధ్రుల్లోనూ వున్నారు జగజెట్టీలు, సర్వతోముఖ పండితులున్నా. మా సోమయాజులుగారంటే ఏమిటనుకున్నావ్" అన్న విజయగర్వపు చూపులు పారేసేరు.

శోకదేవత మూర్తీభవించినట్లే వున్న పార్వతమ్మగార్ని చూసి రామశాస్త్రి, సుబ్రమణ్యశాస్త్రుళ్ళు గుండెలు తరుక్కుపోయేయి. ఇప్పుడు కలిగిన ఉత్సాహంలోనే వెళ్ళి "అమ్మా! ఎందుకూ ఈ విచారం ? ఆ పరమేశ్వరుడే అభయమిస్తే" అన్నారు. ఆమె అమాయికంగానే "నిజంగా! ఎక్కడున్నాడు ఆయన ?" అంటూ చెదిరినమనస్సుతో అడిగేసింది.

అంతే.

అలా సంజ చీకటిమీదుగా దీపాల వెలిగింపుల్లోనే సోమయాజులు గదిలోకివెళ్ళేడు.

"బయట గొళ్లెం పెట్టు. ఏం జరిగినా సరే, నేను పిల్చేవరకూ తియ్యావద్దు" అంటూనే ఆయన కూర్చున్నాడు. పేరావధాని ఆ గుమ్మందగ్గరే జాగారం చేసేడు.

రామశాస్త్రి, సుబ్రమణ్య శాస్త్రికూడా కళ్ళల్లో ఒత్తులేసుకున్నవతుగా వీధిగుమ్మందగ్గర పహారా ఇచ్చేరు.

వేగుచుక్క నెలవెలపోతుంటే, ఊరు మేల్కొంది. డొక్కడొక్కని, రక్తపు చారలు నిలువునాకారితే, సొమ్మసిల్లి పైకం నలోకే వెళ్లి వసుపతి, భళ్లున తెల్లవారేసరికి "అమ్మా! దాహం" అన్నాడు.

ఉలిక్కిపడింది పార్వతి.

ఎగిరి ఒక్కఉదుటలో పేరావధాని వసుపతి మంచం దగ్గరకు వెళ్లి "వసుపతీ!" అన్నాడు. ప్రేమవాత్సల్యం,నరనరాల్లోంచి ఉబికాయి.

కళ్ళుఎత్తి "ఏమిటిది?" అన్నట్లు చూస్తూ నోరుకదిల్చాడు వసుపతి. అంతే! అక్కడ సోమయాజులుగారు పిల్చినట్లయితే, వెళ్లి తలుపుగొళ్ళెమూ తీసి భృత్యుడు వతుగా ప్రక్కకి ఒసరిల్లేడు.

పంచపాత్రతో వసుపతి దగ్గరకువస్తూ రెండు ఉద్ధరిణ్ణెలు తీర్థం నోట్లో పోసి, విభూతిపెట్టి, జబ్బకి రక్షకడుతూ "ఏమేవు! వాడిని స్నానంచేయించి, కాస్త పాలు ఇవ్వవే," అన్న పురమాయింపు చేసేడు యాజులు.

ఒక్కసారి నిలుచున్న వళంగా సాష్టాంగపడిపోయి పేరావధాని యాజులు కాళ్లు రెండూ పట్టుకుని "వీణ్ణి మీ శిష్యుడిక్రింద చేసుకోవాలి" అని అనేసేడు.

కరిగేపోయేడు యాజులు. వీపు తట్టుతూనే లేవతీసేడు.

అప్పటికప్పుడే, నూర్లమీద జనం వీధి తలుపులు బాదెయ్యడం జరిగింది. వాళ్లను

(39-వ పేజీ చూడండి)

# జీవిత దృశ్యాలు

శివరావు ముసలివాడైనాడు.

అని ఎవరు చెప్పారు?

గవర్నమెంటు చెప్పింది. మూడునెలల నుంచీ మంచం చెపుతున్నది. జబ్బు చెప్పింది.

శివరావుకి పెత్తనం వచ్చేసింది. 'ఇక బ్రతకటం కూడా అనవసరమే—' అని ఇంట్లోవాళ్ళు కొంతమంది అభిప్రాయ పడుతున్నట్లుగా శివరావుకీ తెలిసింది. శివరావు యేమీ అనుకోలేదు. 'చూశావా' అనీ అనుకోలేదు. నిర్లిప్తుగా వుండిపోయినాడు.

ఒక ఉదయం.

శివరావుకి నీరసం మరీ యెక్కువైంది.

అమ్మవొడిలోంచి తప్పించుకుని అందకుండా పరిగెత్తిన అల్లరిపిల్లవాడిలా తూర్పు దిక్కు వొడినుండి సూర్యుడు చాలాపైకి వచ్చాడు, ఎనిమిది గంటలు కావచ్చును.

డాక్టరు వచ్చాడు.

శివరావుని చూశాడు.

డాక్టరు ముఖంలో శివరావు చూశాడు. తనకోసం కొత్తలోకపు తలుపు లెవరో తెరుస్తున్నారు. ఆ తలుపులు తెరిచే ద్వార పాలకులు మంచివాళ్ళకు మంచివాళ్ళుగా, చెడ్డవాళ్ళకు చెడ్డవాళ్ళుగా కన్పిస్తారుట. శివరావు చూశాడు. శివరావుకి భయం వెయ్యలేదు.

డాక్టరు వెళ్ళిపొయ్యాడు. శివరావు కెందుకో దిగులైంది.

ఎందుకు? కొత్తలోకపు తలుపు లెవరో తెరుస్తున్నారు.

డాక్టరు ఇంట్లోవాళ్ళకు యేంచెప్పాడో? అంతా కళ్ళల్లో దయపెట్టుకుని చూసిపోతున్నారు.

ముసలాడికి దిగులైంది. నవ్వొచ్చింది.

కొడుకు వచ్చాడు. "నాన్నా కాఫీ త్రాగుతావా?"

కొడుకు మూడేళ్ళ పిల్లవాడిలా పిలిచాడు. ఈ మధ్య కాడెప్పుడూ అలా పిలవలేదు. శివరావుకి సంతోషమైంది.

కోడలు వచ్చింది. "మామయ్యా ఇంద, ఫియా కాస్త పుచ్చుకోండి."

ఎన్నాళ్ళైంది, ఇంత ఆత్మీయత కనపరచి!

ఎందుకు వీళ్ళందరికీ ఇంతదయ?

తనకోసం కొత్తలోకపు తలుపులు తెరుస్తున్నారు.

అందుకే. వీళ్ళ కళ్ళు చెమరిస్తున్నాయి.

ఇది వీడ్కోలు కాబోలును.

అందుకా యింత ఆర్ద్రత! అవును మరి. వీడ్కోలు దృశ్యంలో కపటాలు, కార్పణ్యాలు, కోపాలూ తాపాలూ, అన్నీ వదిలేసుకుంటారు. అందరు మనుష్యులూ అంతే.

ముసలాడికి నవ్వొచ్చింది.

కొడుకు ఆఫీసు నుంచి ముందుగా వచ్చాడు.

కోడలు పదిసార్లు వచ్చి తొంగిచూసిపోయింది. మూడుసార్లు జ్వరం చూసింది. నాలుగుసార్లు దుప్పటి కప్పింది. రెండుసార్లు మందిచ్చింది. ఒకసారి పలకరించింది. కొడుకొచ్చి పక్కనే కూచున్నాడు.

ముసలాడికి కళ్ళలో ప్రాణం వచ్చింది.

మూడురోజు లిలాగే జరిగింది.

ముసలాడు కోలుకున్నాడు. కొత్తలోకపు తలుపు లిప్పుడప్పుడే తెరువట. బ్రతకాలనిపిస్తోంది.

"మంజుశ్రీ"

నాలుగోరోజు డాక్టరు చెప్పాడు కొడుకుతో.

"తమాషాగా వుందండీ. కోలుకుంటాడని అనుకోలేదు. ఇప్పుడప్పుడే యేంఫరవాలేదు"

ముసలాడు విన్నాడు. నిర్లిప్తతతో వూరుకున్నాడు.

మర్రోజునుంచీ మళ్ళీ మొదలు.

అతడు బ్రతకటం అనవసరం. పెద్దతనం వచ్చేసింది.

పక్కలో యెవరూవచ్చి కూర్చోరు. దుప్పటి యెవ్వరూ కప్పరు.

శివరావుకి చిత్రమైంది.

శివరావు యెందుకు బ్రతికాడు?

వాళ్లు తనమీద అంతప్రేమ చూపుతుంటే డాక్టరు అలా చెప్పినప్పటినుంచి కళ్ళ నీళ్ళు పెట్టుకుంటుంటే, వీళ్ళకు తాను కావాలని, గుండెలకి హాయికలిగి, బలంవచ్చి, మనసుకి బతకాలని వాంఛకలిగి బతికాడు.

కాని శివరావుకి మర్రోజే తెలిసింది. తాను తప్పుగా అర్థంచేసుకున్నాడని. వీళ్ళకు తనమీద ప్రేమలేదు. పాపం చచ్చిపోతాడు గదా అని జాలిపడ్డారు. తాను తెలుసుకోలేదు.

మళ్ళీ డాక్టరు వచ్చాడు.

"మళ్ళీ దిగజారిపోయాడేమిటండీ" అన్నాడు కొడుకుతో.

కొడుకు మాటాడలేదు.

కోడలు మాటాడలేదు.

ముసలాడు విస్తుపోలేదు.

'జాగ్రత్త' అన్నాడు డాక్టరు.

అని వెళిపొయ్యాడు.

శివరావు ఆలోచించాడు.

ఏమిటీ జీవితం? అని.

ఏమిటీమనుషులు? అని.

ఎందుకు బ్రతుకుతున్నాం. బ్రతికి యేం సాధిస్తున్నాం, అని.

చచ్చిపోతాం. చచ్చిపోయిన తర్వాత యేమిటని?

కథ మొదలు. అనగాఅనగా వోఊళ్లో వోఅయ్యా, అమ్మావున్నారు. వాళ్ళకో అబ్బాయి పుట్టాడు.

ఆ అబ్బాయి వాళ్ళమ్మ కాళ్ళమీద వేసుకుని నీళ్లుపోస్తుంటే యేడ్చాడు. సాంబ్రాణి ధూపం వేసుకున్నాడు. కళ్లకు కాటుక పెట్టుకున్నాడు. నుదుట చాదుచుక్క పెట్టుకున్నాడు. ఉయ్యాల్లో నిద్రపోయాడు. బోర్లపడ్డాడు. బోసినవ్వులు నవ్వాడు. అందరినీ నవ్వించాడు. ముద్దులు పెట్టించుకున్నాడు. గోరుముద్దులు అన్నాడు. కూచున్నాడు. నిలుచున్నాడు. తప్పటడుగులు వేశాడు.

బడికిపోయినాడు. బలపాలు విరుచుకున్నాడు. పలకలు పగులకొట్టుకున్నాడు. అ, ఆ లు దిద్దుకొన్నాడు. దెబ్బలు తగిలితే వీపురుద్దుకున్నాడు. గుణితం నేర్చుకున్నాడు. గోడకుర్చీలు వేశాడు. వాచకాలు చదివాడు. పద్యాలు కంఠస్థంచేశాడు. కూడికలూ, తీసివేతలు, హెచ్చవేతలు, భాగాహారాలు, ఇరవైయెక్కాలూ నేర్చుకున్నాడు. ఇంకాస్త పెద్దవాడైనాడు. గోలీకాయలాడాడు. బిళ్లాకోడూ ఆడాడు. ఇంకాస్త పెద్దవాడైనాడు. రహస్యంగా బీడీలు కాల్చాడు.

ఇంకా, ఇంకా...ఒక్కొక్కక్లాసేచదివి పెద్దచదువుకొచ్చాడు.

నలగని, మడతలు చెరగనిబట్టలు కట్టుకోవటం నేర్చుకున్నాడు. జుట్టు చెదరకూడదు. రహస్యంగా అమ్మాయిల వేపు దొంగచూపులు చూడటం నేర్చుకున్నాడు. వినపడీ వినపడకుండాకూనిరాగాలుతీశాడు.

ఇంకా ఇంకా, మంచి మంచికథలు చదవటం నేర్చుకున్నాడు.

అందాన్ని అరాధించటం నేర్చుకున్నాడు.

ఏమిటో అసంతృప్తి, ఏమిటో మెుతి ఏమిటో అశాంతి.

కలలు కంటాడు పువ్వులని ప్రేమిస్తాడు.

కలలు, కలలు, కలలు.

అందమైన అమ్మాయిలు సినిమాలు, పార్కులు, పత్రికలు.

జీవితం పైన ఆదరం భవిష్యత్తుపైన ఆశ, గతాన్ని తలుచుకోని గర్వం, వర్తమానం అంటే భయం లేకపోవటం, ఇదీ యవ్వనం.

పెద్ద చదువులు చదివాడు. ఏదో ఉద్యోగమూ వచ్చింది.

జీవితంలో రెండోదశ.

పెండ్లి కూడా అయింది.

కలలో పండించుకున్న ఆశలను రానిపోసుకున్నాడు.

చిటికెనవేలు యిచ్చి హోమగుండం చుట్టూ ప్రదక్షిణాలు చేయించాడు.

ఒకరు ఇద్దరయినాడు. మధుపర్కాలు ముడివేసుకున్నారు.

తలంబ్రాలు పోసుకున్నారు. "మమజీవన హేతునా..." అన్నాడు. బొట్టుపెట్టాడు. గంధం పూశాడు. బొట్టు పెట్టించుకున్నాడు. గంధం పూయించుకున్నాడు.

కన్నుల్లో కన్నులుంచి బ్రతుకులోని తీయందనాన్ని అనుభవించాడు. ప్రియురాలి కన్నుల్లో జీవితానికి వ్యాఖ్యానంచదువుకున్నాడు. ఆమె చిరునవ్వును వెన్నెలనుకున్నాడు.

ఆమెకండ్లు మన్మథుని విండ్లు అనుకున్నాడు. ఆమె దేవత అనుకున్నాడు. తాను దేవుడైనాడు.

"అవిదిత గతయామా......"

ఇంకా ఇంకా......పిల్లల్నికన్నాడు.

ఆమెనే అప్పుడప్పుడూ చీదరించుకోవటం నేర్చుకున్నాడు. కలలు కరిగిపోయినవి, కళ్లలో కాంతి తగ్గింది.

పిల్లలు పెద్దవాళ్లవుతుంటే చూసి ఆనందించటం నేర్చుకున్నాడు: తనప్రేమను పంచుకున్నాడు.

ఎన్నెన్నో ఊళ్ళు చూశాడు.

ఎంతెంతమందినో మనుష్యులని చూశాడు.

బ్రతుకులోని ఇదివరలో అనుభవించిన తీపిని [?]రువేసుకుంటం నేర్చుకున్నాడు. అప్పుడప్పుడు ఉస్సురని నిట్టూర్చేవాడు, బాధ్యతలూ, బరువులూ, బాధలూ, గడచిపోయినగాథలూ...



"నాతోటీరాయె యెంం"

చిత్రకారుడు : కొర్లపాటి వెంకటసత్యనారాయణమూర్తి—వాల్తేరు.

ఎన్నెన్ని రకాల మనుష్యుల్ని చూశాడు

ఎన్నిటికి బాధపడాడు?

ఎన్నిటికి సంతోషించాడు?

ఎన్నికష్టాలు వచ్చినై, ఎన్ని కన్నీళ్ళు కారినై.

తనచుట్టూ ప్రపంచాన్ని చూసి అప్పుడప్పుడు దడుసుకున్నాడు. ఎందుకు? చిత్రమైనదీ ప్రపంచం.

దేవతార్చన చేస్తూనే గోమాంసం అనే మనుష్యలున్నారిక్కడ. చిరునవ్వులు వెలారిస్తూనే చిచ్చుపెట్టగలవాళ్ళున్నారిక్కడ. నోటితో మాటాడుతూ నొసలుతో వెక్కిరించగలరు మనుష్యులు. ఆత్మలులేని శరీరాలు యెన్నోవున్నాయి. నీతిని గురించి ఉపన్యాసాలు చెపుతూ అవినీతిపనులు యెన్నైనా చేయగలరు. వంచన, దగా, మోసం, జీవితానికి ముఖ్యమైనాయి.

అతనూ చేశాడు యెన్నో పాడుపనులు.

అబద్ధాలు చెప్పాడు. నీచులను పొగిడాడు. పనులు చేయించుకున్నాడు.

కొడుకులకు చదువులు చెప్పించాడు.

కూతుళ్లకు పెళ్లిళ్లుచేశాడు,

కొడుకులకు పెళ్లిళ్లుచేశాడు.

కూతుళ్లను పురుళ్లకుతెచ్చాడు.

కొడుకులకూ, కూతుళ్లకూ కొడుకులూ, కూతుళ్లూ పుడుతుంటే బారసాలలు చేయించాడు. వ్రతాలు చేయించాడు.

బారసాల పీటలమీద మంచిబట్టలు పెట్టలేదని అల్లుడలిగితే తాను అలిగిన రోజులు గుర్తుతెచ్చుకున్నాడు.

వానవస్తే యెన్నెన్నో అనుభూతులు త్రవ్వుకునేవాడు.

ఆమె యెక్కడుందో చూసేవాడు.

వానలో తడిస్తే ఇంటికి వచ్చినప్పుడు ఆమె కళ్ళలో యెంత ఆత్రుత? నీళ్లు వస్తాయేమోనని తల ప్రక్కకి త్రిప్పుకోవటం గురుకి తెచ్చుకునేవాడు. రహస్యంగా కాఫీలు అందించటాలు, తాంబూల చర్వణాలు...జీవితం మారిపోతుందిసుమా అనుకునేవాడు.

ఎక్కడినుంచో భగవద్గీత కొనుక్కొచ్చుకున్నాడు.

ఈమధ్యనే రామకోటి వ్రాయటం మొదలెట్టాడు.

పర్వదినాల్లో ఉపవాసాలుంటున్నాడు, అప్పుడప్పుడూ దేవాలయానికి పోతున్నాడు. "గోవిందంభజ మూఢమతే..." అంటున్నాడు అప్పుడప్పుడూ.

(45-వ పేజి చూడండి)

# సీతా స్వయంవరం

గుంటూరు,

ప్రియమైన శారదకు,

ఇదివరలో నీవు వ్రాసిన ఉత్తరాలకు జవాబులు వ్రాయటానికి అశ్రద్ధ చేసినందుకు, క్షమించు. అక్కడ నీవు, మీ శ్రీవారు, బాబుతో సహా అంతా క్షేమంగా ఉన్నారని తలుస్తాను. ఇచ్చట అంతా క్షేమమే.

ఇన్ని రోజులుగా ఉత్తరాలు వ్రాయని నేను, అకస్మాత్తుగా ఉత్తరం ఎందుకు వ్రాశానా అని ఆశ్చర్యపోతున్నావా! ఐతే చదువు...

ఈ ప్రపంచంలో నీకంటె హృదయం విప్పి చెప్పుకోగల ఆప్తులెవ్వరూ కన్పించలేదు. ఇదివరలో నీవు అన్నట్లు, మనకు మన కుటుంబములోని వారితో, ముఖ్యంగా తలిదండ్రులతో, మనకు గౌరవముతో కూడిన, ప్రేమాభిమానాలేగాని, నీకు నాకు ఉన్న చనువు ఎట్లా ఉంటుంది?

రెండేళ్ల క్రితం, నీ పెళ్లైన కొత్తల్లో, పుట్టింటికి వచ్చినప్పుడన్నావు, జ్ఞాపకం ఉందా!—తలిదండ్రులతో కూడా మనస్సు విప్పి చెప్పుకోటానికి వీలు లేని కొన్ని సున్నితమైన పరిస్థితులు అప్పుడప్పుడూ ఏర్పడుతాయని. అప్పట్లో నీమాటల్ని కేవలం భావకవిత్వంగా భావించేదాన్ని సుమా! కానీ, ఇప్పుడిప్పుడే, నా జీవితంలో జరుగుతూన్న సంఘటనల్ని బట్టి, నీవన్న మాటలు అక్షరాలా నిజమేననిపిస్తున్నాయ్! ప్రస్తుత పరిస్థితులలో, నేను మనస్సు విప్పి మా అమ్మకు కూడా చెప్పలేకుండా ఉన్నాను శారదా! కానీ, నా హృదయంలోని ఆరాటాన్ని ఎలా తగ్గించుకోడం! హృదయంలోని వ్యథను ఎలా రూపుమాపడం! మనస్సు విప్పి ఆప్తులతో చెప్పుకుంటే, కొంత హృదయభారం తగ్గుతుందేమోనని నీకు వ్రాస్తున్నా! ఇది మీవారికి చెప్పకుండా, దాచగలవా అని అనుమానంగా ఉన్నా, హృదయంలో పొంగి పొరలిపోతూన్న ఈ అనుభూతుల్ని, కొంత నీకు తెలియబరిస్తే, హృదయానికి, ఉపశాంతి లభిస్తుందేమోనని ఆశిస్తున్నా!

నీకు తెలుసనుకుంటా! మొన్న మార్చిలో నేను మెట్రిక్ ప్యాసయ్యానని. కానీ, నీకున్న శాంతిమయమైన జీవితం నాకెక్కడుంది! ఇంతలో, నేను నిన్ను చూచి ఈర్ష్య పొందుతున్నానని అనుకోకుసుమా!..

ఆరోజు ఆదివారం. ఎవరో నన్ను చూడ్డానికి, సాయంకాలం వస్తారని, నాన్నగారు నాకు పొద్దున్నే చెప్పారు. అమ్మ హడావుడిచేసి నన్ను రెండింటికే ముస్తాబు చేసేసింది. నీకైనా నిజం చెప్పొద్దూ... ఆరోజున నాకు కూడా ఉత్సాహంగానే ఉంది. ఏవేవో తీయని భావాలూ, హాయిగొల్పే అనుభూతులూ, మనస్సులో కమ్ముకున్నాయ్!...

ఆయన, అంటే...ఆ అబ్బాయి, బి.యస్‌సి చదివాడుట. బి. యల్. చదివే ఉద్దేశ్యంలో ఉన్నాట్ట. నేను తలవంచుకున్నా, ఆ అబ్బాయి నన్ను ఎంత పరిశీలనగా చూచాడో గ్రహించుకున్నా. ఆ భావనలో, నా శరీరం ముడుచుకుపోతున్నట్లనిపించింది సుమా!...

ఆ అబ్బాయితరఫువాళ్ళడిగిన, హిరణ్యాక్షువరాలన్నిటికి సరేనన్నాడుట మానాన్న. కానీ, తాంబూలాలు పుచ్చుకోటం మాత్రం మర్నాటికి వాయిదా వేశారు. ఆరోజే

## దేవగుప్తం శేషు

మానాన్న ముహూర్తం కూడా విచారించి వచ్చాడు, పురోహితునితో. కాని ఏం లాభం నిన్ననే వచ్చింది ఉత్తరం వాళ్ళదగ్గరనుండి; నేను పొడుగ్గా ఉన్నానుట! అందుకని ట అబ్బాయికి నచ్చలేదట.

...పొడుగ్గా ఉండటమే పాపమా? నేను ఎంతసేపు ఇది తల్చుకొని ఏడ్చానో నాకే తెలీదు.

ఎలాగైనా మానాన్న గట్టిగానే ప్రయత్నిస్తున్నారు, నా పెళ్ళికై చూశావా, నన్ను వదిలించుకోడానికి ఎంత తొందరో మా నాన్నకు. మొన్న ఆయన నోరార అంటుంటే విన్నాను, నేను పెద్దభారంగా ఉన్నానని, ఆభారాన్ని దింపుకొనేవరకు ఆయనకు విశ్రాంతి ఉండదనీ!

అబ్బ! చాలా వ్రాసినట్లున్నాను! మన చనువు దృష్టిలో పెట్టుకొని, ఈ విషయాలన్నీ, మీ వారికి కూడా చెప్పకుండా, దాచిపెడ్తావని ఆశిస్తున్నా!

ఇట్లు—నీ
సీత—

* * *

హైదరాబాదు.

ప్రియమైన సీతకు,

నీ ఉత్తరం అందింది. అది చదువుతుంటే అందులో అక్షరాల వెనుక నీ ప్రతిబింబమే నాకు కన్పించింది సుమా! నీవే ఎదురుగా కూర్చొని చెప్తున్నట్టు అనిపించింది. కానీ ఇక్కడ ఉండి నేనుమాత్రం యేమి చెయ్యగలను, ఒక నిట్టూర్పు విడవడం తప్ప.

జ్ఞాపకం తెచ్చుకో. నాకు ఫోర్తుఫారం చదువుతున్నప్పుడే పెళ్ళయితే, నీవు నాకెన్ని గుణపాఠాలు చెప్పావు, నేను తొందరగా పెళ్ళిచేసుకున్నానని. అప్పుడున్న మనోధైర్యం ఇప్పుడు నీలో అదృశ్యమైనట్లుందే!

ఏది ఏమైనా, నీవు నీ హృదయాన్ని అంత కష్టపెట్టుకోవాల్సిన అవసరం నాకేం కన్పించటంలేదే! అతనికంటికినువ్వు పొడుగ్గా కన్పించినంత మాత్రాన, నువ్వు వివాహానికి అనర్హురాలవని ఎవరైనా అనగలరా! అతను నిన్ను తిరస్కరించాడనే ఉక్రోషం నీకెందుకు?...మనస్సు ఇతర విషయాలలోకి మళ్ళించుకో. ఎప్పుడూ ఇదేవిషయాన్ని గురించి ఆలోచిస్తూ మనస్సు పాడు చేసుకోకు.

అదీగాక, ఇప్పుడు నీపెళ్ళికి వచ్చిన తొందరేమిటి? నిజంగా, నీకు పెళ్ళి ఇప్పుడే అత్యవసరమని నీవేమీ అనుకోవటం లేదుగదా! ఒక 'బియస్సీ' చదివిన సంబంధం తప్పిపోయిందనుకో! మరో 'యమ్మెస్సీ' చదివిన సంబంధం వస్తుందని ఎందుకనుకోరాదు. అసలు, అందుకే ఈ సంబంధం తప్పిపోయిందేమో!

మీ నాన్న నిన్ను భారంగా ఎంచుతున్నందుకు నీవేమీ బాధపడక్కర్లేదు. ఆయన నీ భవిష్యత్తునూ, భవిష్యత్తులోని నీ అవసరాలను దృష్టిలో పెట్టుకొని, సంఘంతో సాగిపోవడానికి ప్రయత్నిస్తున్నాడేగాని, మరేం లేదు. ఆయనకు నీవు భారమైతే, నిన్ను ఇన్నాళ్లు పెంచి పెద్దచెయ్యటంలో, అర్థమేమిటి? అనవసరంగా మనసు పాడు చేసుకోకు!

ముఖ్యంగా, ప్రతి మానవునకూ, తన ఇష్టాయిష్టాలను ప్రకటించే హక్కుందని, జ్ఞాపకం పెట్టుకో! రేపు, నీవే మరో పెళ్లికొడుకును (నిన్ను చూడ్డామని వచ్చినవాణ్ణి) బాగులేడని నిరాకరించవచ్చు! దానికేం చెప్తావు సంజాయిషీ? నేనుమాత్రం



కలువలు, చెలువలు

చిత్రకారుడు : శంకర్.

నీకు కొంతవరకు హామీ ఇవ్వగలను. అదేమిటంటే—నువ్వు అందవికారంగా మాత్రం లేవు. ఆకర్షణీయంగానే ఉన్నావు అని.—

మీ నాన్న నీ పెళ్లివిషయం గట్టిగా ప్రయత్నిస్తున్నాడని వ్రాశావుగా! తర్వాత ఏమైనా సంబంధాలు వచ్చాయా! వస్తే వాటిని గురించి వ్రాస్తూండు!

నీవు పెళ్లికుమార్తెవయ్యే సమయంకోసం ఎదురు చూస్తూంటా—

ఇంతే సంగతులు—

ఇట్లు
శారద—

* * *

గుంటూరు.

ప్రియమైన శారదా,

నాలుగురోజులయింది, నీ ఉత్తరంచూచి. విశేషాలేం లేనందున ఉత్తరం వ్రాయడం ఆలస్యమైంది. ఏమనుకోకు.

మొన్న నో లక్షాధికారి బిడ్డట, పేరు హనుమంతరావుట, నన్ను చూడ్డానికి వచ్చాడు. మామూలు తతంగమే జరిగింది. నన్ను ముస్తాబు చేశారు. నేను అతన్ని చూశాను. ఏం, బాగాలేడు! అతనుకూడా నన్ను చూసేఉంటాడు. లేకపోతే నన్ను ప్రశ్నలెలా అడగ్గలడు! ఏం చదువుకున్నావు? పాటలువచ్చా? నృత్యంలో ప్రవేశముందా? వంట వచ్చా?—ఇవే అతను అడిగినవి. నేను జవాబులన్నీ యదార్థాలే చెప్పాను. అంటే నీ వూహించుకోగలవనుకుంటా! అన్నిటికీ అతను తృప్తిపడ్డట్టే కనుపించాడు, అతని ముఖకవళికలనుబట్టి.

నీకు తెలుసుగా మానాన్నకూడా ఏదో అంతో యింతో ఉన్నవాళ్ళ జాబితాలోనే వున్నాడని. వాళ్ళుకూడా మాతాహతుకు సరితూగేవాళ్ళే గనుక మా నాన్న బహుసంతోషించాడు. మర్నాడే, తాంబూలాలు పుచ్చుకున్నారు.

నా అంగీకారం మాయింట్లో ఎవ్వరూ అడగలేదు. పిల్లవాడు బాగులేకపోయినా, వారి ఐశ్వర్యము చూచి ఏదోవిధంగా నా మనస్సును, నేనే సముదాయించుకోవాల్సి వచ్చింది. ఈపెళ్లి తప్పితే బాగుండుననిపించింది గాని, తాంబూలాలు పుచ్చుకున్నారు గదా అని, ఆఊహ మొదట్లోనే నరికివేయబడింది.

వారంరోజుల తర్వాత 'వాళ్ల దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందని చెప్పినప్పుడే అనుకున్నాను, ఇదికూడా ఏదో ఎదురుతిరిగిందని లేకపోతే, ఒకఊళ్ళోనే ఉండే వాళ్ళు ముఖాముఖి మాట్లాడుకోక ఉత్తరాలేమిటి!

ఆ అబ్బాయి, నన్ను చూడడానికివచ్చిన రోజున, నా కుడిమోచేతిపైనున్న పుట్టుమచ్చ చూశాడుట. దాన్నిగురించి ఊళ్లో పేరుబడ్డ జ్యోతిషచక్రవర్తితో సంప్రతించాడుట. అట్టిపిల్లతో వివాహము, పురుషునికి ప్రమాదకరమని, ఆ జ్యోతిస్సామ్రాట్ వచించారుట! ఇదీ ఆవుత్తరంలో సారాంశం.

తాంబూలాలు పుచ్చుకొన్న తర్వాత, నేను అనేక ఊహాగానాలు చేసుకొన్న తర్వాత, పెళ్లి ఆగిపోతే...బ్రతుకే దుర్భరమైపోతున్నది శారదా! ఏంచెయ్యను.

నాగుండె ఎప్పుడో ఆగిపోయేటట్టుగా వుంది, ఈ ఆశనిరాశలమధ్య. నీవు నమ్మగలవో లేదోగాని, చెరుకురసంకోసం, మిషనులో పెట్టిన చెరుకుగడలావుంది సుమా నా మనస్సు.

ఏదైనాకానీ, నీ ఉత్తరంకోసం ఎదురు చూస్తూంటా. జవాబు రాస్తావుగా! నీ బాబుకు నా ముద్దులు.

ఇట్లు
సీత.

* * *

(45-వ పేజీ చూడండి)

# ప్రైవేటు మాష్టరు

[గత వారం తరువాయి]

సూర్యోదయం కాకముందే లేచాడు సూర్యనారాయణమూర్తి. కాలకృత్యాలు ముగించుకొని భగవద్గీత తెరిచాడు. నిత్యమూ అరగంటసేపు గీతాపారాయణం చేయటం అతనికి అభ్యాసమై అలవాటైంది. గీతాపారాయణం ముగించాక గాని రాజ్యలక్ష్మి విషయం మనస్సులోకి రాలేదు. ఆమెతో నిర్మొహమాటంగా "తమకు ఇక్కడ స్థానంలేదు. తమరు వెంటనే ఇక్కడనించి వెళ్లితే-ఇద్దరి మర్యాదలూ కాపాడబడతాయి" అని ఆమెతో చెప్పేందుకు ఉద్యుక్తుడై కూర్చున్నవాడల్లా లేచాడు.

అదేసమయంలో గుమ్మంలో ఆమె అడుగుపెట్టింది. ఆమెముఖం చూడలేకపోయాడు సూర్యనారాయణమూర్తి.

"ఒకందుకు మీరు నన్ను క్షమించాలి" అన్నది ఎంతో భక్తినీ, వినయాన్నీ కనబరుస్తూ. ఆమాటల్లో సస్పెన్సుకు మాష్టరుగారి హృదయం రెపరెపలాడింది. ఆమెను ఎట్టి పరిస్థితుల్లోనూ క్షమించరాదని గాఢాతిగాఢంగా నిర్ణయించుకున్నాడు. కాని తీరా ఆమె అట్లా అడిగేటప్పటికి ఏమో అయిపాడు.

"మీరు సన్మానంతో ఆదరించి-నాకు గౌరవప్రదమైన జీవనాధారాన్ని కల్పించి నాకు నేనుగా బ్రతుకగల్గే సమర్థతను చేకూర్చారు. అందుకు తమకు ఎలా కృతజ్ఞత తెల్పాలో అర్థంకావడంలేదు. కాని జీవితంలో మీ ఋణాన్ని తీర్చుకుంటాను. తమవద్ద శెలవు తీసికోవాలని వొచ్చాను. నాకు నేనుగా ఈ గ్రామంలో బ్రతుకగలిగే శక్తి వొచ్చింది. బాపినీడుగారు సహాయం చేస్తామంటున్నారు. వేరే ప్రైవేటుస్కూలు పెట్టకొని పదిమంది పిల్లలకు చదువు చెప్పకుంటూ స్వతంత్రంగా బ్రతుకుదామని... తమ రేమంటారు?" అన్నది రాజ్యలక్ష్మి సందిగ్ధంగా.

సూర్యనారాయణమూర్తికి చెంపమీద ఛెళ్లున కొట్టినట్లయింది. తను ఇట్లా ఊహించలేదు. ఇట్లా జరుగుతుందని కలలో కూడా అనుకోలేదు. తనే నిర్దాక్షిణ్యంగా వెళ్లగొడతాడని-ఆమె తనతప్పు తెలిసికొని, కన్నీరు కార్చి, పశ్చాత్తాపపడుతుందనీ, తనకి ఆత్మసంతృప్తి...సూర్యనారాయణమూర్తి ముఖం నల్లగా కావుకేసుకుపోయింది. కృతజ్ఞతట కృతజ్ఞత! కృతఘ్నత చూపింది చాలదూ! ఈ గ్రామంలో బ్రతుకగలిగే శక్తి వొచ్చిందా? ఎట్లా? ఏవిధంగా?...ప్రైవేటుస్కూలు తనకు పోటీగా పెడుతుందన్నమాట! 'స్వతంత్రంగా బ్రతుకుదామని'_తనదగ్గర అస్వతంత్రంగా, బానిసగా బ్రతికిందా? ఛీ. ఛీ. ఉపకారాన్ని గుర్తించేకాలం కాదు. రేపు బాపినీడు స్వతంత్రంగా బ్రతకనిస్తాడా? అతని సంగతి తెలియదు. తనకెందుకు ఆమె ఎట్లా పోతే? ఆమె జీవితం ఏమైనా తనకు చింతలేదు. తనఋణం తీర్చుకుంటుందట. ఎట్లా? ఆమె సమాధానం కోసం వేచివుండడం చూసి – సూర్యనారా

## తాళ్లూరు నాగేశ్వరరావు

యణమూర్తి వెంటనే అంగీకారాన్ని తెలిపాడు.

"నాకేం అభ్యంతరంలేదు" అన్నాడు ముక్తసరిగా.

రాజ్యలక్ష్మి నమస్కరించి వెళ్లిపోయింది. అతను ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.

* * *

ఆ గ్రామానికి చెన్నకేశవస్వామి వారి రథశాల నడిబొడ్డు. ఆ రథశాలకు దక్షిణపు వీథిలో-పంచాయితీబోర్డు వైస్ప్రసిడెంటు బాపినీడు పెదనాన్నగారి పూరికొంప వుంటే దాన్ని బాగుచేయించాడు. అందులో రాజ్యలక్ష్మి ఉండే ఏర్పాటుచేశాడు.

ఏరకంగానైతేనేం కాస్త పేరుగల వ్యక్తి బాపినీడు. ఆవూళ్ళో అతన్ని చూసి గౌరవించేవాళ్లూ ఉన్నారు; భయపడే వాళ్లూ ఉన్నారు; పొగిడేవాళ్లూ ఉన్నారు; తెగిడేవాళ్లూ ఉన్నారు; చెప్పినమాట వినే వాళ్లూ ఉన్నారు. అతను పచ్చిరౌడీ అని కొంతమంది అనుకుంటారు. మరికొంతమంది అతను మంచివాడేగానీ అతని చుట్టూ వున్న గ్రహాలు చెడ్డవి అంటారు. ఇంకొంతమంది అతను డబ్బుగల గర్వపోతని అంటారు. పంచాయితీబోర్డు ప్రెసిడెంటుకు సహితం బాపినీడును చూస్తే భయం. బాపినీడు తరఫున ఇద్దరు మెంబర్లు ఉన్నారు. అతన్ని ఎదిరిస్తే-పంచాయితీబోర్డు పరిపాలన సాగదు. ఎదురుపార్టీ వెంకయ్యమురా తలలు ఎత్తుకు తిరుగుతారు. అంగువల్ల ప్రెసిడెంటు బాపినీడు చెప్పింది కాదనడు.

రాజ్యలక్ష్మి ప్రైవేటుస్కూల్లో వారంరోజుల్లోనే-సూర్యనారాయణమూర్తి స్కూల్లో పిల్లలు పదిహేనుమంది చేరారు. అదంతా బాపినీడు ప్రోద్బలంవల్లనే! పంచాయతీబోర్డు ప్రెసిడెంటూ నలుగురు మెంబర్లూ తీవ్రంగా జోక్యం కలిగించుకోవాల్సివచ్చింది, పిల్లల తల్లిదండ్రులకు వాళ్లు 'రాజ్యలక్ష్మి ప్రైవేటుస్కూలుకు పిల్లల్ని పంపించాల్సిందని వొత్తిడిపెట్టారు. అంతా వొక తెగవాళ్లు గనుక, ఇష్టం లేకపోయినా దశరథరామయ్య, పుల్లయ్యగారి నల్లయ్య, రామకోటయ్య, భూషయ్యగారి బుచ్చిరామయ్య మొదలైనవాళ్లు తమపిల్లల్ని విధిగా పంపించారు.

బాపినీడు వ్యవహారాన్ని ఆవూళ్ళో చాలమంది యేవగించుకున్నారు. అతను తన స్వార్థంకోసం పంచాయితీబోర్డు అధికారాన్నీ, కులపు ఆధిక్యతనూ, పార్టీ ప్రచారాన్నీ వినియోగించుకోవటం చాలామంది పిన్నలకూ, పెద్దలకూ కష్టం కలిగింది. ఉంపుడుగత్తె రాజ్యలక్ష్మి కోసం అతను పిల్లల్ని బళ్లోకి పంపమంటూ-పంపటమేమిటని యువకులు రోషం తెచ్చుకున్నారు. కాని ఏం లాభం? ఏనుగు పోతూంటే కుక్కలు అరిచినట్టుగానే వుంటుంది, వాళ్ల రోషం తెచ్చుకుంటే.

తన స్కూల్లోంచి పదిహేనుమంది పిల్లలుపోతే-సూర్యనారాయణమూర్తికి ఏమీ విచారం కలగలేదు. అంతా మనమంచికొరకే అనుకున్నాడు. అంతమందికీ చదువు సక్రమంగా శ్రద్ధగా చెప్పాలంటే-వాస్తవంగా అతని శక్తికి మించినపనే. అసలు అతను పిల్లల్ని ఎక్కువమందిని చేర్చుకున్నదికూడా రాజ్యలక్ష్మికోసమే!

ఒకరోజు సాయంకాలం వెంకయ్య ప్రత్యేకంగా సూర్యనారాయణమూర్తిని కలుసుకున్నాడు. వెంకయ్య ఆవూళ్లో పంచాయితీబోర్డు ప్రెసిడెంటుకు ఎదురు పార్టీ నాయకుడు. అతనూ పంచాయితీ

ర్డు మెంబరే. లోగడ పంచాయితీబోర్డు ప్రెసిడెంటుగిరీకూడా చేశాడు. కానీ ఆ మైనర్ పంచాయితీబోర్డుకుఊళ్లో పేదప్రజ జాస్తిగా వుండటంవల్ల రెండుచేతులా డబ్బును విరజిమ్మిన బాపినీడు పార్టీ ఎక్కటంలో ఆశ్చర్యంలేదు.

"పంతులుగారూ! మాపిల్లలు ఒక అర డజనుమంది వున్నారు. తమ స్కూల్లో చేర్చుకోండి. ఎలిమెంటరీ స్కూలు మరీ రానురాను పాడుబడ్డసత్రంలాగ తయారైంది. పంతుళ్ళూ లేరు, పిల్లలూ లేరు. మావాళ్ళకు అక్షరంముక్క అబ్బటానికి..." వెంకయ్య లావుపాటి చేప్రోలుపుగాకుచుట్టను పీలుస్తూ అన్నాడు.

"వొద్దుబాబూ! ఉన్నవాళ్ళకి శ్రద్ధగా చదువు చెప్పగలిగితే చాలండీ" నసిగాడు ప్రైవేటుమాష్టరు.

"కాదు. మీరు తప్పకుండా చేర్చుకోవాలి" వెంకయ్య మొండిపట్టు పట్టాడు. తమ పిల్లలకు చదువు రావటానికి అంతకంటే వేరేమార్గంలేదని వెంకయ్య భావించటంలో తప్పులేదు. ఎందుకంటే—రాజ్యలక్ష్మి ప్రైవేటుస్కూలుకు పిల్లల్ని పంపించలేదు గనుక.

సూర్యనారాయణమూర్తి అంగీకరించాడు అరడజను అనుకున్నది పదిమంది వరకూ చేరారు, కొత్తగా సూర్యనారాయణమూర్తి స్కూల్లో. ఆ విషయం పంచాయతీబోర్డు వైస్ ప్రెసిడెంటు బాపినీడుకు గుళ్లో కోయంబత్తూర్ డోక్ అణాల ఆట ఆడుతూంటే—పరసనల్ అసిస్టెంటు జగన్నాథం చెప్పాడు.

* * *

అర్ధరాత్రి దాటిందో లేదో—బయట ఎవరో తీవ్రంగా తలుపు కొడుతూంటే సూర్యనారాయణమూర్తి విసుక్కుంటూ తలుపు తెరిచాడు.

ఎదురూగ్గా ముగ్గురు వ్యక్తులు భీకరాకారాలతో. కళ్ళు నులుముకుని చూశాడు 'కలా' 'నిజమా' తేల్చుకోవటానికి.

ఇద్దరు బుర్రమీసాలవాళ్ళు. ముగ్గురూ తలగుడ్డలు చుట్టారు. చేతిలో లావుపాటిపన్నుగర్రలు. దొంగలా? దొమ్మీకి వొచ్చారా? వొణికిపోయాడు అన్నెమూ పున్నెమూ ఎరుగని పంతులు. నోట మాటరాలేదు. శరీరం వొణుకులో వశంతప్పింది. ముగ్గురూ వడిగా లోపల జొరబడ్డారు—కర్రలు మోత చేసుకొంటూ. దొంగలేందీ, దొమ్మీవాళ్లయిందీ తెల్సుకోలేకపోయాడు. వాళ్లిముగ్గుర్నీ ఎరుగడు.

'ఏయ్! పంతులూ! మేం ఎవరమో తెల్సా?! అన్నాడు బుర్రమీసం మీదకు చెయి వెళ్ళనిచ్చి ఆముగ్గుర్లో పొట్టివాడు.

తెలీదన్నట్టు అమాయికంగా తలఆడించాడు సూర్యనారాయణమూర్తి.

"తెలుపుడు చేయమంటావా?' అన్నాడు ఇంకొక బుర్రమీసం.

'అంటే' అన్నట్టు ఆశ్చర్యంగా ముఖం తేలవేశాడు ప్రైవేటు మాష్టరు.

'ఏయ్ పంతులూ! మేం తల్చుకుంటే నువ్వు కాలికింద చీమవి. తెలుసా? జాగ్రత్త! వేషాలు వేస్తున్నావంట. ఎముకలు సున్నంలోకి మిగలకుండా మెత్తగా మాలిష్‌పడతాం' అన్నాడు మూడోవాడు లాఠీకర్రని నేల మీద కొడుతూ.

సూర్యనారాయణమూర్తికి వాళ్ళ దౌర్జన్యము అర్థంకాలేదు. ఎంతో ధైర్యాన్ని కూడగట్టుకుని 'మీరెందుకొచ్చారు?' అన్నాడు పేలవంగా.

"నీకు బుద్ధి చెప్పడానికి!"

"నాకా?"

'ఆఁ!... తెల్లవారేపాటికి నువ్వు ఈఊళ్లో వుంటే—రేపు తెల్లవారేపాటికి నువ్వు నరకలోకానికి నేరుగా పోతావు. అరమైందా?' బుర్రమీసం వికటాట్టహాసం చేసింది.



సూర్యనారాయణమూర్తికి ప్రైప్రాణాలు పైనే పోయినయ్.

"తట్టా బుట్టా సర్దుకుని ఏదైనా వూరెళ్ళి బ్రతుకు. ఇక్కడ నీఆటలు సాగవు. రాజ్యలక్ష్మికి పోటీగా పాఠశాల నడుపుతావా? వెంకయ్య ముఠాలోని పిల్లల్ని స్కూల్లో జేర్చుకుంటావా? ఎన్ని గుండెలు! ఎంత పొగరు! బ్రతుకు మీద ఆశ వొదులుకుంటావో, బ్రతుకుదెరువే చూసుకుంటావో చెప్పు. ఊఁ! ఈ వూళ్లోనుంచి వెళతావా? లేదా?" గొంతు పుమ్ముకున్నాడు గట్టిగా.

సూర్యనారాయణమూర్తి పిచ్చికలా వొణికిపోయాడు. రెండుచేతులూ యెత్తి నమస్కారం చేశాడు.

"నన్ను వదలండి బాబూ! దిక్కుమాలినవాడ్ని. నా బ్రతుకు నేను బ్రతుకుతా ఏదైనా వూరుపోయి. నన్ను వొదలండి బాబూ" వేడుకున్నాడు ఏడుపువచ్చే కంఠంతో.

# ★ ప్రైవేటు మాష్టరు ★

"పిరికిపంతులు" పెద్దగా వెర్రినవ్వులు నవ్వుకుని, కర్రలు మోగించుకుంటూ వెళ్ళిపోయారు. పంచాయతీబోర్డు వైస్ ప్రెసిడెంటు బాపినీడు తాలూకు మనుష్యులు.

ప్రైవేటుమాష్టరు సూర్యనారాయణమూర్తి అరిచేతుల్లో ముఖంకప్పుకొని—అరగంటసేపు ఆలోచించాడు పరిస్థితుల పరిణామానికి. తర్వాత మెల్లగాలేచి సామాను సర్దాడు తెల్లవారేవరకూ.

సూర్యనారాయణమూర్తి ఆ వూరినుంచి ప్రక్కఊళ్లోకి వెళ్లటం చాలమందికి ఆశ్చర్యము వేసింది. అందరూ కారణం అడిగేవాళ్ళే. కాని రాత్రిసంఘటన ఎవ్వరితోనూ చెప్పలేదు. "ఏముందిబాబూ! ఈ ఊరికీ నాకూ నేటితో ఋణం తీరింది. వెళుతున్నాను" అన్నాడుఒకళ్ళిద్దరితో. ప్రక్కఊళ్లో ఒక హైస్కూలుమాష్టరు చిన్ననాటి స్నేహితుడు వుంటే-అక్కడకు ప్రయాణం కట్టాడు. అవూరు ఎంతోదూరం లేదు-రెండే రెండు మైళ్ళు.

వీరాస్వామి ఒంటెద్దుబండీలో సామానుతోపాటు పంతులుగారు సూర్యోదయం కాగానే వెళుతూంటే—కిళ్ళీబడ్డీదగ్గరవున్న బాపినీడు విజయగర్వంతో చిరునవ్వు నవ్వగా తల వంచేసుకున్నాడు ప్రైవేటు మాష్టరు సూర్యనారాయణమూర్తి.

సూర్యనారాయణమూర్తి స్కూలుమూసివేయటంతో-ఎక్కువమంది పిల్లలు రాజ్యలక్ష్మి స్కూల్లో చేరారు. కొద్దిమందిమటుకు ఎలిమెంటరీస్కూల్లో చేరారు. అంటే వెంకయ్య మురా తాలూకువాళ్ళు.

## 5

'నోరు మంచిదైతే ఊరు మంచిదేరా నరుడా!' అన్నట్టు ఎప్పుడోగాని సహృదయులకూ, సుబుద్ధివాళ్ళకూ, సత్ప్రవర్తన గలవాళ్లకూ ఏఊళ్ళోనైనా స్థానం లభించకుండాపోదు. నాలుగు మాసాల్లోనే సూర్యనారాయణమూర్తి ఆ ప్రక్కగ్రామంలో స్థానం నిలవదొక్కుకోగల్గాడు. స్నేహితుని సహాయంతో ప్రైవేటు మాష్టరుగా పేరులోకి వొస్తున్నాడు. ఇరవైఅయిదు మంది వరకూ స్కూల్లో పిల్లలు చేరారు.

అతని మంచితనమూ, చదువుచెప్పడంలో నేర్పూ, శ్రద్ధా ఆ వూళ్ళో వాళ్ళందరికీ తెలియవచ్చింది ఆ నాలుగు మాసాల్లోనే.

రాజ్యలక్ష్మి ఏమైందో, ఆమె బ్రతుకు ఏ స్థితికి వొచ్చిందో, ఎటా జీవిస్తోందో-రెండుమైళ్ళ దూరంలో వుండీకూడా సూర్యనారాయణమూర్తి తెలిసికోలేదు. ఆమెను దాదాపు మరిచిపోయేస్థితిలో ఉన్నాడు.

ఆ రోజు ఉదయం బకింగ్‌హామ్ కెనాల్లో స్నానంచేసి, సూర్యనమస్కారం ముగించి-వొడ్డుకు వొచ్చేప్పటికి,—"పంతులుగారూ!" అన్న కేక వినిపించింది. పరిచయంవున్న కంఠంలాగ గోచరించి వెనుదిరిగి చూశాడు.

తాను ప్రైవేటు స్కూలుపెట్టి, భయపడి పారిపోయివొచ్చిన వూరితాలూకు వ్యక్తి రామసుబ్బయ్య! ఏదో పనిమీద ఆ వూరు వొస్తున్నట్టున్నాడు.

"బావున్నారా, పంతులుగారూ! మీకు జరిగిన అన్యాయానికి మీకు ముఖం చూపించలేకుండా ఉన్నాం" రామసుబ్బయ్య కొడుక్కికూడా సూర్యనారాయణమూర్తి రాజ్యలక్ష్మి విడిపోయేవరకూ చదువు చెప్పాడు.

"ఏమిటి విశేషాలు?"

"అయ్యో! మీకింకా తెలీలేదా? ఇవాళ ఉదయమే — రాజ్యలక్ష్మి రైలుక్రిందబడి చనిపోయింది. ఊళ్ళో జనమంతా వెళ్ళి చూసి వొస్తున్నారు. ఆత్మహత్య చేసికుంది" అన్నాడు రామసుబ్బయ్య.

సూర్యనారాయణమూర్తి గుండె ఆ వార్త వినగానే—క్షణంసేపు పనిచేయడం మానివేసింది! కళ్ళల్లో నీళ్ళు నెట్టుకొచ్చినయ్.

"బాపినీడును నమ్ముకొని బ్రతుకుదామనుకుంది. కాని చివరకు ఆ బ్రతుకు బుగ్గి అయింది...వస్తాను పంతులుగారూ! ఊళ్ళో అర్జంటు పని వుంది" అంటూ వెళ్ళాడు రామసుబ్బయ్య.

నిశ్చేష్టుడై అట్లాగే కాలువవొడ్డున అయిదు నిముషాలు నిలుచుండిపోయాడు సూర్యనారాయణమూర్తి. పాపం! చివరికి ఆమె జీవితం ఎట్లా అయింది? ఆత్మహత్య చేసికొనే అగత్యం ఏర్పడేందుకు—పరిస్థితులు ఎంత విషమంగా పరిణమించాయో! ఆమె ఆత్మహత్యకు తనే కారణం? తన స్వార్థాన్ని, తన బ్రతుకుబాగునీ, సంఘంలో తన జీవితపు సంక్షేమాన్ని తను చూసుకున్నాడు. ఆమె బ్రతుకు అంత దారుణంగా తెల్లవారటానికి తనూ ముఖ్యకారణం! ఆ రోజు సాయంత్రం — ఆమెను తను ఆ వూళ్ళోకి ఆహ్వానించకపోతే, జీవనాధారాన్ని కల్పించియుండకపోతే—ఆమె జీవితం ఇట్లా ముగిసేదా? తను పిరికివాడు; స్వార్థపరుడు; దుర్మార్గుడు. బాపినీడు సంగతి తనకు తెలుసు; ఆ గ్రామంలోని రాజకీయాలు తనకు తెలుసు; ఆమె బాపినీడును నమ్మి, ఏదో సుఖం బావుకుందామని గుడ్డిగా అజ్ఞానంగా, అవివేకంగా తప్పుడు దారి త్రొక్కుతూంటే—తను ఆమెను సన్మార్గంలోకి మళ్ళించాడా? బాపినీడు ప్రవర్తనలోని నైజాన్ని వివరించి చెప్పాడా? రాబోవు పరిస్థితుల్ని వూహించి, విస్తరించి ఆమెకు బోధించాడా? తాను స్వార్థంగా ప్రవర్తించాడు; ధర్మాన్ని నిర్వర్తింపలేదు. ఆమె తనని ప్రేమించలేదనీ, తన ఊహల్ని ఆశల్ని—అర్థంలేనివిగా, నిరాశలుగా మార్చిందనీ, అక్కసుకొద్దీ—ఆమె కర్మకు ఆమెను వొదిలేశాడు. ఆమె అవినీతిలోకి దూకుతుంటే సంతృప్తిపడ్డాడు; అజ్ఞాతంగా ఆమెమీద పగదీర్చుకున్నాడు. ఆమెమీద తనకు బాధ్యతలేదా? అధికారంలేదా? ఆమె తనమాట లక్ష్యపెట్టేదికాదా? ఆమెను తను అర్థంచేసికున్నాడా? — సూర్యనారాయణమూర్తి ఆ విధంగా బాధపడజొచ్చాడు.

పదిగంటలకు టపాలో సూర్యనారాయణమూర్తి కొక కవరు వొచ్చింది. దానిపై దస్తూరీ చూడగానే అతని హృదయం వొణికింది' రాజ్యలక్ష్మి వ్రాసింది.

"......ఈ లేఖ మీ చేతుల్లోకి వొచ్చేప్పటికి నన్నుగురించి మీరు ఆలోచిస్తూనే వుంటారు. 'ఆమె జీవితం ఇట్లా ముగిసిందేమిటి!' అని మీరు బాధపడతారని నాకు తెలుసు. కాని నా జీవితపరిణామానికి ఎవరు కర్తలు? నాకు నేనే, పూర్వజన్మలో నేను చేసికున్న పాపమూ! నా బ్రతుకులో వెలుగు కల్పించాలనీ, నా జీవితాన్ని పవిత్రం చేయాలనీ, నాకు గౌరవప్రదమైన ఉద్యోగాన్నే మీరు ఇచ్చారు. కాని నా ఆత్మ నన్ను మోసంచేసింది. నన్ను నేను మోసంచేసికొనే శక్తినిచ్చింది. నా బ్రతుకు నేను బ్రతకగలననే విశ్వాసాన్ని దృఢపర్చింది. బాపినీడుగారి మాటల్ని నమ్మాను. అతని మాటల్లోని తియ్యందనాన్నీ, ముఖంలోని ఆకర్షణనూ, ఆస్తినీ, అనురాగాన్నీ—నమ్మాను. అతనికి నా శరీరంమీద పూర్తి అధికారం యిచ్చి, జీవితంలో ఆనందాన్నంతా చవిచూద్దామనే తలంపుతో, అవినీతినీ, సంఘంలో నా స్థాయినీ ఆలోచించక—అతనికి ఉంపుడుగత్తెగా తయారైనాను. కాని అయిదు మాసాలు గడవకముందే—నా బ్రతుకు నాకు తెలిసివొచ్చింది. బాపినీడు దుర్మార్గం బయటపడింది. నాకు గర్భం వొచ్చిందని తెలిసికొని కలుగబోయే సంతానానికి తాను తండ్రి అవుతాడని భయపడి—రౌడీలచేత ఒక అర్ధరాత్రి నన్ను భయపెట్టించాడు. ఈ వూరు వొదిలి వెళ్ళకపోతే చంపుతామని వాళ్ళు బెదిరించారు. బాపినీడు నాఇంటికిరావటం బొత్తిగా మానివేశాడు. బళ్ళో పిల్లలసంఖ్య రోజురోజుకూ తగ్గిపోతున్నది. ఇకముందు ఆ వూళ్ళో నా బ్రతుకు బజారుపాలేనని గ్రహించాను. అప్పుడు గతచరిత్రను స్ఫురణకు తెచ్చుకున్నాను. భవిష్యత్తును ఊహించుకున్నాను. నీతిచెడిన స్త్రీకి ఎట్లాంటి భవిష్యత్తు ఉన్నదో యీ దేశంలో అందరికీ తెలిసిందే! ... ఆత్మహత్యే అన్నింటినీ మించిన ఉత్తమమైన మార్గమని నిశ్చయించుకున్నాను. కాని మీ ఋణం ఈ జీవితంలో తీర్చుకోలేనందుకు—క్షమించండి!

—రాజ్యలక్ష్మి."

# లంకెల బిందెలు

సాయంత్రం అయ్యేసరికి అందరు తలంట్లు పోసుకోవటం అయింది. అందరికీ క్రొత్తబట్టలు, గుమ్మాలకు పచ్చటి పసుపు, ఇంట్లో అందమైన ముగ్గులు, ఇంట్లోవాళ్ళ సందడి, హడావిడి చాలవింతగావుంది.

"ఇదిగో! శారదా! ఆ పళ్ళెమిలా పట్రా!" అన్నాడు శ్రీనివాసు.

శారద మాట్లాడకుండాపోయి గ్లాసులబల్ల మీదవున్న చెంబు కాస్తా పట్టుకొచ్చింది.

శ్రీనివాసు నవ్వుతూ "అరె! అదికాదు; ఫలహారప్పళ్లెంపట్రమ్మంటే..." అన్నాడు

ఆమె తనలో తానే నవ్వుకుంది తను యివ్వాళ యింత పరాగ్గావున్నందుకు.

అయినా సమర్థించుకుంటూ "కొబ్బరికాయ నీళ్లు పట్టటానికిలెండి. మీరంతా... మరీను" అంది సిగ్గుతో.

"కాదులే! తెలుస్తూందిగా. మనసంతా రాబోయే లక్ష్మీచుట్టు తిరుగుతుంది. అందుకే యింతపరాకు," అన్నాడు శ్రీనివాసు.

"అదేమీ కాదులెండి" అంది నవ్వుతూ.

నిజానికి శ్రీనివాసు అన్నమాట అబద్ధమేమీకాదు. ఎన్నాళ్లనుంచో ఆ యింట్లో లంకెలబిందెలున్నాయని ప్రతీతి. రాత్రుళ్లు ఘల్లుఘల్లుమని ధ్వని వినిపిస్తుందిట. ఈ సంగతి శ్రీనివాసుబామ్మ చుట్టుప్రక్కల వాళ్లతో చాలసార్లు చెప్పింది. కొందరు దయ్యమంటారు. కొందరు అంతా వుత్తదే నంటారు. ఏది ఏమైనా శ్రీనివాసుబామ్మ మాత్రం అవి లంకెలబిందెలేనని ఖచ్చితంగా చెప్పేది.

అదేమని ఎవరైనా అంటే భారతం అంత పూర్వగాథ చెప్తుంది.

"మొఘలాయిలు భారతదేశం యేలే సమయంలో ఒక గొప్ప మార్వాడీ ఈ వూళ్లో ఈ స్థలంలో నివసించి వ్యాపారం జేస్తువుండేవాట్ట. వాడు చాల బంగారం గడించాట్ట. అయితే అప్పుడు తురకలవలన క్షణక్షణం భయంగా వుండేదట. అందువలన మార్వాడి తన బంగారు మొహిరీలను రెండు రాగి కొగులకు ఎత్తించి ఈ స్థలంలో ఎక్కడో పాతేడట. తరువాత చనిపోయాడు," అని యిక్కడి లంకెలబిందెల విషయం ఎత్తితే ఈ గాథతో ప్రారంభించేది.

కర్మంజాలక "మరి ఇంతకాలం వాటిని ఎందుకుదక్కించుకోలేకపోయారు?అని ఎవరైనా అడిగితే—

"అడిగావూ? తీగలాగితే డొంక కదులుంది. కూర్చోమరి చెప్తా,"అని మొదలుపెడుతుంది కొండవీటి చాంతాడులాగ. "పనుంది మళ్లీవస్తా," అనో "తలనొప్పిగా వుంది, రేవు చెప్పదువులే,"అనో వినకుండా తప్పుకుపోవటం ఎంగుకైనా మంచిది.

అయితే ఆమెచెప్పే విషయంయొక్క సారాంశమిది. ఇప్పటికి మూడుతరాలనుండి ఆ లంకెలబిందెలకోసం పూజలు పునస్కారాలు చేయిస్తున్నారు. కాని ఆ మూడు తరాల్లో ఎవరికీ అనుభవించే అదృష్టం లేక పోవటంవలన వాటిని దక్కించుకోలేక పోయారు.

ఇప్పుడు శ్రీనివాసు తరం. శ్రీనివాసుకు నమ్మకం లేకపోయినా బామ్మపోరు పడలేక ఏదో ఆమెకోసం ఈ వేళ ఈకర్మకాండంతా చేయాల్సివచ్చింది.

## "సాతులూరి"

"ఒరే! శీనూ! ఇంకా అవలేదట్రా! వెధవ ఫలహారం ఎంతసేపు! ఛీ! ఛీ! ఈ కాలపువాళ్లంతాయింతే...కానివ్వరా!... ఏమిట్రా నువ్వు?" అంది బామ్మ.

"చూడు బామ్మా! శారద ఏంజేస్తుందో! నేను ఫలహారం జేస్తుంటే......

"అయ్యో! నేనేం చేశానండి! ఇది మరీ బాగుంది. నా పని నే చేసుకొంటుంటే మీకేనాయె నన్ను పిలిచింది," అంది శారద.

"సరిపోయె, కానియ్యండ్రా! సరసాలకు సమయంలేదూ? ముహూర్తందగ్గర పడుతుంది మళ్లీ... ఆయన వచ్చేటెంకూడా కావస్తుంది... ఇలాగైతే ఎలాగేపిల్లా! పోయి ఆ వంటపని కాస్తాకూడా కానీయి" అని బామ్మ లోనికి వెళ్లింది.

శారదవంక చూచి శ్రీనివాసు కనుబొమ ఎగరవేశాడు వెక్కిరింపుగా. శారద పవిట నడుంకు బిగించి శ్రీనివాసును చూచి మూతి త్రిప్పి వంటగదివేపు వెళ్లింది.

అవతల బామ్మ ఎవరినో కేకలువేయటం వినిపించి శ్రీనివాసు ఆమె రానేవస్తుందని తొందరగా కొబ్బరిముక్కలు తరుగుతూ చెయి కోసుకొన్నాడు.

"అబ్బా! యీ ముసలివాళ్ళంతా యింతే వెధవగోలా వాళ్లు." అనుకొన్నాడు.

"ఏంరా! ఇంకా కాలా?" అంది బామ్మ యింట్లోనుండి. "అయిపోయింది. వస్తున్నా" అంటూ శ్రీనివాసు పని పూర్తి జేసి లేచాడు.

చీకటిపడింది. అది శీతాకాలపు తొలి రోజులు అవటమూలానేమో మబ్బులుపట్టి అంధకారంగావుంది. వర్షంవచ్చే సూచనలు కన్పిస్తున్నాయి.

"శీనూ! ఇంకా ఆయనరాలేదు. వర్షం వచ్చేలావుంది. మరి ఆయనవస్తాడో రాడో! ఇవ్వాళ పనంతా వ్యర్థమవుతుంది" అంది బామ్మ కొంచెం విచారం సూచిస్తూ.

"ఇదిగోనే! ఆయన రానేవస్తున్నాడు" అన్నాడు శ్రీనివాసు.

"నీకు నిండా నూరేళ్లాయుస్సు. ఇప్పుడే నీమాట అంటున్నాం. అంతలో నువు రానే వచ్చావు" బామ్మ ఆనందంతో అంది.

"అంతా పూర్తిజేశారా మామ్మగారూ"? అన్నాడు భూతాల పోతరాజు.

"అంతా అవటమేమిటబ్బాయి! నువు రావటమే తరువాయి అనుకొంటుంటేను" అని బామ్మంది.

"అయ్యెయ్యో! రాకుండా యెలా ఉంటానండీ!" అన్నాడు పోతరాజు.

ఇవ్వాళ పూజకోసం తూర్పుప్రక్కగది కేటాయించారు. ఆ గదంతా చక్కగా అలంకరించారు. అందులో లక్ష్మీదేవిని ప్రతిష్ఠించారు. చక్కని పూలు చుట్టు పోశారు. పూజ ప్రారంభమైంది. అంతా కూర్చున్నారు.

బయట వాన ప్రారంభమైంది. ఖోరుమనే గాలి, సన్నని చినుకులల్లా పోయి పెద్ద వానగా తయారయింది.

"అబ్బా! వెధవ్వాన, సమయానికే తయారైంది" అంది బామ్మ విసుగ్గా.

పోతరాజు అందుకొని "అలా అనకండి. ఇదే మంచిసమయం. మునుపు మూడేళ్ల క్రితం మన ప్రక్కవూరు సుబ్బిసెట్టిగారి యింటి దగ్గర బిందెల పూజ చేస్తూంటే యిలాగే వాన. ఎలా జరిగిందనుకొన్నారూ? అదంతా పెద్ద కథలెండి" అన్నాడు పోతరాజు.



కలోనియల్ కాలానికి చెందిన అమెరికన్ చిత్రకారుడు జాన్‌సింగిల్టన్ కాప్లే రచించిన రూపచిత్రం.

# ★ లంకెల బిందెలు ★

"ఏమి జరిగిందేమిటి?" అంది శారద ఆత్రుతగా.

"చాలకాలం క్రితంనుండి వాళ్ళ యింట్లో మీ యింట్లోలాగే కనకధ్వని వినిపిస్తోందట. కొన్నాళ్ళ తరువాత వాళ్ళ ముసలమ్మకు స్వప్నంలో 'నేనురానా? నేనురానా?' అని ఎవరో పిలుస్తున్నట్లు వినిపించిందట. వాళ్ళు నన్ను పిలిపించి పూజ చేయించారు. ఏం చెప్పనండీ, నాంచారమ్మగారూ! ధన ధనమని బిందెలు గుమ్మంలో వచ్చి ఆగినై. ఆరోజు యిదే సమయం. వాన, ఈదురు గాలి, కటికచీకటి," అని చేతులూ కళ్ళు తిప్పుతూ చెప్పాడు పోతరాజు.

"ఇదంతా నిజమేనా?" అన్నాడు శ్రీనివాసు ఆశ్చర్యంగా.

"మరేమిటనుకొన్నారు? అబద్ధం చెప్పే ఖర్మ నాకేంపట్టింది? కళ్ళారా చూసింది, పూజచేసింది, నేను" అన్నాడు పోతరాజు.

"అలా చెప్పుబాబు! మావాడికి ఇలాంటి వంటే గిట్టవ్" అంది బామ్మ.

కబుర్లతో చాల ప్రొద్దుపోయింది. బయిటిగాలి వాన మోతాదు కాస్త ఎక్కువవుతోందే గాని తగ్గేసూచన మాత్రం కన్పించటంలేదు. శారద శ్రీనివాసు కునికిపాట్లు పడుతున్నారు. బామ్మమాత్రం కన్నార్పకుండా గుమ్మంవైపే చూస్తోంది.

కనీసం ఇప్పటికి అరడజను కొబ్బరి కాయలు కొట్టాడు. ఏవో మంత్రాలు వల్లె వేస్తున్నాడు పోతరాజు.

శ్రీనివాసుకు నిద్ర ఆగటంలేదు.

"బామ్మా! నేను పడుకుంటాను" అన్నాడు.

"ఏమిట్రా! మరీ చిన్నపిల్లాడిలాగ... అంతగా ఆగలేకపోతే పోయి పడుకో" అంది బామ్మ.

శ్రీనివాసు తూలుకొంటూ తూలుకొంటూ బయటికి పోబోయాడు.

"అరెరె! అటుగాదు. పడమటి వేపు తలుపుతీసుకొని పోయిరా. ఇటుపోకూడదు" అంది బామ్మ.

శ్రీనివాసు విసుక్కున్నాడు. పడమటి వైపుపోయాడు. బయట చలిగాలి కొడుతుంది. చలిగాలి తగలడంతో మగతంతా విడిపోయింది. గోడప్రక్కనే తలుపుదగ్గరగా బిందె కాలుకు తగిలి కొంత సందడిచేసింది. దాంతో మగత పూర్తిగా విడిపోయింది. కళ్ళు యింత జేసుకు చూశాడు. అవి లంకెలబిందెలు. కెవ్వున కేకవేసి ఒక్క గంతులో ఇంట్లో పడ్డాడు.

"బామ్మా! బామ్మా! లంకెలబిందెలు! లంకెలబిందెలు!" అని నోటికొద్దీ అరిచాడు. కునుకుతున్న శారద వులిక్కిపడింది. బామ్మ గుడ్లు తేలవేసింది. కాసేపటివరకు నోట మాట రాలేదు.

"నేను చెప్పలేదూ? మన ప్రూజంటే ఏంటనుకొన్నారూ?" అన్నాడు పోతరాజు గర్వం, వుత్సాహం వెల్లుబుకుతున్నట్లు.

అందరు లైటు తీసుకొని గుమ్మంలో కెళ్ళారు.

"అవి లంకెలబిందెలే! బిందెలే!" అని అరిచింది బామ్మ. బిందెలపై బాగా బురద కొట్టుకొంది. గడ్డితాడుతో రెండు బిగించబడివున్నాయి.

పోతరాజు అమాంతం కోడిమెడ నులిమి రక్తం చుట్టు పారపోసి, దిగదుడిచి అవతల విసిరాడు. శారదను రెండు చేతులెత్తి దండం పెట్టమన్నారు. దండం పెట్టింది. అర్థశేరు నవటాకు సాంబ్రాణి చితకగొట్టి గుప్పున పొగవేశారు.

శ్రీలక్ష్మీ! కటాక్షించు" అని దండం పెట్టింది బామ్మ.

"దండంపెట్టరా మొద్దా! అలా చూస్తావేం" అంది శ్రీనివాసును బామ్మ.

మాటవినగానే వంగి దండం పెట్టాడు.

తీరా చూస్తే వాటిల్లో ఏమీలేదు. అంతా ఆశ్చర్యపోయారు.

"ఏమిటి? వాకాలు తగిలినప్పుడు చాల బరువుగా వున్నాయి" అన్నాడు శ్రీనివాసు



ఉజ్ బెక్ జానపద కళోత్సవాలు మాస్కోలోని పుష్కిన్ లలితకళా ప్రదర్శనశాలలో జరిగిన సందర్భంలో హాజరైన ఉజ్ బెక్ కళాకారుడు శ్రీ యస్. అబ్దుల్లాఏల్, భారతీయ పత్రికా విలేఖరులు శ్రీ వీరేంద్రకుమార్ శుక్లా, శ్రీ అమ్జాద్ యూసుఫ్ ఖాన్.

"అదృష్టహీనులంటుకొంటే పాములు, తేళ్ళు, ఏమీ లేకుండా పోవటాలు జరుగుతాయి" అన్నాడు పోతరాజు.

శ్రీలక్ష్మీ! కటాక్షించు. నీ దాసులం మమ్మల్ని అన్యాయం జేయకు తల్లీ! నువ్వు కన్ను తెంచి కటాక్షిస్తే నీకు వెయ్యి కొబ్బరి కాయలు, బంగారు కాసులతో పూజ చేయిస్తాను" అని మొక్కుకుంది బామ్మ.

"శారదగారండీ! ఈసారి మీరు తాకండి" అన్నాడు పోతరాజు. శారద భయపడింది.

"ఏంభయం లేదండీ! నేనుండగా ఎందుకు భయపడతారు" అన్నాడు పోతరాజు.

శారద తాకింది. ఏమీ లాభం లేకపోయింది.

బామ్మ, పోతరాజు, శ్రీనివాసు వరసగా అందరూ తాకేరు. మార్పేమీ లేదు. అలానే వున్నాయి.

"మీ పాలేరాడు లేడండీ!" అన్నాడు పోతరాజు.

"ఏమో, వాడు యింటిదగ్గర్నుండి వచ్చాడో రాలేదో యీ వానలో. నేనూ! పాకలో వున్నాడేమో చూడు" అంది బామ్మ ఏదో ఆశ ఆత్రుత వుడికిస్తున్నట్టు. గాట్లో ముసుగు వేసుకు పడుకున్నవాడ్ని తట్టి "గోపిగా! గోపిగా!" అని లేపాడు.

వాడు లేచి కళ్ళు నులుముకొంటూ "నేను గోపిగాణ్ని గాదు బాబు! బెరాపట్టం చిన బ్బాయిగోరి పాలేర్నండీ!" అన్నాడు వాడు.

"అయితే యిక్కడికెందుకొచ్చావు యింత రాత్రిలో" అన్నాడు శ్రీనివాసు.

"మొన్న పదిరోజులకితం మా దొరగోరి కూతురి పెళ్లి జరిగిందిగదండీ..."

"అయితే...?"

"అందుకని తమరింటికాడ రెండు కాగులు పట్టించుకెళ్లారంట. అయి యిచ్చి రామని పంపారండి. నేను బయలుదేరేతలికి ఏమీ లేదు. నన్ను అట్టా కోసుదురానిచ్చి వాన లంకించుకొంది. నానా యాతనపడి వచ్చాను. సూడండి! వల్లంతా బురదే! తీరా వచ్చేసరికి తమురు పడుకున్నారు. ఎంత పిలిచినా పలకరే! ఇక యిసిగత్తి బింజెలాగోడ ప్రక్కన పెట్టి చలికాగలేక గొడ్లగాట్లో నడుంవాల్చా" అని నిట్టూరుస్తూ చెప్పేడు.

శ్రీనివాసు నవ్వాపుకోలేకపోయాడు. శారద సిగ్గుపడింది తను ఎంతో ఆశతో దండం పెట్టినందుకు. బామ్మ బిక్కమొగ మేసింది. పోతరాజు తేలుకుట్టిన దొంగలా చీకట్లో జారుకున్నాడు. ★

డైరెక్టరు: ఏం సార్ మీ బ్రదర్ని ల్లా ఎవర్నో తీసుకొస్తానన్నాడు. ఏ రోల్ కండీ?

ప్రొడ్యూసర్: అదే ఇంకా తేలలేదండీ. నటనకీ, ధాటీకీ రామారావు; కంఠానికి మాధవపెద్ది సత్యం; డాన్సుకి వెంపటిసత్యం. అసలు వాళ్లు ఈ మనిషిముందు ఎందుకూ పనికిరారు.

డైరెక్టరు: ఇంకేం. అయితే ఏదో ఓ పెద్ద వేషమే ఇవ్వొచ్చు.

ప్రొడ్యూసర్: ఇవ్వొచ్చుగాని ఆ మనిషి ఆడపిల్లండీ. అదొక్కటే చిక్కు.




## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము

క. ఆకాననాంతరంబునఁ, బ్రాకటభుజవిక్రముండు పాండవవజ్ర
ప్రాకారుఁడు గా ముండెను, శోకమనస్కుఁ డయి పవనసూనుం డంతన్.

వ. తత్సమీపంబున సాలసాలతరుషండమండపంబున నుండి హిడింబుం డను నొక్క రక్కసుండు వారి దవ్వులం జూచి పై వెంచి రూక్షకేశంబులు విదిర్చి యావులించి నీల్గి నీరసవన్యమృగమాంసఖాదనజాత నిర్వేదనపరుండ నయి పెద్దకాలంబునకు మానవమాంసం బాస్వాదింపం గంటినని తనచెలియలి హిడింబయను దానిం బిలిచి యిట్లనియె.

ఉ. ఇందుల కిమ్మెయిన్ మనుజు లెన్నఁడు వత్తురె వచ్చి రేని యా
నందముఁ బొంది నిర్భయమునన్ శయనింతురె యిట్లు వంటయిల్
కుండెలు పొచ్చె వేగ చని కోమలి వారలఁ జంపి తెచ్చి నా
కొండఁగ వండి పెట్టుము రసోత్కటమానవమాంసఖండముల్.

### హిడింబ భీమసేనునిం జూచి మోహించుట

వ. అని పనిచిన దదియును నతిత్వరితగతిం జని ముందఱ వారల డాయ శంకించి యొక్కవృక్షంబు మఱువునం గొంత ప్రొద్దుండి.

మ. వనజాతాయతనేత్రు నున్నతబృహద్వక్షస్స్థలున్ సింహసం
హననుం బాండవసింహముం గ్రూరహృదయజన్మాకారు నుద్యన్మహో
శనికల్పస్థిరబాహుఁ జూచుచు మనోజాతాగ్నిసంజాత వే
దన నై రాక్షసి కామరూపధర మర్త్యస్త్రీస్వరూపంబుతోన్.

క. వితతబహురత్నరుచిశో,భితభూషణములు వెలుంగ వెడఁగగు నవపు
ష్పితజంగమలతక్రియ నొ,న్నతకుచ చనుదెంచెఁ బవననందను డాయన్.

క. రమణి నిజభ్రాతృనియో,గముఁ దలఁపక యపుడు భీముఁ గవిసెఁ బతిస్నే
హము కామినులకు బలవం,తము పెఱనెయ్యములు వేయుఁ దత్సదృశము లే.

వ. ఇట్లు మన్మథవ్యథాశిథిలితమానమానసయయి తనయొద్దకు వచ్చుదానిం బవమానసూనుం డవమానపూర్వకంబున నీ వెందులదాన వింతప్రొద్దేల వచ్చి తెటపోయెదు డెడగలిగి పొమ్మనిన నది హిడింబ యిట్లనియె.

క. జననుత నేను హిడింబుం, డను రాక్షసుచెలియలం బ్రియంబున నినుఁ జూ
చినయప్పటఁగోలెను గడు, మనోభవనిశితపాత మానస నయితిన్.

క. నాకుఁ బతి వగుము నిన్నుం, జేకొని మాయన్న రొగ్గు సేయక కాతున్
నాకు మఱి నీవ పతివి గు,ణాకర యుజ్జ్వలమునఁ మహోన్నతమునన్.

ఉ. ఉండఁడు నొక్కరుండ నైన బలియుండు హిడింబుఁడు దానిభూతికిన్
వెంబనిశాచరులం గలరె వీరలు ముంద వెఱుంగ రక్కసా
రొండిఁగ రయొంది యిట్లు దమ యిండుల నుండినయట్లు మెచ్చు నీ
మదిని శయనింతురే కడుఁ బ్రమాదము సేసిరి బుద్ధిహీనులై.

వ. ఇది హిడింబవనంబు దీనిం జొచ్చి వెలువడుట యముకుత్తుకఁ జొచ్చి వెలువడునట్లు యాతండింతకు వచ్చు వీరితోడి దేమి నీవు నాకుం బతివై ప్రాణంబు రక్షించుకొని నావలన విశిష్టోపభోగంబులందు మేనును గామచారిణిని నీ కిష్టం బైనచోటికి నిన్నుఁ దోడ్కొనిపోవ నేర్తు ననిన దానికి భీముం డిట్లనియె.

క. విను వేల యెట్టికష్టుఁడుఁ, దనపురుషగుణంబు సెడఁగఁ దల్లిని దోఁబు
ట్టినవారి విడిచి రాగం,బునఁ జపలస్త్రీసుఖంబుఁ బొందునె చెపుమా.

వ. అనిన విని హిడింబ వీరినిందఱ రక్షించుట నీకుఁ బ్రియంబేని యప్పురుషాదుండు రాకుండ ముందఱ వీరి నెత్తికొని పోయెద వీరినందఱం బ్రబోధింపు మనిన భీముం డిట్లనియె

తే. అధికవీరుండు రక్కసుఁ డరుగుదెంచు,నని మనంబున భయ మంది వనజనేత్ర
వీరి సుఖసుప్తులైయున్నవారి నిద్ర, సెడఁగ బోధింపనోప నా కడిమి వినుము.

ఉ. క్రచ్చఱ నొక్కరక్కసుఁడ కాఁడు సురాసురు లెల్ల నొక్కఁడై
వచ్చిన నీవ చూడఁగ నవార్యబలోన్నతిఁ జేసి వారలం
వ్రచ్చి వధింతుఁ గాక యిటు వచ్చి శ్రమంపడి యున్న నిచ్చట
న్మెచ్చగువీరి దైన సుఖనిద్రకు భంగము సేయ నేర్తునే.

వ. పెక్కులు వలుకక యారక్కసు రాఁ బనుపు మని భీమసేనుండు విజృంభించి పలుకుచున్నంత నట హిడింబుండు హిడింబ మసలుటకు మహాక్రోధానలజ్వలిత చిత్తుండయి.

సీ. కాలమేఘంబును బోలె విశాలమై, నీలమై దేహంబు గ్రాలుచుండ
ఘనతటిల్లతల య ట్లనిమిడిదంష్ట్రిలు, మెఱవంగఁ బంతులు గొఱికి పెలుచ
నతిరోషలోహితాయతవృత్తనేత్రముల్, దిరుగంగఁ బెట్టుచుఁ బరుషకేశ
జాలంబు గాడ్పునఁ దూలంగఁ గాలోప,మానుఁడై చనుదెంచి మానుపాదుఁ

ఆ. దనుజఁ జూచి కష్టమనుజులఁ గూడి నా,పనుపు సేయకుండఁ జనునె నీకు
ననుచు నుదరి పలుక విని హిడింబయుఁ గడు,వెఱచి భీమసేను మఱువు సొచ్చె.

## భీమసేన హిడింబాసురుల యుద్ధము

ఉ. పన్నగవైరివిక్రముఁడు పాండవసింహము దానిఁ జూచి మీ
యన్నను నన్నుఁ జూడుము భయంపడకుండుమ యంచు వాని న
త్యున్నతుఁ దాఁకి రాక్షస వధోచిత నీబలగర్వ మేదఁగా
నిన్ను వధించి యివ్వనము నెట్టన చేసెద నిర్భయంబుగాన్.

క. చక్కనగు మనిన రక్కసుఁ,డక్కజముగఁ బెరిఁగి యియ్యె యగు నిప్పుడు నీ
యుక్కును బీరముఁ జూచెదఁ,జిక్కన నిలు మనుచుఁ గడు విజృంభించి వడిన్.

క. చే సమరికొంచుఁ బొడువఁగ, డాసిన తద్భుజముతోడ డగ్గఱఁగ జయో
ద్భాసి యయి పట్టికొనియె మ,హాసత్త్వుఁడు భీమసేనుఁ డమ్మనుజాదున్.

క. నిరుపద్రవసుఖనిద్రా,నిరతాత్మకు లయిన వీరి నిద్రకు నస్మ
చ్చరణభుజఘాతశబ్దం, బరుదుగ విఘ్నంబు సేయు నని వగచి మదిన్.

క. వడముడి యారక్కసు న,య్యెడ కష్టధనుః ప్రమాణ మెడ గలుగఁగ నె
వ్వడి నీడ్చె నల్పమృగమును, విడువక గజవైరి యీడ్చు విధమునపోలెన్.

చ. చరణహతిం లతాతరులు సాల్పడి జర్జరితంబు లై మహిం
దొరఁగఁగ నిట్లు లొండొడుల తోడ మదోద్ధతవృష్టిహాయన
ద్విరదములట్లు ఘోరరణ వీరులు సేసిరి మల్లయుద్ధ ము
ద్ధురబలు లై సమీరణసుతుండు హిడింబుఁడుఁ దద్వనంబునన్.



# వరలక్ష్మికి వరుడు

రుద్రాభట్ల నరసింగరావు



తండ్రితో వరలక్ష్మి ప్రాణం విసిగిపోతోంది — భీమవరం తాలూకా ఆఫీసు దగ్గరఉన్న ఈ సత్రపుగదులమీద అద్దె వసూలుచేసే గుమాస్తాగా ఆయన నియమింపబడిన నాటినుంచీ, (భీమవరం రైలుమార్గాల కూడలి అవడంవలన ఆ సత్రవుకి ఎంతోమంది వస్తూపోతూ ఉంటారు.) ప్రతీవారితోనూ తండ్రి తన పెళ్ళిగొడవ ఎత్తక మానటంలేదు.

శివాలయంలోని నూతినుంచి చేతితో చీర కుచ్చెళ్ళుఎత్తి పట్టుకుని, చంకన నీళ్ళ బిందెతో వస్తున్న వరలక్ష్మి అరుగుమీద ఎవరో కొత్తబ్బాయితో మాట్లాడుతున్న తండ్రిని చూసి చికాకుతో కనుబొమలు ముడిచింది.

వంటయింటిలో బిందె దింపుకుంటూ, పెసరపచ్చడిలోనికని ఉల్లిపాయలని చెక్కగా తరుగుతున్న చెల్లెలితో 'నేను తరుగుతాను లేవే. నువ్వికపో!' అంది ఆమె.

తను చేసున్న పనినుంచి లేచిపొమ్మన్నప్పుడల్లా లీల చప్పున గ్రహించుకుని అడ్డు చెప్పక లేచిపోవడం పరిపాటి. కాని యివాళ మాత్రం ఆ పిల్ల అలాగే కూర్చుని 'బోల్తా పడ్డావక్కయ్యా! నాన్న ఆ అబ్బాయి కులం గోత్రం అడుగుతున్నాడనుకున్నావుగదూ? కాదులే. పాపం ఆయన బెజవాడ వెళ్ళాలిట. పైనుంచి వస్తూంటే ఇక్కడి రైళ్ళూ అవీ అందలేదుట. అందుకనేమో యీ రాత్రికిక్కడ ఆగుతాడట. ఓ గది యిమ్మనీ...అః అదండి' అని నవ్వింది.

వరలక్ష్మి కోపం నటించింది. 'పన్నెండేళ్ళు లేవు గాని పెద్దకబుర్లు చెప్పడానికి తగుదువు. కొత్తవాళ్ళొస్తే గడపలోకి లైటుపట్టుకు వెళ్ళక్కర్లేదుకేం?' అంటూ హరికేన్ లాంతరు పట్టుకువెళ్ళి గుమ్మంమీద ఉంచి తాను సగంవరకూ తలుపుచాటున [illegible]డింది.

నారింజపండురంగు బుష్కోటు వేసుకున్న ఆ యువకుడు '...ఈ రాత్రికిక్కడ ఆగడానికి మీరు కాస్త సదుపాయంచేస్తే తెల్లవారుఝాము బండికి వెళ్ళిపోతాను.' అన్నాడు-వరలక్ష్మివైపు ఒకచూపు విసరి.

'సరే మీరేబండికి వెడితే మాకేం లెండి. అర్థరూపాయి చెల్లిస్తే గది యిస్తాం. కాని చాపలూ గీపలూ అంటే మాత్రం [illegible]ంవు' అన్నాడు పేరిశాస్త్రి.

'అర్థరూపాయే? ఒక్కరాత్రికే!' అని ఆకుర్రాడు కొంచెం ఆశ్చర్యాన్ని కనబరచాడు. 'అదేమిటండీ గుమాస్తాగారూ, వెనక ఓసారి నేనీ సత్రవులో దిగినవాడినే. మూడురోజుల దాకా ఊరకనే ఉండనిస్తారనుకుంటూనే.'

'ఆ పద్ధతులన్నీ మారిపోయాయండి.

'అయ్యో మారవుటండీ మరి. ఓల్డ్ ఆర్డర్ ఛేంజెత్-అంటూ వుంటాడు మా స్నేహితుడొకడు. అంచేత మారితీరవలసిందే. కాని చూడండి. ఈరాత్రికి రెండో ఆట సినీమాకి పోయి కాలక్షేపం చేసేద్దామనుకుంటున్నాను. నా ప్రాణం కంటె [illegible]వైన సర్టిఫికెట్లూ అవీ ఉన్న ఈ పెట్టెని నేను వెళ్ళే చోటికల్లా ఎలా మోసుకుపోగలను చెప్పండి. దీని నొక్కదానినీ జాగ్రత్త చేశారంటే మీ మేలు మరిచిపోను, నాముందు ప్రయాణానికి చాలీచాలకుండా ఉంది డబ్బు.'

అతను వట్టి పిసినిగొట్టూ, గడుసువాడూ అని గ్రహించినా వరలక్ష్మి హృదయంలో ఆ మాటలవర్ణంవలన జాలిఏరు పొంగకుండా ఆగలేదు. 'మనగదిలో ఈమూల కావలసినంత చోటుంది నాన్నా! పెట్టుకోవచ్చని చెప్పరాదూ?' అంది.

తండ్రి వెంటనే ఆ సిఫారసుని తలదాల్చాడు. 'సరే పెట్టెకేం ఫరవాలేదనుకోండి. కాని మీరు సినీమాకి వెడితే తలుపు తీసేవారుండరు,' అన్నాడు.

ఆ అబ్బాయి పెట్టె ఎత్తుకొని వరలక్ష్మి కొంచెం తొలగగా గదిలో పెట్టుగుంటూ 'పోనీలెండి. మీకా శ్రమకూడా ఎలా యివ్వగలను? నేనీ అరుగుమీద చలిలోనే కునుకు పట్టించుకునేందుకు ప్రయత్నం చేస్తాను. ఈలోపున కాస్త తినడానికేమయినా తెచ్చుకునేందుకు అలా బజారికి వెళ్ళమంటారా?' అని వరలక్ష్మివైపు మరోసారి పరిశీలనగా చూశాడు.

'అందమైన కుర్రాళ్ళు ప్రతీఆడపిల్లవైపూ చూసేందుకు తమకున్న అందం ఒక టిక్కెట్టు అనుకుంటారు కాబోలు!' అని వరలక్ష్మి కోపం తెచ్చుకుంది.

* * *

తండ్రీ చెల్లెలూ తినిలేవగా, ఆ ఎంగిళ్ళు

ఎత్తి ఇక తాను అన్నం పెట్టుకుతిందా మనుకుంటోంది వరలక్ష్మి.

'అదేమిటండోయ్ ఆ కొత్త బన్నురొట్టెఅరటిపళ్ళతో తయారయారు? పోటుకూడ తెచ్చుకోలేకపోయారా' అంటున్నాడుఅరు గుమ్మిదపడుకున్న తండ్రి.

"కారమే! స్వీటు పోటులిద్దరిలో పోటునా నాలిక్కి స్వీట్ హార్ట్ కాలేక విడాకులిచ్చుకుని చాలాకాలమయిందండి" అని బదులిచ్చాడు ఇందాకటి అబ్బాయి.

'ప్చ్. బతుకంతా బాధలేనండి.'

'అవుననుకోండి. కాని జీవితం జనతావృద్ధాప్యంస్టేషన్ చేరేసరికి మన నెత్తిమీద మూటలూ అవీ దింపుకుని కొత్త హాయిగా కూర్చోడానికి వీలుంటుందని నా నమ్మకం.'

'చిన్నవాళ్ళుగనక మీకలాగ అనిపిస్తుంది. కాని ముసలితనంలోవుండే బాధలు ఇంకేదశలోనూ ఉండవు.'

'అలాగనకండి. సంసారతాపత్రయమనే ఆఫీసులో రెక్కలు ముక్కలు చేసుకుని వార్ధక్యంకొంప చేరుకుని పడకకుర్చీలో వాలగానే మనిషికి సగం శ్రమ పోతుంది. ఆ మీదభగవన్నామమనే టీని రుచి చూశాడా,ఓహోహో, దానిని తాగినకొద్దీ అతని అలసట మాయమయి ఆనందాన్ని పొందుతాడండీ.'





వరలక్ష్మి అన్నం పెట్టుకోవడం కూ డామరిచిపోయి, నవ్వుకుంటూ నిలబడిపోయింది.

'ఏమిటండోయి, మీరు కవులా లేక వేదాంతులా?'

'లేక టీ ఏజెంటునా అనికూడా అడగవలసింది. మూడూ కానుగాని, మూడూ అయిన మాస్నేహితు డన్న మాట లివి.'

'బాగా సేవుంది. స్నానంచేస్తారా?'

'అయ్యో చెయ్యొద్దుటండీ! ఇవాళ ఎండా, దుమ్మూ అంతా సాపాతే గద.'

'సరే—అమ్మాయీ, చేద పట్రా' అనికేక వేశాడు పేరిశాస్త్రి.

మధ్యగదిలో చదువుకుంటూ వున్న లీలలేచి బొక్కెన తీసుకువచ్చింది.

'నువ్వెందుకే అక్కయ్యని తీసుకురమ్మన లేకపోయావ్?' అని విసుగుకున్నాడు తండ్రి.

'అక్కయ్య భోంచేస్తోంది నాన్నా'అంది లీల.

తండ్రి తనని చేదపట్టుకురమ్మనడంలో ఉద్దేశం వరలక్ష్మికి తెలుసు. 'లేదులేవే—నేను నుయ్యి చూపిస్తాను నాన్నా! రమ్మను'అంది.

ఆ అబ్బాయి హుషారుగా పెట్టెలోనితువ్వాళ్ళుతీసి వరలక్ష్మి దారి చూపగా శివాలయం నూతికి వెళ్ళాడు. నీళ్ళు తోడుకొనిగట్టుమీద పెట్టి పోసుకోక చుట్టూ చూడసాగాడు.

చంద్రోదయ మవుతోంది. ఆ మూల లతలనుంచి సువాసనలు వస్తున్నాయి.

ఇంకా అక్కడినుంచి కదలని వరలక్ష్మి'ఏమిటండీ, అలా నిలబడిపోయారు. నీళ్ళుపోసుగోండి' అని గుర్తుచేసింది.

[illegible] ఉన్న వరలక్ష్మినిచూసి [illegible]

# ★ వరలక్ష్మికి వరుడు ★

'ఏమిటలా దిక్కులుచూస్తారు' అనడిగింది వరలక్ష్మి కోపంగా.

ఆ యువకుడు కొంటెగాచూసి నవ్వుతూ 'నాకంతా ఇంద్రజాలంలాగుందండీ. ఇక్కడ ఏది లతో, ఏది మీ శరీరమో, ఎవరు చంద్రుడో, ఏది మీ ముఖమో నాకేమీ అంతుపట్టడంలేదు. మా స్నేహితుడు సర్రియలిస్టు చిత్రాలు చూపించినపుడైనా ఇంత గాభరాపడలేదు' అన్నాడు.

వరలక్ష్మి కొంచెం ఆశ్చర్యపోయింది—అతను తీసుకున్న చనవుకి. 'పోకిరీరకమా?' అని అనుమానించబోయి 'ఈయన వాలకం చూస్తే అలాగ లేదే' అని జవాబు చెప్పకుంది. అయినా ఏమంటాడో చూద్దామని 'మీరిప్పుడు వెళ్ళేది నేత్రవైద్యానికా?' అంది వెంకిగానే.

'అలాగే అనుకోవాలి. నిరుద్యోగుల కళ్ళకి పొరలాగఉన్న అమాయకత్వంవలన అర్హత ఉంటే ఉద్యోగం వస్తుందని నమ్ముకున్నారు. దానిని గవర్నమెంటు ప్రతీ ఇంటర్వ్యూకీ, రాత పరీక్షకీ వీరు వచినప్పుడల్లా కొద్దికొద్దిగా తొలగిస్తుంది. కనుక నేనొకవిధమైన నేత్రవైద్యానికే వెళ్తున్నాను.'

'సరే, నీళ్ళు పోసుకోదలచుకోలేదా?'

'చలి!'

వరలక్ష్మికి నవ్వువచ్చింది: 'సత్రవులో సుకుమారాలేమిటో! నీళ్ళు పోసుకునివచ్చి మానాన్నగారు మీకు పెళ్ళయిందా అని అడిగితే కాలేదని బొంకితే కాస్త వేడి వేడి చారూ, అన్నం అయినా దొరుకుతుంది' అంది.

ఈసారి ఆఅబ్బాయికి వొళ్ళు మండింది: 'బొంకడం! నాన్సెన్స్. నాకు నిజంగానే పెళ్ళికాలేదు.'

'అయినా కాకపోయినా కాలేదనే చెప్పాలి. ఇక్కడి రూల్సు అంతే' అని వెళ్ళిపోయింది.

* * *

పేరిశాస్త్రి తమయింట్లో అపూట భోంచెయ్యమనగానే మాధవరావు - అప్పుడే ఆ అబ్బాయి పూర్తిపేరు పేరిశాస్త్రి అడిగి తెలుసుకున్నాడు - సరే, మీలాంటి పెద్దలు పిలిచినపుడు కాదంటే అవిధేయతగా కనబడుతుంది' అని లేచాడు.

'మొగమాటపడకుండా తినండి. పచ్చడీ మెతుకులేగద? సత్రపు భోజనం అంటారే, ఇదే!' అతిథికి దగ్గరలో కూర్చుంటూ అన్నాడు పేరిశాస్త్రి.

'అయ్యో! ప్రేమకలుగుకూడు పట్టెడైనను చాలు అన్నాడు వేమన. అదీగాక నాకీ భోజనం అమృతోపమానంగా వుంది. పెసర పచ్చడిలో ఉల్లి చెక్కవేస్తే ఇక నేను పరమాన్నమైనా అలా వేలేసి ముట్టను.'

'అంత యిష్టమన్నమాట. అన్నట్టు మన శాఖ ఏమిటిబాబూ?—ఇంకొంచెం నూనె వెయ్యి లక్ష్మీ. కారంగా వున్నట్టుంది,' అని కూతురివైపు చూశాడు పేరిశాస్త్రి. అలా అతను చూడ్డానికి కారణం పాపం మాధవరావు కారం తినలేక బాధపడుతున్నాడని కాదు. తను పెళ్ళిప్రసక్తి ఎత్తినందుకు కూతురు తర్వాత తనమీద కారాలూ మిరియాలూ నూరుతుందేమోననే భయం.

వరలక్ష్మి నూనె వేయబోయింది.

'అబ్బే అక్కరలేదండీ...ఆఁ...ఒక్కగరిటె చాలు. మనశాఖండీ, ఆఁ...' అంటూ గుర్తు చేసుకుంటున్నట్టు ఎడమచేతితో తల నిమురుకోసాగాడు మాధవరావు.

అతని బాధచూసి జాలిపడి వెల్లాట్లుకారు కామోసునాన్నా' అని నేర్పుగా అందించింది వరలక్ష్మి.

మాధవరావు తొడచరిచి 'ఆగుర్తువచ్చింది. కాకపోవడమేమిటి? వెల్లాట్లమే' అన్నాడు.

'ఇంకేం. ఈమధ్య మన శాఖీయులైన కుర్రాళ్లు నాకు తారసిల్లనేలేదు. మీకు మీగోత్రం తెలియదనుకుంటాను'

'తెలుసునండి కాని మరిచిపోయాను. ఈమరుపుబాధ పడలేకనే ఒప్లాను వేశాను. ఇన్‌ఫర్‌మేషన్ ఎండ్ ఇన్‌స్ట్రక్షన్స్ ఎట్సెటరా టు ది ఫాదర్స్ ఆఫ్ అన్‌మేడ్ గర్ల్స్ ఎండ్ పెళ్ళిళ్ళ పేరయ్యాస్-అనే కరపత్రంలో నాకు సంబంధించిన వివరాలన్నీ వ్రాసి నన్ను పెళ్లి చేసుకోదలచిన ఆమె ఎలా ఉండాలో సూచనలుచేసి ముద్రించి కావలసినవారి కొక్కొక్క కాపీ యిద్దామనుకుంటున్నానండి' అని గడగడ మంచినీళ్లగ్లాసు ఖాళీ చేశాడు మాధవరావు.

'బాగానేఉంది. అయితే మీగోత్రం-'

'తెలుసునండి మీదాన్ని చెప్పండి. దాన్నిబట్టి ఏమైనా గుర్తొస్తుందేమో!'

'కాశ్యప-'

'అహఁ ఏదో భామీద వస్తుందండీ'

'భారద్వాజ-'

'ఆఁ! భారద్వాజస్ గోత్రం. ఈ అరవ ఋషులపేర్లు ఉన్నాయే, చచ్చినా జ్ఞాపకం ఉండవనుకోండి.'

'ఛీఛీ! ఏమే లీలా! కుక్క వస్తూంటే చూస్తూ ఊరుకున్నావా? ఛీ!' అంటూ అవతలికి పరుగెత్తి పొట్టచెక్కలయేటట్లు నవ్వుకుంది వరలక్ష్మి.

పేరిశాస్త్రి మొగం కొంచెం విప్పారింది. అయితే మీరిప్పుడు వెళుతున్నది రాతపరీక్షకా? ఇందులో సెలక్టయితే ఎంత జీతం ఇస్తారు బాబూ?' అనడిగాడు.

'నూటముప్పయ్యండి'

'ఒహో-అమ్మాయీ! ఇలా వచ్చి చారులోకి మరికాస్త అన్నం వెయ్యవే,' అని కేక వేశాడు.

వరలక్ష్మి వచ్చి అన్నం వడ్డించింది,

'అయ్యయ్యో ఇంకన్నం వద్దండీ... పడేశారూ?'

'అదేమాత్రం లెండి' అంటూ పేరిశాస్త్రి మాధవరావు ఆస్తిపాస్తుల వివరాలు అడుగుతూ మధ్య మధ్య కూతురి ముఖం చూడసాగాడు.



"గ్రామోత్సవానికి"

చిత్రకారుడు : కల్యాణప్రసాద్ శర్మ

భోజనం ముగించినతర్వాత అతిథితో పాటు అరుగుమీదకి వచ్చాడు పేరిశాస్త్రి.

వరలక్ష్మి గిన్నె చూసుకుంటే అట్టడుగున రెండు మెతుకులు మిగిలాయి. అవే ఊడ్చుకు పెట్టుకుని తన చెల్లెలికి మాధవరావిచ్చిన అరటిపళ్ళని లాగుకుని విస్తరిలో వేసుకుంది. 'పాపం! ఎంత ఎంత ఆకలితో వచ్చాడో' అనుకుంది తనకిక మిగిలేది ఆకలే కాబట్టి.

'మీరు రెండో ఆటకి వెళ్ళొచ్చును. నేను తలుపుతీస్తాను,' అన్నాడు పేరిశాస్త్రి.

'అబ్బే అక్కరలేదండీ అరుగుమీద పడుకుంటాను అని వినయం కనబరచబోయాడు మాధవరావు.

'నిద్ర పట్టదన్నారుగా?'

'పట్టకపోతే నిద్రాదేవిమీద ఓ దండకం చదవడమే పని. భమిడిపాటి కామేశ్వరరావుగారనీ...'

'ఏం, ఆయనకి పెళ్ళికావలసిన మగపిల్లలున్నారా ఏమిటి?"

'నాకు తెలియదు. ఆ భమిడిపాటివారు దోమమీద ఓ దండకం చేశారు. అలాటిదే అయితే నా నిద్రాదండకం వినిస్తానెప్పుడంటే సరి. ఎలాగంటే—'

'మీలో చురుకుపాలెక్కువ. నాకు నిద్రాభంగం అవుతుందేమోనన్న సంశయంతో మీరు సినీమాకెళ్ళడం మానెయ్యకండి. షుగర్ కంప్లెయింటనీ—మీకెరుగుదురేమో?' అని ఏదో చెప్పబోయాడు పేరిశాస్త్రి.

మాధవరావు వెంటనే 'అయ్యో, షుగర్ కంప్లెయింటంటే ఎరగకపోవడం ఏమిటి! పంచదారకరువు గాదూ? మనకేం విజయనగరంలో ఉన్నప్పుడివన్నీ అనుభవించినవాళ్ళమే. రేషన్ కార్డుమీద ఇచ్చే పంచదార చాలక బ్లాక్‌లో నానాఅవస్థలూ పడి కొనేవాళ్ళం...' అని ఏకరువుపెట్టసాగాడు.

పేరిశాస్త్రి విసుగ్గా మధ్యలో అందుకుని 'షుగర్ కంప్లెయింట్ అనేమాటకి పంచదార కరువనే అర్థం ఉందేమో మీలాటి చదువుకున్నవాళ్ళకి తెలియాలి. ఈ మాటని నాకు తెలిసినంతవరకూ ఓజబ్బుకి వాడతారు. తెలుగులో మధుమేహం అని కాబోలు అంటారు. దీనితో నేను చాలాకాలంగా బాధపడుతున్నందువల్ల నాకు రాత్రులు నిద్రపట్టదు, గనక "మీరు సినీమాకి వెళ్ళి వస్తే తలుపుతీస్తాను" అన్నాడు.

మాధవరావు సానుభూతిపూర్వకంగా 'అయ్యో. అలాగటండీ, పాపం. ఏంచేస్తాం వార్థక్యదశలో కూడా ఏవో బాధలు. సరే, మీరంతంగా చెప్తుంటే కాదనగలనా?' అన్నాడు.

'ఏసినీమాకి వెళతారు?'

'నాలుగుబోర్డులూ చూసిగాని తేల్చుకోలేనండీ. తెలుగుసినీమాకయితే ఆ శ్రమ అనవసరం. దేనికి వెళ్ళినా ఒక్కటే.'

'ముందరాగనీ, మొన్న మా పిల్లలు వెళ్ళొచ్చారు. దానికి—' అని సూచించబోయాడు పేరిశాస్త్రి.

ఇంతలో వంటయింటిలోనుంచి వరలక్ష్మి 'అదికాదు నాన్నా! అత్తా ఒకింటికోడలే అని రంగామహల్‌లో ఆడుతోంది. దానికి వెళ్ళమను. చాలా బాగుందట' అని సలహా ఇచ్చింది.

ఆమెని బలపరుస్తూ 'అలా చెయ్యండి' అన్నాడు పేరిశాస్త్రి. 'ఆఁ మీ ఎరికలో ఎక్కడైనా మంచిసంబంధాలున్నాయండీ!' అనడిగాడు చల్లకివచ్చి ఇంకెంతసేపుముంతని దాచడమనుకుంటూ.

# ★ వరలక్ష్మికి వరుడు ★

మాధవరావు తెల్లబోయి 'ఎవరికి?' అన్నాడు.

'మా పెద్దమ్మాయికండీ. యింకెవరికి?'

'ఓహో' అని సిగ్గుపడ్డాడు మాధవరావు. 'ఉన్నాయండీ కాని ఉన్నవాటిలో చాలా మందికి ఉద్యోగంలేదు. ఇంకొంతమంది తమ రక్తమాంసాలమ్ముకునే గాడిదలు!'

'అదేమిటి?'

'అబ్బే అలా భయపడకండి. అంటే కట్నాలడిగే బాపతన్నమాట.

'ఓ అదా చంపేశారు! కట్నం పుచ్చుకోనివాళ్లెవరండీ?'

'ఎంతమాటన్నారు! ఆదర్శభావాలున్న యువకులు ముందుకు వస్తున్న యీరోజుల్లో అనవలసినమాటా అది? నేడు మన సమాజంలో అక్కడక్కడ ఒక్కొక్క యువకుడు—గంజాయిమొక్కలమధ్య తులసిలాగ, సానివీథిలో సంసారిలాగ, బ్రాందీబుడ్లమధ్య బలవర్ధకఔషధంలాగ ఉండి, ఉద్యోగం సంపాదించకముందే పెళ్ళిచేసుకున్నవాడు గాడిదనీ, కట్నం పుచ్చుకున్నవాడు గాడిదతాతనీ కేకలు వేస్తున్నాడని మీకు తెలుసునా?'

ఈ ఉపన్యాసం విని పేరిశాస్త్రి హడిలిపోయాడు. 'అలాగాండి? కాని ఉద్యోగానికి ముందే పెళ్ళి చేసుకుంటే పోయిందేముందండి? కొద్దికట్నం పుచ్చుకుని దానిని ఏ ఆఫీసరుకో లంచంగా ఇచ్చేస్తే యిట్టే వుద్యోగం వచ్చేస్తుందిగదా?"

మాధవరావు చిరునవ్వునవ్వాడు. 'ఏమిటో అనుకున్నానుగాని మీరూ ప్రపంచజ్ఞానాన్ని తాగేసినవారే. కాని చూడండి. కట్నం పుచ్చుకోవడమే ఒక తప్పు అంటే, లంచం ఇవ్వడం ఆతప్పుని రెండుపెట్టి గుణించడమేగా?'

పేరిశాస్త్రి ఇంకేమో అడగబోతూవున్న సమయంలో తండ్రికి మంచినీళ్ళు పట్టుకు వచ్చిన వరలక్ష్మి 'నాన్నా, ఆయనకి సినీమాకి వేళవుతోంది. వెళ్లనీ,' అంది.

పేరిశాస్త్రి అనిష్టంగానే 'అవును. మరి వెళ్లిరండి' అన్నాడు.

*　　*　　*

సినీమానుంచి వచ్చాక పెట్టెతీసుకుని 'మరి వెళ్లొస్తానండీ' అన్నాడు మాధవరావు.

'ఇదుగో బాబూ మాట' అన్నాడు పేరిశాస్త్రి కొంచెం జంకుతూ. 'ఇందాక మా పిల్ల భయంవలన అడగలేకపోయాను. ఆఁ. మీకు పెళ్లయిందా?'

వరలక్ష్మికి తెలివి వచ్చింది.

'అయ్యో, పెళ్లి కాకపోవడమేమిటండీ. మొన్ననే మా అబ్బాయికి—'

'ఆఁ!'

'—బారసాలకూడా అయింది.'

పేరిశాస్త్రి దీర్ఘనిశ్వాసం విడిచాడు. 'ఉద్యోగం దొరకనిదే పెళ్ళి చేసుకోకూడదన్నారే' అన్నాడు.

'అవును. ఇప్పుడూ అంటాను. ఉద్యోగం లేనివాడు ఏదో రోమాన్సుకోసం ఆశపడి పెళ్లాడితే ఎన్ని బాధలు ఉన్నాయో స్వానుభవంవలన గ్రహించి అన్నమాట అది! రైలు వేళవుతోంది. వెళ్లొస్తానండీ మరి.'

'మంచిది.'

దూరమవుతున్న మాధవరావు అడుగుల చప్పుడు వింటూ కొయ్యబొమ్మలాగ నిలబడి వున్న తండ్రిమొగం చూసింది వరలక్ష్మి. 'అయ్యో, కొండంతఆశ పెట్టుకున్న నాన్న మనస్సుకి ఎంత దెబ్బతగిలింది. ఆడపిల్లల తండ్రులంటే పెళ్లికొడుకుల కెంత చులకన! పిల్లికి చెలగాటం, ఎలకకి ప్రాణసంకటం' అనుకుంటూ ఇంకొకపక్కకి ఒత్తిగిలింది ఆమె—దణ్ణెంమీద మాధవరావు ఆరవేసిన తువ్వాళ్ళు కనిపించాయి. 'అరె, వెళ్లేటప్పుడు లేచి ఆయనకి వాటిమాట జ్ఞాపకం చేద్దామనుకుంటూనే పడుకున్నాను సుమా. నాన్న గొడవలో పడి మరచిపోయాను. వరి మతిలేనిదాన్ని' అని బాధపడింది వరలక్ష్మి.

*　　*　　*

మాధవరావు వెళ్లిపోయినతర్వాత పేరిశాస్త్రి మారిపోయాడు పూర్తిగా. మునుపటిలాగ అతను యువకులని పలకరించి వారి కులగోత్రాలు అడగడం మానుకున్నాడు. కొంచెం పరాకుకూడా ఎక్కువయింది.

తండ్రిలో వచ్చిన యీమార్పుకి వరలక్ష్మి మొదట్లో సంతోషించినప్పటికీ, రెండుమూడురోజులలోనే ఆమెకి తండ్రిఅంటే అంతులేనిజాలి పుట్టుకొచ్చింది. మాధవరావు మీద ఆఅమ్మాయికి ఎంత కోపంగావున్నా అతను వచ్చివెళ్లడంతో ఆమె మనస్సులో ఏదో వెలితి ఏర్పడింది. అతని గురించి ఆలోచించడం వరలక్ష్మికి ఇష్టంలేదు. కాని అతను తలపుకి రాకమానడు. తొలిరోజులలో అతనినిగూర్చిన తలపులు ఆమెకి తియ్యగా తోచేవి. ఆ తలపులు అతని చక్కదనమూ, మాటకారితనమూ గురించే కాబట్టి. కాని ఆలోచించినకొద్దీ మాధవరావులోని అవగుణాలన్నీ ఒక్కొక్కటే క్రమంగా కలతపెట్టసాగాయి వరలక్ష్మిని. తాను అందగాడినన్న అహంభావం మాధవరావుకి ఎక్కువ. ఈ విషయం అతను తనవైపు చూసినప్పుడల్లా అతనికళ్లలో కొట్టవచ్చినట్టు కనబడేది వరలక్ష్మికి. అతను వసపోసినపిట్టలాగ వాగడానికి కారణం అతను పరమశుంఠ అవడమేనని వరలక్ష్మి నమ్మకం. ఈరకం 'మాటకారుల' సంభాషణలు మూడుసార్లు వింటే మొహం మొత్తుతుంది. కొత్తదనం వున్న. ఇందుకు వరలక్ష్మి ఏమీ అనుకోదు పెద్దగా. కాని మాధవరావు కపటి అన్న తలపు ఆమె హృదయంలో ముల్లులాగ ఉంది. ఒకరూపాయి డబ్బులు నావికావనుకుంటే లభించే భోజనవసతి సౌకర్యం కోసం కుక్కలాగ అన్నిపాట్లుపడి, పైపెచ్చు దానికి ఉన్నపాటి విశ్వాసమయినా లేక నానా అబద్ధాలూ కల్పించిచెప్పి చివరకితన తండ్రి ఆశలని నరికి జారుకున్న ఆ కసాయివాడంటే వరలక్ష్మి ఒకమూల కోపం, ఇంకో మూల దుఃఖం.

(46-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

[1 4 59 మొదలు 7-4-59 వరకు]

గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| శ బు కే | శు | | కు |
| | ధనుర్మకర, కుంభ, మీనములలో చంద్రుడు | | |
| | | | |
| శ | గు | | రా |

## * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈవారము ధనాభావము ఎక్కువ ఎవరి సహాయమువల్ల కార్యసాధన చేదామనుకున్నారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయినా దైవబలమువల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకునిరాశ. విద్యార్థులకుమంచి రోజులు కావు. వారమంతా ఆందోళనగా వున్నా సాధుసాంగత్యము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, నష్టద్రవ్య లాభము కలుగును.

## * భరణి [లీ, లూ, లే, లో] *

ఈవారము అనుకూలత కన్న ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు శ్రమాధిక్యముతో ఫలించును. కోర్టుదావాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి సాగక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగా వుండదు. ఇచ్చిపుచ్చుకోనేపట్ల వివాదములు ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వారమంతా నిరాశ. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

## * కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ] *

ఈవారము ఎన్ని అవాంతరములు వచ్చినను పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభమును పొందుతారు. ఆశించిన డబ్బు సమయానికి అందక అప్పుచేస్తారు. సోదర సహాయము కలుగుతుంది. ఆత్మీయులవల్ల నిందలు పొందుతారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు రంగులు, లోహపు సామానుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. 1న ప్రమాద సూచన.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈవారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోనూ అధికారుల సహాయముతోనూ, ఆటంకములను గడిచి ఫలం పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్యదిక్కునుండి కుశలవార్త తెలుస్తుంది. విద్యార్థులకు మంచికాలము. కవులకు గణిత శాస్త్రజ్ఞులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము 2,3,4 ధనలాభము, కార్యసిద్ధి.

బి. నరసింగరావు

## * మృగశిర [వే, వో, కా, కి] *

ఈవారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికి వస్తుంది. నూతనకార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో అనుకూలత వుంటుంది. పండిత గోష్ఠి జరిపి నూతనాంశాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగములున్నా కొంత ఆందోళనతో కూడివుంటుంది. 2,3,4 ధన లాభము, కార్యసిద్ధి. 6, 7 అధిక ఖర్చులు, విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

## * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈవారము వినోదములలో పాల్గొనుట దధి, క్షీర, మధురపదార్థయుక్త సుభోజనము రజతపాత్రలలో భుజించుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్తువులు కొనుట మొదలైనయోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు వెండి, బియ్యము, ద్రవపదార్థ జన్యముల క్రయవిక్రయములతో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది. విద్యార్థులకు మంచికాలము 6,7 అధిక ఖర్చులు ఆందోళన.

## * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈవారము ధనధాన్యవృద్ధి కృషి మూలకముగా లాభము. వివాహాది శుభ కార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా, చదువు బాగా సాగుతుంది. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు రెట్టింపు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు యోగకాలము. ఆప్తులతో విందు, వినోదము.

## * పుష్యమి [హూ, హే, హో, డా]

ఈవారము మీకు కార్యభారము ఎక్కువ రాబడి తక్కువ. గృహావసరములు తీరక కలతలు ఆరోగ్యము సరిగాలేని సూచనలు కనపడగానే ఔషధచికిత్స పొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించుట మేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు; వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు ఆందోళన. 2,3,4 పితృవర్గ సహాయము, ధనలాభము, ప్రయాణము. 6,7 ఆరోగ్యభంగము.

## * ఆశ్లేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు సాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములు వున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్రవస్తుసంపాదనవంటి శుభయోగములుకూడా వుంటవి.

## * మఖ [మా, మీ, మూ, మే.] *

ఈ వారము మీరు సహాయము పొందదలుచుకున్న వ్యక్తి మూలముగా కార్యహాని పొందుతారు. ధనాభావంకూడా ఎక్కువ. ఇంట్లోవారి ఆరోగ్యముఆందోళన కలిగిస్తుంది. ఆధ్యాత్మిక చింతవల్ల దైవముపై భారము వేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి; వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు మంచికాలము కాదు. పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము. విచిత్రములను చూచుట, జరుగును. వారమంతా అవయోగ, శుభయోగ మిశ్రముగా వుంటుంది.

# ★ నక్షత్రఫలితాలు ★

## * పూర్వఫల్గుణి (పుబ్బ) *
## (మో, టా, టీ, టూ)

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తాయి. ఇతరులకు సహాయము చేయబూని ఫలించక నిందలుపొందుతారు. యిచ్చిపుచ్చుకోవడములో వివాదాలు కలుగుతాయి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ. తోటివారి సహకారము వుంటాయి. వర్తకులకు వారమంతా నిరాశ, వారాంతమున మేలు. 6, 7 భార్య అనారోగ్యముచే ఆందోళన, విద్యార్థులకు చదువు బాగాసాగదు.

## * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
## (టే, టో, పా, పీ)

ఈ వారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించడమువల్ల కార్యసిద్ధి అవుతుంది. ఆశించినసొమ్ము సమయానికి అందక అప్పుచేస్తారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రతవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహ, రంగులవ్యాపారస్తులకు కష్టముతోకూడిన లాభము. గనుల యజమానులకు, యంత్రములు నడుపు నిపుణులకు, ఇంజనీరింగు వుద్యోగులకు మేలుకాలము.








## * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు యోగకాలము. బంధు సహాయము, అధికారుల సహాయము కలుగుట చేత అన్ని చిక్కులు వీడి కార్యసిద్ధి అవుతుంది. ఆదాయము వృద్ధిపొందుతుంది. శాస్త్రప్రసంగాల్లో పాల్గొంటారు. కవులు నూతన రచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషముపొందుతారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము.

## *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీకు మంచి భాగ్యయోగము. అనుకున్నడబ్బు చేతికివస్తుంది. ఇబ్బందులు తీరుతవి. దావాలలో గెలుపుపొందుతారు. పిల్లల అభివృద్ధికి చేసేప్రయత్నాలు ఫలిస్తవి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థాన ఉద్యోగులకు, న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

## * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము వుంటుంది. సంగీతసభలు, కవితాగోష్ఠివంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్నభోజనము వెండిపాత్రలలో చేస్తారు. శుభకార్యములలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి, వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహంగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది.

## * విశాఖ [తీ, తూ, తే, తో]

ఈ వారముకూడా మీకు గతవారమువలెనే యోగదాయకముగా ఉంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగాముగుస్తవి. శుభ, పుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నిస్తారు. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయ విక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా వారాంతమున కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. స్త్రీలతోనూ మిత్రులతోనూ విందు వినోదము.

## —ఈ వారము ధరలు:—

నూలు, వస్త్రములు :- చురుకుగా వుండును.
నూనెదినుసులు:- క్రమముగా సులభమగును.
ఆహారధాన్యములు:-ధరకలిగివుండును.
బెల్లము, పంచదార:- మార్పు లేదు.
చింతపండు:-స్వల్పముగాతగ్గును.
పప్పుదినుసులు :- మార్పు లేదు.
బంగారము :-మార్పు లేదు.
వెండి :- స్వల్పముగా పెరుగును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము నెరుగనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయునూ చూచుకొనునది.

## అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము రాబడి తక్కువ. ఖర్చులు ఎక్కువ. గృహావసరములు తీరక స్పర్థలు వస్తాయి. అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడము, రవికి శాంతి చేయించడము మంచిది. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన విద్యార్థులకు చదువు సరిగా జరగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గ సహాయము, కార్యలాభము కలుగుతవి.

## * జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]

ఈ వారము నిరాశగావున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము అవుతుంది. ఇంట్లో వున్నవారి అనారోగ్యమువల్ల ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమందు లాభము. వారమంతా ఉద్రేకముగా వుంటుంది. విదేశీయుల పరిచయము. అపురూపవస్తు సంపాదన కలుగుతాయి. 6, 7 అధిక ఖర్చులు, మనోవ్యథ. విద్యార్థులకు చదువు బాగాసాగదు.

## * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక, ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ. వర్తకులకు చాంచల్యము. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగా

వున్నా నష్టద్రవ్యలాభము పొందుతారు. 6, 7 అధిక ఖర్చులు.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]*

ఈ వారము అనుకూలతకన్నా ప్రతికూలత యెక్కువ. ఇచ్చి పుచ్చుకునేపట్ల వివాదాలు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించినా అమిత ఖర్చుల వల్ల ఆ సంతోషము వుండదు. భార్యకు అనారోగ్యము కలిగే సూచన లున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె, వ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవారివల్ల గౌరవము కలుగుతుంది. 6, 7 భార్యకు అనారోగ్యము. బంధువుల రాక, అధిక ఖర్చులు.

### *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్న కార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి. అయిననూ పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. సోదర సహాయంవల్ల ఒడిదుడుకులు సద్దుకుంటాయి. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్త వల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారస్తులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 1 న ప్రమాద సూచన 6, 7 అధిక ఖర్చులు.

### *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధన లాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము కలుగుతుంది. గణిత,జ్యోతిషశాస్త్ర చర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు,బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. 2, 3 కార్యసిద్ధి. 6, 7 అధిక ఖర్చులు.

### * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఇంట్లో శుభకార్యాల ప్రయత్నములు చేస్తారు. పుణ్యకార్యాచరణ, ప్రభుత్వ సన్మానము, శాస్త్ర చర్చలు జరుగుతవి. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది. ఇంట్లోవున్నవారి అనారోగ్యమువల్ల కలిగిన ఆందోళన తొలగుతుంది. పిల్లల లాభక్షేమములకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.

### శతభిషం [గో, సా, సి, సూ]

ఈ వారము మీరు తలపెట్టిన పనులలో జయము పొందుతారు. నీటిపై ప్రయాణము చేయవలసి వస్తుంది. బంధుమిత్రులతో వినోదములలో పాల్గొని మృష్టాన్నభోజనము చేస్తారు. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థజనితవస్తువులు. క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

### పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]

ఈ వారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి కలుగుతుంది. వివాహాది కార్యాలోచనలు ఫలప్రాప్తి పొందుతాయి. ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తి కలుగుతవి. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము ఎక్కువ. వాహనయోగము కలుగుతుంది. కవులకు గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. 6, 7 కుటుంబ కలహము.

### *ఉత్తరాభాద్ర [దూ, శం, ఛా, ధా]*

ఈ వారముమీకు కార్యభారము ఎక్కువ. వింతమాటలు వినుట పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము, కలుగుతవి. అనారోగ్య సూచనలు కనపడగానే జాగ్రత్త పడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితో పాటు అనుకూలత. 2, 3 పితృవర్గ సహాయము. కార్యలాభము. 6, 7 అనారోగ్య సూచనలు.

### * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము యత్నకార్యసిద్ధికి ఆలస్యము కలుగుతుంది. వర్తకులకు లాభము తక్కువ. ఆత్మీయుల ఆరోగ్యము చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వతప్రాంతాలకు బదిలీ అయ్యే సూచన లున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగించబడుతారు. వారమంతా చికాకుగా వున్నా, వారాంతమందు అజ్ఞాతమిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి కలుగుతుంది. ★

## ★ సమర్పణ ★

(19వ పేజీ తరువాయి)

ఆపలేక, శాస్త్రుల్లిద్దరూ సతమతమైపోయేరు.

“మహారాజ్ సోమయాజులు కా దర్శన్ దిలావ్”అన్న నాదంనిండిపోయింది. అది సోమయాజులు చెవినీ పడింది.

సభాపతి, పెద్దలు లోపలికివచ్చేరు. అంత దూరంలో చూడగానే సోమయాజులికి వంగి వంగి నమస్కారాలుపెట్టేసి, చిరునవ్వు గౌరవం, అణకువ కనపరిచారు.

పిచ్చాపాటిమాటలు వెళ్ళేయి. తర్వాత వుండబట్టలేక ఒకరు ‘ఆయన రక్తం మడుగులో చచ్చిపడివున్నాడు” అన్నారు.

ఇంకొకరు “రాత్రికిరాత్రే ఆయన ఆ స్వాములువారి దగ్గరకు వెళ్ళి దాసోహం అనీ అన్నాట్ట. దానికి ఆయన ‘ఎవరికర్మ ఎవరూ తీర్చలేరు. కాని వెర్రివాడా ఆ ఆంధ్రుడితో పెట్టుకున్నావేమయ్యా! వాళ్లు అందరూ నివురుకప్పిన నిప్పులు’ అని అన్నాట్ట” అందిచ్చేరు.

సోమయాజులు పరధ్యానంలో పడిపోయేను విననట్టే.

అంతే.

తర్వాత సభలూ జరిగేయి. అన్నీ సవ్యంగానూ వెళ్లేయి. సోమయాజుల్ని అందలమే ఎక్కించేరు.

కాని,

ఆనాటినుండి సోమయాజులుకు పరాకు పరచిత్తం అయిపోయింది. ఆ వూరినుంచి శెలవు తీసుకుంటూనే ఆలయంలో సోమయాజి “పాండురంగా! ఈ కాలంలో నా చేత బ్రాహ్మణహత్య చేయించేసేవు కదా! ఎలాపోతుంది ఈ పాపం” అని గోలపెట్టేసేడు.

ఇంటికి వెళిపోదామనుకున్న వసుపతితో “లేదు నాయనా, ఆ ఘడియ ఇంకా రానే రాలేదు. కాశీ వెళ్లి విశ్వేశ్వరుడి దర్శనం చేస్తేనేకాని నేను రాను” అంటూనే చెప్పేసేడు.

శేరావధానికి అప్పుడు అర్థంఅయ్యింది. ఈ గీతకి టీకాతాత్పర్యం.

(ఇంకా వుంది)

# సజ్జనుడు - దుర్జనుడు

జామచెట్టు కొమ్మమీద
రామచిలుక గూరు చుండి
కాయగొఱికి కడుపునిండ
కమ్మగఁ దిను చుండెను;
వాయసమొం, డాయానము
వాయ, నచటికేగు దెంచి
ప్రక్కనున్న కొమ్మమీద
గ్రక్కునఁదా వ్రాలెను;
కాయఁదినెడి చిలుకఁ జూచి
కాకి యటులె దినగనెంచి
పొడువగానె ముక్కుతోడ
పుటుకునఁ దెగిపడియెను.

దాని నెటులొ గఱచి తెచ్చి
కాలిక్రింద నొక్కిపట్టి
పొడిచి తినగఁబూనెఁగాని
పొడుగుముక్కు! పొనగునెట్లు?
చిఱునవ్వున చిలుక జూడ
చిఱ్ఱుబుఱ్ఱులాడి కాకి
కాయనటనె విసరికొట్టి
కొఱకొఱమని యురిమిచూచి;

"చిలుకమ్మా! కులుక బోకు!!
పొడుతిండి! పచ్చికాయ!!
ఈ మాత్రపు కసుగాయలు,
నే మాత్రము తినలేనా!!

తీపిలడ్డు తిన్నావా!
గారెల రుచి మరగితివా!!
కమ్మనైన పెరుగుకూడు,
కడుపునిండ మెక్కితివా!!!

కుళ్లిన మాంసము రుచియును
కూరముక్కలోని సొగసు
నులిపురుగుల నుండు రుచియు
నీ కెట్టులు తెలియునులే!
ఏమిముక్కు? వంకముక్కు!
ఏమిరంగు? పంచకూళ్ల
కషాయంబు; దీనికి, మహా
మురిసిపోవు చుంటివహో !!!

అనెడి కాకి కాఱుకూత
లకును, కనలి; యాత్మగౌర
వంబు పొంగ, ననియె చిలుక,
"వాయసమా! వదఱబోకు;
కతికెద వెంగిలి మెతుకులు
కారు నలుపు నీ రూపము
కశ్మలంబు దినెడినీకు
కాయల రుచి దెలియునెట్లు!
పరులపెట్టు నాశించము,
ఒరుల కెగ్గు సేయబోము,
కాయొ, కసరొ! దిన్నిబతికెద
మెదలో సంతస మొదవగ,

నీ జోలికి వచ్చితినా!
నీ మాటల నెత్తితినా!
నాతో నేటికి వాదము?
నీ త్రోవను పొమ్మికన్."
అనుమాటల కాగ్రహించి
"పొగరడంతు నీ"కటంచు
పొడిచి, రక్కఁబోయె, కాకి;
ఎగిరి పారి పోయె చిలుక;

ఊరకసజ్జనుం డొదిగి-
యున్ననైన దుర్జనుండు
వానిఁజేరి యపకారము-
జేయబూనుఁ దెలియుడీ!

# నక్క తెలివి

పూర్వం వింధ్యారణ్యంలో ఒక నక్క వుండేది. ఎదటివాళ్లని మోసగించటంలో దానికదే సాటి. దాని మాటలకు ఎంతటివాడైనా ఇట్టే లోబడిపోతూ వుంటాడు.

ఒక రోజున నక్క ఆహారాన్ని వెదుక్కోటానికి బయలుదేరింది. ఉదయమే లేచి ఎవరి మొహం చూసిందో ఏమో, మధ్యాహ్నందాకా వెదికినా దానికి ఎలాంటి ఆహారమూ దొరికిందికాదు. నక్కకి చాలా నిరాశవేసింది. ఈవాళ పస్తు పడుకోడాలా ఖర్మ అని బాధపడుతూవుండగా పక్కనేవున్న చెట్టుదగ్గఱ ఒక వల్లని కళేబరం దానికళ్ల కగుపించింది. కొండంత ఆశతో ఆ మృత కళేబరాన్ని సమీపించింది నక్క. దాని అదృష్టం బాగుండబట్టే ఆ కళేబరం ఏనుగుదై కూచుంది. ఆనందం పట్టలేకపోయింది. నెల దినాలకి సరిపడే గ్రాసం లభించిందని మురిసిపోయింది. అసలే ఆకలితో వున్నదేమో ఆత్రంగా ఆ చచ్చిన ఏనుగుమీద పడి దాని చర్మమును భేదించటానికి ప్రయత్నించింది, నక్క.

## క్రోవి రామమోహనశాస్త్రి

ఏనుగు చర్మం సహజంగా గట్టిగా వుంటుంది. అంచేత నక్క ప్రయత్నాలు విఫలమైనాయి. ఒక పట్టాన చర్మం విడలేదు. శతవిధాల ప్రయత్నించి చూసింది. లాభంలేకపోయింది. అయాచితంగా ఆహారం దొరికినా దానిని ఆరగించే యోగ్యత లేకపోయిందికదా అని బాధపడింది. ఏం చెయ్యటానికీ తోచక దిక్కులు చూస్తూ వుండిపోయింది, నక్క.

ఇంతలో మృగరాజు అటువైపు వెళుతున్నాడు. మృగరాజును పిల్చి ఈ కళేబరాన్ని చూపిస్తే, ఆయన కొంత తిని, మిగతాది తనకు వదిలివేస్తాడని తలచి నక్క గబగబా మృగరాజును సమీపించి నమస్కరించింది.

"ప్రభూ! ఈ గజరాజు కళేబరాన్ని తమకోసం కాపాడుతున్నా. రండి. దీని మాంసాన్ని ఆరగించి నన్ను ధన్యుడ్ని చేసిపొండి," అని ప్రార్థించింది.

కాని, సింహం అయిష్టంగా తలూపి, "నీ కోరికను కాదన్నందుకు బాధపడకు. నా స్వహస్తాలతో చంపిన జంతువు మాంసాన్నే నేను తినగలను, గాని దీనినిమాత్రం తిన








దూర ప్రయాణం

 **నక్క తెలివి** 

లేను" అని పలికి వెళ్ళిపోయింది.

నక్క మృగరాజు ఔదార్యానికి సంతోషించి, మరెవరేనా వస్తారేమోనని ఎదురు చూడసాగింది.

మరికొంచెం సేపట్లో ఒకపులి అటుకేసి వచ్చింది. పులిని చూడగానే నక్కగుండెల్లో బండపడింది. తనను తరిమేసి ఈ ఏనుగు మాంసాన్ని తాను తినేస్తుందేమోనని భయపడిపోయింది. అయినా క్షణంలో ఓ వుపాయం ఆలోచించినది.

"పులిరాజా! మీరిక్కడికి రావటం అంత శ్రేయస్కరమైన పని కాదు. ఈ గజరాజును ప్రభువులు సంహారించి, దీన్ని చూస్తూ వుండమని నాకు చెప్పి, తాము స్నానానికి వెళ్ళారు. 'పులీ గిలీవస్తే నాకు చెప్పు. తక్షణం వాణ్ని ముక్కముక్కలుగా చేస్తాను; అని శలవిచ్చారు. నామాట విని తక్షణం ఇక్కడనుండి వెళ్ళిపొండి. ప్రభువులు వచ్చే వేళయింది కూడాను" అంది కంగారుగా.

ఈ మాటలు వింటూ పులి తిరిగి చూడకండా పారిపోయింది. నక్క నవ్వుకుంది. అదేసమయంలో మరోవైపునుంచి చిరుతపులి వచ్చింది. దాన్ని చూడగానే, అర్గదీ, నా సామిరంగా! నాకు సహాయంచేసే అమాయకుడొచ్చాడు" అనుకుంటూ నక్క చిరుతపులికి ఎదురువెళ్ళింది.

"మిత్రమా! చాలారోజులకి కనిపించావే! అరెరె! అదేమిటి నీ మొహమలా పీక్కుపోయింది? భోజనం చేసినట్లులేవే! ప్రభువు ఈ కళేబరాన్ని కాపాడమని చెప్పి ఎక్కడికో వెళ్ళారు. రా! దీన్ని తిందువుగాని" అన్నది.

"అమ్మయో! దీనిలో నేను బ్రాెపెట్టానంటే ప్రభువు నా శరీరాన్ని నిలువునా చీరేస్తారు" అంది చిరుత భయపడుతూ.

"భయపడకోయ్. నేవున్నాగా! నువ్వు మాంసం తింటూవుండు. నేనాపక్కనుండి ప్రభువు వస్తున్నాడో లేడో చూస్తాను. ప్రభువు వస్తుంటే నే చెబుతాను. నీవు పారిపోదువుగాని" అంది నక్క.

ఈసలహా చిరుతపులికి నచ్చింది. వెంటనే అది ఏనుగు శరీరంమీద పడి చర్మాన్ని చీల్చసాగింది. కొద్ది క్షణాల్లో దాని పుణ్యమా అని ఏనుగు శరీరంలో తేలిగ్గా మాంసాన్ని తీసుకునేటంత బొరియ ఏర్పడింది. ఇది చూచిన నక్క, "మిత్రమా! ప్రభువొస్తున్నాడు" అని అరిచింది. అది విని చిరుత తిరిగి చూడకుండా పారిపోయింది.

నక్క ఆనందంగా నవ్వుకుంది. అంతమందిని మోసగించి తన కార్యాన్ని నిర్విఘ్నంగా కొనసాగించుకున్న నక్క ఆ ఏనుగు మాంసాన్ని నెలరోజులపాటు హాయిగా ఏచీకూ చింతాలేకండా భక్షిస్తూ కాలం గడిపింది. ★

# ఎవరు గొప్ప?

మొగలాయీ చక్రవర్తియైన అక్బరు పాదుషా ఒకనాడు విశ్రాంతి మందిరపు ఉద్యానవనంలో, చల్లని గాలిలో మనోహరమైన ప్రకృతి సౌందర్యాన్ని తనివి దీరా పరికిస్తూ, తిరుగుతున్నాడు.

పచ్చని ఆకులతో నున్న వృక్ష సమూహము, వికసించిన పువ్వులతో కళకళ లాడుతున్న పూలమొక్కలతో, పచ్చని పట్టుతివాసీలావున్న పచ్చికతో అలరారుతోన్న ప్రకృతిని తిలకిస్తూన్న ఆయనకు సాగి ఎన్నెన్నో మధురాలోచనలు కలుగనాయి.

అలా తీయటి ఆలోచనల్లతో తిరుగుతున్న అక్బరుకు, హఠాత్తుగా ఒక సందేహం కల్గింది. "దేవుడు, మనుష్యుడు ఆనందించుటకు, సుఖంగా జీవించుటకు ఎన్నో సౌకర్యాలు కలిగించి, సమస్తజీవకోటిలో మానవజాతినే గొప్పదిగా చేశాడు. అయితే ఈ మానవకోటికంతకూ గొప్పవాడెవడు?" అన్న జటిల సమస్య ఆయన మనస్సులో మొలకెత్తింది. ఆ ప్రశ్నకు జవాబు దొరక్క, ఆయన మనసంతా అల్లకల్లోలమయిలది. ఆనాటి రాత్రంతా ఆలోచనల్లతోనే గడిచిపోయింది. చివరకాయన తన సందేహాన్ని సభలో వెల్లబుచ్చి, తగిన సమాధానం వినాలని కుతూహ డ్డాడు. ఆయన స్వభావం ఎటువంటిది అంటే-ఏదైనా సమస్యగాని, సందేహంగాని కల్గిందంటే, దానికి తగిన సమాధానం వినేంతవరకూ ఆయనకు మనసు మనసులో వుండదు. ఎప్పుడు తెల్లవారుతుందా?' అని ఎదురు చూశాడు.

మరునాడు అక్బరు పాదుషా, తొందరగానే కాలకృత్యాలు ముగించి, రాజదుస్తులు ధరించి, మంగళతూర్యాలు మ్రోగుతూండగా, ఠీవిగా సభామంటపంలో అడుగెట్టాడు. గాంభీర్యం వుట్టిపడేట్టు, మత్తగజం

"పద్మజా వేణి"

లా నడుస్తూ, వెళ్లి రత్నఖచితమైన ఆసనంపై ఆసీనుడైనాడు. సభంతా ఆస్థానకవులతో, పురజనులతో, రాజోద్యోగులతో క్రిక్కిరిసిపోయివుంది.

అక్బరు పాదుషా సభవైపు ఒకసారి తన సునిశితమైన దృష్టితో చూచేడు. ఆయన నయనాలు మెల్లగా 'బీర్‌బల్' ఆసనంవైపు వెళ్లేయి అక్కడ ఆసనం ఖాళీగావుంది. 'అరె! ఇంకా బీర్‌బల్ రాలేదేమిటి చెప్మా!' అనుకున్నాడు. మెల్లగా చిరునవ్వు చిందిస్తూ సభికులవైపు చూచి, తన సందేహాన్ని వెలిబుచ్చేడు.

"సభికులారా! దేవుడు భూమిపై సకల జంతుకోటిని సృష్టించాడు. అవి ఈగడ్డపై జీవించడానికి తగునదుపాయాలు గావించాడు. సకలజంతుకోటిలోకి, మానవకోటిని అత్యుత్తమంగా, ఎక్కువ విజ్ఞానాన్ని కలిగివుండేలా సృష్టించి, మానవులకు ఇతర జంతుకోటి అంతా లొంగివుండేలా చేశాడు. ఇలా మానవులు గొప్పవారైనారు. కాని నాకొక తీరనిసందేహం కల్గింది యిక్కడ... ఈ మానవకోటిలో గొప్పవాళ్ళెవరూ? అని...ఎవరైతే నా ప్రశ్నకు సమాధానం చెప్పగల్గుతారో వారికి వెయ్యివరహాలు బహుమానము ఇస్తాము."

రాజుగారి సందేహాన్ని విన్న సభికులు అంతా ఒక్కసారిగా తెల్లమొహాలు వేశారు. సభలో కలకలం బయలుదేరింది. "ఎవరుగొప్ప"అన్న సందేహం అందరికీ కలిగింది, కాని దానికితగిన సమాధానం ఏమిటీ? అని ఒక్కరికీ తట్టలేదు. "అయ్యో! పూరక వెయ్యివరహాలు చెయ్యిజారిపోతున్నాయే!" కొందరు విచారించారు. "ఎవరి కదృష్టంవుందో-వెయ్యిరూపాయలు బహుమానం" అని మరికొందరు అనుకొన్నారు.

అంతలో ఒకసభికుడు లేవడం చూచి, సభ సద్దుమణిగింది.

"షాహజాదా! ఎవడిదగ్గర మిక్కుటంగా సైన్యంవుంటుందో, వాడే ఈలోకంలో గొప్పవాడు. ఎందుకంటారా?—సైన్య సహాయంతో



అమెరికాలో 33 సంవత్సరాలు నివసించి, భారతదేశానికి స్వాతంత్ర్యం కావాలని పోరాటం జరిగినరోజుల్లో అమెరికాలో ఎంతో ప్రచారసహాయంచేసి, ఇన్నాళ్ళకి స్వదేశానికి తిరిగివచ్చిన శ్రీ జె. జె. సింగ్, ఆయనభార్య.

## ★ ఎవరు గొప్ప? ★

ఎన్నో రాజ్యాల్ని గెలువవచ్చు. ఆ విధంగా రాజ్యం విస్తృతంచేసి, ఏకచ్ఛత్రాధిపతి కావచ్చు. ఎంతో ఐశ్వర్యంతో తులతూగవచ్చు. సైన్యమున్న వాడికి అడ్డే లేదిక" అని సమాధాన మిచ్చాడు ఆ సభికుడు. "తనకే వెయ్యి వరహాలు ముట్టుతాయి" అని ఆశతో వున్న ఆ సభికుడికి మరొక సభికుడు లేవడంతో నిరుత్సాహం కలిగింది.

ఆ తరువాత రెండవ సభికుని వైపు ఏమిచెపుతాడో అని అక్బరుతో సహా అందరూ చూస్తున్నారు.

"రాజా! ఎవని వద్దనైతే ఎక్కువగా బంగారం వుంటుందో వాడే గొప్పవాడీ లోకంలో. వాడు ప్రతి వస్తువునూ బంగారంతోనే చేసుకొని, ఏ మహారాజు కూడ అనుభవించని ఆనందాన్ని, ఐశ్వర్యాన్ని పొందవచ్చు. అంతా బంగారుమయం చేసి, ఆనందంగా జీవింపవచ్చు" అన్నాడు సభికుడు. కాని ఈ సమాధానం అక్బరుకి నచ్చలేదు.

మంత్రి సూచన ప్రకారం మరొకడు లేచాడు. "మహాప్రభూ! ఈ లోకంలో గొప్పవాడెవరో తెలీదా? మీ కన్నా గొప్పవాడు ఈ లోకంలోనే కాదు, మూడులోకాల్లో గూడా లేదు ప్రభూ!" అని యింకా ఏమో చెప్పబోయాడు గాని ప్రక్కవాళ్లు లాగి ఆసనంలో కూర్చోపెట్టారు. ఎందుకిలా జరిగిందా!' అని తెల్లమొహంతో సభంతా కలియజూడసాగాడు.

అలా తన్ను గొప్పవాడంటూ పొగిడేసరికి అక్బరుకి పట్టరాని కోపం వచ్చింది. మొహం చిట్లించారు. "నా సందేహాన్ని బీర్‌బల్ తప్ప మరెవరూ తీర్చలేరు. వట్టిచాతకాని దద్దమ్మలు వీళ్లు" అనుకున్నాడు.

అదే సమయంలో బీర్‌బల్ గబగబ సభలో కరుదెంచి, "నా ఆలస్యానికి పాదుషావారు క్షమించాలి" అంటూ వినయంగా వంగి నమస్కరించి, ఆసనంపై కూర్చున్నాడు. బీర్‌బల్‌ని చూడగానే ఆయన ముఖం విప్పారింది. వెంటనే బీర్‌బల్‌కి తన సందేహాన్ని వివరించాడు అక్బరు. బీరబల్ అంత లేచి నిలబడి;

"మహారాజా! ఎంత చిన్నటి సందేహాన్ని వెలిబుచ్చారు. మీ రెప్పుడూ ఇంతే..ఏదో ఒక సందేహమంటూ ప్రతిరోజూ మమ్మలి వేధించుకుంటారు. సరే మీ ప్రశ్నకి ఇదో నా జవాబు — "అసహాయస్థితిలో, ప్రక్కన ఎవరూ లేక, అలమటిస్తూ వున్నవాడిని, ఎవడైతే ఆదుకుని, చివరకు తన ప్రాణాల్ని సైతం త్యాగంచేసి, సహాయం చేస్తాడో, అటువంటివాడే ఈ మానవులందరికన్న గొప్పవాడు" అని గంభీరంగా సమాధానమిచ్చాడు.

ఈ సమాధానం విని అక్బరు బ్రహ్మానందపడ్డాడు. సభంతా కరతాళధ్వనుల్తో మ్రోగుతుండగా, వెయ్యి వరహాలను అక్బరు సంతోషంతో అందివ్వగా తీసికొన్నాడు బీర్‌బల్ వినయంతో. ❖

# ★ సీతాస్వయంవరం ★

(23-వ పేజీ తరువాయి)

హైదరాబాద్,

సీతా,

నీగుండె, ఇంత పిరికిగుండె అనుకోలేదు, నేనెప్పుడూ ఇంతవరకు నిన్ను గురించి, నేను, గొప్ప గుండెనిబ్బరంగలదానివనుకుంటుండేదాన్ని సుమా! అదంతా నా అపోహేనా. ఒక విషయంమాత్రం గుర్తుంచుకో. మనం జీవితంలో అనేకమైన అనుకోని పరిస్థితులను, ఎదుర్కోవలసివస్తుంది. అంతమాత్రాన బేజారైపోతే ఎలా?

కానీ, సీతా! నేనుమాత్రం నీ మనస్సు అర్థంచేసుకోవడం లేదనుకోకుసుమా! ఏది ఏమైనా, నీవొక లక్షాధికారిబిడ్డవు. కట్నాలు ఇచ్చుకోలేక తంటాలుపడే సామాన్య కుటుంబంలో నీవు జన్మించలేదు. నీవు అంతవరకు, అదృష్టవంతురాలవేగదా. ఒక్కసారి, నా పెళ్ళికై మానాన్న పడ్డపాట్లు ఊహాపథంలోకి తెచ్చుకో.

తాంబూలాలుపుచ్చుకొన్నతర్వాత పెళ్ళి వెనక్కి పోయిందన్నావు, అతను అంత మూర్ఖుడా! తాంబూలాలు పుచ్చుకోడమంటే అర్థం తెలియని జ్ఞానహీనుడా! పుట్టుమచ్చల ఆధారంగా, జీవితంలోని మలుపులను గుర్తింపగలిగిన మేధాసంపన్నుడా. క్షమించు, అతన్ని నిందిస్తే నీకు కోపం వచ్చిందేమో!

మనం స్కూలు విడిచేటప్పుడు 'కాండక్టు సర్టిఫికెట్'లు ఇస్తారు జ్ఞాపకంఉందా! దానిపై గనుక అసంతృప్తికరమైన రిమార్కు ఉంటే ఉద్యోగాన్వేషులకు ఎంతకష్టమో. ఊహించు. తాంబూలాలు పుచ్చుకొన్న తర్వాత పెళ్ళి వెనక్కుపోతే, పెళ్ళికావలసిన ఆడపిల్లల పరిస్థితికూడా అంతే!... ఏమైనా అధైర్యపడి, మనస్సు పాడైపోవటంకంటే, వేరే ప్రయోజనమేమీ లేదు.

అయినా, బహుశా ఈ ఉత్తరం అందేటప్పటికి, మరోసంబంధం వస్తుందేమో. మీనాన్న గట్టిగా ప్రయత్నిస్తున్నాడన్నావుగా!

చెప్పినవన్నీ మనస్సులో పెట్టుకో. మనస్సు కలతచేసుకోకు.

శారద

* * *

గుంటూరు,

శారదా,

నీవు వ్రాసిన ఉత్తరంతోపాటు మరో ఉత్తరంకూడా వచ్చింది, గూడూరునుంచి. మొన్న, అంటే కిందటివారంలో, మానాన్న గూడూరువెళ్ళి విచారించి వచ్చిన సంబంధం గురించి. ఆ అబ్బాయిపేరుసంపత్ కుమార్ట. పేరులాగానే, అబ్బాయికూడా బాగానే ఉన్నాడు ఫోటోలో. వాళ్ళనాన్నకు, గూడూరులో పెద్దమైకాగని ఉందిట. మర్నాడే దిగారు, మా ఊళ్ళో. మానాన్న మా ఇంట్లోనే వసతిఏర్పాటు చేస్తానంటే ఆ అబ్బాయితండ్రి అన్నాడుట—సంబంధం చూడబోతూ, మా యింట్లో వసతిఏర్పాటు చేసుకోవటం, వాళ్ల ఆచారానికి విరుద్ధమని. అందుకే నాన్న, వారికి దగ్గరగా ఉన్న సత్రంలో, మంచివసతి ఏర్పాటుచేశారు. మర్నాడు మా యింటికి వస్తామన్నారుట, నన్ను చూడటానికి! కానీ, మర్నాటి ఉదయాన్నే వారు మకాం ఎత్తేశారుట. కారణమేమిటా అని మా నాన్న సత్రం గుమాస్తాతో విచారించాడుట. అతను నీళ్లునములుతూ చెప్పాడుట—నా ప్రవర్తన మంచిది కాకపోబట్టే, ఇదివరలో తాంబూలాలు తీసుకొన్నవారు వెనక్కిపోయారనీ; ఏదో బలమైన కారణం లేకపోతే, ఈ విపరీతం జరగటానికి అవకాశం లేదనీ; అందుకే వారు మాతో చెప్పకుండా వెళ్ళిపోయారుట.— ఈ మాటలు నాన్న అర్థరాత్రివేళ అమ్మతో రహస్యంగా అంటుంటే, నిద్రపట్టక కొట్టుకుంటున్న నాకు వినపడ్డాయి. గుండెల్లో పిడుగులు పడ్డట్టయిందనుకో!

శారదా! నా మనస్సు ఆశ నిరాశలలో ఊగులాడి, ఊగులాడి; అనేక ఎదురుదెబ్బలు తిని మొద్దుబారిపోయింది. నీవు బోధించినట్లుగానే, పరిస్థితుల ప్రభావాన్ని దిగమింగి, అనుకూలపరిస్థితుల్ని సృష్టించుకోదల్చుకున్నా.

చలపతిమేస్టారు తెల్సుకదూ! ఏమో, నీకు జ్ఞాపకం ఉందో లేదో; మనిద్దరం కలసి చదువుకునే రోజుల్లో ట్యూషన్ చెప్పించుకున్నాం: అప్పట్లో ఆయన ఇంటరు చదువుతూండేవారు. జ్ఞాపకం వచ్చిందా! ఆయన ఇప్పుడు బి. కాం. పూర్తిచేశారు; ప్రస్తుతం నిరుద్యోగి. ఆయనకు మనగురించి వాస్తవ విషయాలన్నీ తెల్సుగదా! (నీవు అత్తగారింటికి వెళ్లిన తర్వాత, నీ గురించి ఆయనకేమి తెల్సులే) నా కుడిమోచేతి మీదనున్న పుట్టుమచ్చవల్ల వచ్చే ప్రమాదాలన్నీ ఎదుర్కోడానికి సిద్ధమేనట.

బహుశా ఈ ఉత్తరం నీకందేటప్పటికి, నేనూ, చలపతి గారు, మేరేజి రిజిష్ట్రారువారి రికార్డులలో దంపతులముగా నమోదు చేయబడి ఉంటాము.

అమ్మ, నాన్నలను తర్వాత ఒప్పింపజేస్తాలే; వారిభారం తీరిపోతుంది. శాస్త్రోక్తంగా జరిగే మా వివాహానికి నువ్వు తప్పకుండా కుటుంబసమేతంగా ముందుగానే రావాలి సుమా. నీ చేతులమీదుగానే, పెళ్లికూతుర్ని కావాలని ఉంది—

నీ బాబు బాగున్నాడా!

సీత—



## జీవితదృశ్యాలు

(21-వ పేజీ తరువాయి)

ఏమీ తోచనప్పుడు గజేంద్రమోక్షం చదువుకుంటాడు.

లేకపోతే పిల్లల్ని విసుక్కుంటాడు. కాకపోతే ఆమెను కసురుకుంటాడు.

ఏమిటో తెలిసికోవాలన్న బలవత్తరమైన కోరిక.

ఏమిటీ తెలియటంలేదు.

ఇంత చంచలమైనదాన్ని చూసుకునేనా తాను ఇంత మోహాన్ని పెంచుకున్నాడు. ఇంతగా సంతోషించాడు.

ఏమున్నది ఇక్కడ?

సుఖాన్ని తూచేందుకు తక్కెడ!?

సుఖంలేదు. దుఃఖంలేదు. దేవుణ్ని రాదీ అంటదు.

ఇది వేదాంతం.

మనుష్యుడికి అన్నీ తెలుసు.

మనుష్యుడికి యేమీ తెలియదు.

మనుష్యుడి అంతర్యం మంచిదే.

కాని పాడుపనులు చేస్తాడు.

వద్దనుకుంటూనే పాడుపనులు చేస్తాడు.

కావాలని చేసేవాళ్లుకూడా లేకపోలేదు.

ఏం చూసుకుని ఇంత గర్వం?

దేన్ని చూసుకుని యీ మోహం?

ఇది జీవితం.

లేనిది, ఏమీలేదు.

జీవితానికి సత్యమైనది మృత్యువొక్కటే.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ."

అన్నాడు గీతాకారుడు.

Words move, music moves only in time; but that which is only living can only die…………

అన్నాడు టి. ఎస్. ఇలియట్.

శివరావు ఇలా అనుకున్నాడు:

ఇవాళో రేపో యెల్లుండో ఎప్పుడో నేనూ చచ్చిపోతాను.

తరువాత ఏమిటి?

దీనికి సమాధానం.

భగవద్గీత.

వేస్ట్ లాండ్.

చివరకు మిగిలేది....



# వరలక్ష్మికి వరుడు ★

(3౽-వ పేజీ తరువాయి)

'మాధవరావు మరోసారి ఇక్కడికి వస్తే బాగుండును' అని ఆశతో ఎదురు తెన్నులు చూస్తుంది ఒకసారి వరలక్ష్మి. 'వస్తే మొగం మీద పేడనీళ్ళు జల్లాలి,' అని కోపగించు కుంటుంది మరోసారి ఆ వరలక్ష్మే.

ఇలాగ ఒక నెలరోజులు గడిచిపోయాయి. ఆరోజు పూర్ణిమ. గతనెల మాధవరావు వచ్చినరోజు. అదంతా వరలక్ష్మికి జ్ఞాపకం రాసాగింది. రాత్రి పన్నెండయినా, నిండు చంద్రుడు నడినెత్తిమీదికి వచ్చినా వరలక్ష్మికి కునుకుపట్టలేదు. కొంతసేపు పక్కమీదనే దొర్లిదొర్లి చివరకి చికాకు కలగగా లేచి వెళ్ళి కిటికీలో కూర్చుంది.

రోడ్డుకి అవతల ఉన్న కదలని చెరువు మీది వెన్నెల టేబుల్ మీద పరచిన గాజు పలకలాగ ఉంది. అవతలి ఒడ్డున ఇంకా దీపాలు వెలుగుతున్న మేడ చెరువులో తన ప్రతిబింబం చూసుకుంటోంది సగర్వంగా, దానిపక్కనే నల్లగా ఒక తురాయిచెట్టు ఉంది. దానివల్లే ఆ తెల్లని మేడ మరింత బాగా ప్రకాశిస్తోందని చెప్పవచ్చు. ఒక తెలి మబ్బు పైకి లేస్తూవుండగా, శివాలయంలోని బాదంచెట్టు మేలిముసుగు లాగుకుంటోందేమో అనిపిస్తుంది. ఈ సౌందర్యమంతా నిశ్శబ్దపు కౌగిలిలో ఒదిగి నిద్రిస్తున్నట్టు ఉంది.

వీథితలుపు చప్పుడయింది.

ఉలికిపడింది వరలక్ష్మి.

'పంతులుగారూ, తలుపు!' అని పిలుపు.

మాధవరావు గొంతు అది. గుర్తుపట్టింది వరలక్ష్మి. ఆశ్చర్యపోయింది. ఆ ఆశ్చర్యంలో ఆశ ఉంది. ఆనంద ముంది. ఆందోళన ఉంది. మాధవరావు ఎక్కడినుంచి వచ్చినట్టు? ఎందుకు వచ్చినట్టు?

'తలుపు తియ్యండి పంతులుగారూ, తలుపు.'

తండ్రిని లేపుదామని లేచింది వరలక్ష్మి. అంతవరకూ నిద్రరాక అవస్థపడి అప్పుడే కన్నుమూసిన తండ్రి మొగం కిటికీగుండా పడుతున్న వెన్నెలలో ప్రశాంతంగా ఉన్నట్టు కనిపించింది ఆమెకి. ముఖం అనేది గాజుతలుపు వెనుకఉన్న రకరకాల వస్తు సముదాయంలాటిది మనస్సు. ఆ రెండింటికీ మధ్య నిద్ర అనే తెల్లని తెర దిగినపుడు గాజుతలుపు ఎంతో స్వచ్ఛంగా తేటగా కనిపించడం సహజమేగదా? తండ్రిని లేపడానికి వరలక్ష్మి మనసు ఒప్పలేదు. పోనీ చెల్లెలిని తోడుగా తీసుకువెళ్దామా అంటే ఆ పసిపిల్లని గాఢనిద్రనుంచి లేపడం బ్రహ్మ తరంకాదు.

అయినా మాధవరావు ఏం పెద్దపులికాదు గదా.

వరలక్ష్మి మెల్లిగా వెళ్ళి తలుపు తెరచింది.

'ఒహ్హో, మీరే వచ్చారా? అనుకుంటూనే ఉన్నా. మీ నాన్నగారు మేలుకుని లేరుగదూ? తువాళ్లు మరిచిపోయానుగా. వాటిని తీసుకుపోవడానికి, ఇంటికి తిరిగి వెళ్తూ, ఇక్కడ దిగాను,' అంటూ లోనికి వచ్చాడు మాధవరావు.

వరలక్ష్మికి అసహ్యం వేసింది. 'ఆ దణ్ణెం మీద అలాగే ఏడుస్తున్నాయి. పట్టుకు దయచెయ్యండి' అంది.

మాధవరావు నవ్వుతూ 'అది సరే; గాని నా మనస్సుని కూడా ఇక్కడే మరిచి పోయాను. నా హృదయాన్ని తీసుకున్న మిమ్మల్ని కూడా పట్టుకు దయచెయ్య మంటారా?' అనడిగాడు.

అర్ధరాత్రప్పుడు ఒంటరి ఆడపిల్లతో ఆ మాట లనగలిగిన ఆ వింతమనిషిని చూసి వరలక్ష్మి ఆశ్చర్యపోయింది. అయినా ధైర్యంగా నే 'నా మీద మోజుపడిన ప్రతీ వాళ్లూ నన్ను పట్టుకుపోవడానికి నే నేమీ షాపులోని రబ్బరుబొమ్మని గాను' అని జవాబిచ్చింది.

'నేను మిమ్మల్ని పెళ్లి చేసుకుంటాను.'

'నేను మిమ్మల్ని చేసుకోను.'

అరుగుమీద చతికిలబడుతూ 'నా ఉత్తరం మీకు అందలేదా? మన తపాలాశాఖ సామర్థ్యం సాటిలేనిది, జగద్విఖ్యాతం లెండి.—అయితే ఇన్ని ఎకరాలనీ కాల దన్నే మీరు శుద్ధతెలివితక్కువవారో, మహా తెలివైనవారో అయుండాలి.' అన్నాడు మాధవరావు.

'మీదయవల్ల నాలో రాయలసీమా లేదు, చిరపుంజీ లేదు లెండి. ఆడవాళ్ళకి డబ్బంటే ప్రాణం అని ఒప్పుగుంటూ ననుకోండి. కాని అందరూ డబ్బుచేతే పుస్తె కట్టించుకుంటా రనుకుంటే పొరపాటుపడ్డా రన్నమాటే' అంది వరలక్ష్మి స్తంభాన్ని ఆనుకుని.

'అరె! కథ అడ్డంతిరిగిందే. మా స్నేహితుడు అంటూనే ఉంటాడు—క్షణక్షణముల మృగాక్షుల చిత్తముల్ - అని కాబోలు. లేకపోతే ఆవేళ నామీద అన్నివిధాల జాలిపడి నాతో సహకరించిన మీరేనా ఇవ్వాళ ఇలా అంటున్నది?' అని ఎంతో జాలి గొలిపేలాగ మొగంపెట్టాడు మాధవరావు.

'జాలి గుండెదాన్నిగదా అని మెత్తని కబుర్లు చెప్పి మోసగించకండి—' అని ఏమో అనబోయింది వరలక్ష్మి.

మాధవరావు తటాలున లేచాడు, ఆశ్చర్య పోతూ. 'మోసగించడమా? అదా నాగురించి మీ అభిప్రాయం?! సరే, సెలవు.' అని వెళ్లబోయాడు.

వరలక్ష్మి ఎందుకో భయపడింది: 'వెళు దురుగాని, అంత తొందరేం?... ఆఁ. ... మీ తువ్వాళ్లు తీసుకోరూ?' అంది బతిమాలుతున్నట్టు.

'అక్కరలేదు.' అని వెళ్లిపోసాగాడు.

వరలక్ష్మి కళ్లు నిండసాగాయి. 'మాట! ఇప్పుడేం రైలు లేనట్టుంది. ఎక్కడికి పోతా రీ రాత్రి?'

'నీ ఆదర్శవరుడున్న అవతలి గట్టుకి వరూ. అక్కడినుంచి కేకవేసినప్పుడైనా నా దగ్గరికి వస్తావుగదూ?' అంటూ వెళ్లిపోయాడు మాధవరావు.

అతనిని పిలుద్దామన్నా గొంతు పెగల లేదు వరలక్ష్మికి.

తన యీ ప్రేమ మాధవరావు అలా వెళ్లి పోవడంతో విషాదాంతచలనచిత్రంలోని ఆఖరి రీలుగా అయిందో, లేక సుఖాంత చలనచిత్రంలోని ఇంటర్వల్‌గా ఉందో మాత్రం ఆ అమాయకురాలు వరలక్ష్మికి అప్పట్లో తెలియదు.





# వనితాలోకం

## సమాధానం దొరకని ప్రశ్న

జి. కె. విజయలక్ష్మి
(హైదరాబాద్)

"అందరూ పిల్లల పెంపకం గురించి వ్రాసే వారే రామ! రామ! ఎవరిపిల్లలు వాళ్ళకి ముద్దు. ఎవరికి యీ వ్యాసాలు" అంటూ వ్యాసాలను తీరుబడిగా విమర్శిస్తోంది ఒక పండిన తల,

నిజమే! ఆవిడ అన్నట్లు ఎవరికి తెలియని యీ సంగతులు అందరికీ తెలుసు. అయితే ఎంతమంది తమ పిల్లలను సక్రమమైన పద్ధతిలో పెంచుతున్నారు. కారణం యేమిటి? చూడబోతే అందరికీ తెల్సిన విషయాలే! కాకిపిల్ల కాకికి ముద్దు కాని యీ ముద్దు ఎక్కువయి తమ పిల్లలను మొద్దులాగ తయారు చేసుకున్నపుడే వస్తుంది అసలు చిక్కు. అందువల్ల పిల్లల్ని పెంచడం ఎలాగో తెలుసుకోవడంలో పెద్దల్ని పెంచడం ఒకపని. అంతపని నేను ఇపుడు చేస్తానని కాదుగాని నాకు తోచిన కొన్ని ముఖ్యమైన సంగతులు చెబుతాను.

మా యింటిదగ్గర ఒకభార్యా, భర్త వాళ్ళపిల్లవాడు వుండేవాళ్ళు భర్త ప్రతి దినం ఆఫీసునుండి వస్తూ తనముద్దుల కుమారుడికి మిఠాయి పొట్లాలు తెచ్చేవాడు. 'పిల్లలకి తెచ్చుకోవటం తప్పా?' అంటారేమో! కాని ఆ అలవాటువల్ల క్రమంగా ఆపిల్లవాడి భవిష్యత్ ఎలా మారిందో చూడండి! ఆ పొట్లాలు తీసుకవచ్చే సమయానికి ఆ కుర్రవాడు నిద్రించేవాడు కాని ఉదయం నిద్రలేవగానే తండ్రి వాడి ముఖమైనా కడగనీయకుండా 'బాబు! ఠయాలు (అంటే పప్పులు) ఆఁ...ఆఁ...' అంటూతినిపించేవాడు. ఆ పిల్లవాడు నవ్వుతూ తినేవాడు, అతి గారాబానికి చిహ్నమైన ఆ అలవాటువల్లే ఆరేళ్ళు వచ్చినా బడికి వెళ్ళక బడుద్ధాయిలా తింటూ తిరిగేవాడు. ఒకసారి తండ్రికి యేకారణంవల్లో ఉద్యోగం పోయింది. అబ్బాయి పది సంవత్సరాలు వచ్చినా వెనుకటివలెనే తండ్రిని అస్తమానం చిరుతిండ్లకోసం వేధించేవాడు. వెంటనే తండ్రి. 'ఛీ! వెధవా! ఎప్పుడూ తిండే! నన్నడగకు వెళ్లు! వెళ్ళు!' అని చీదరించుకునేవాడు.

ఆ కుర్రవాడికి చిన్నప్పటినుండి చిరుతిండ్లు అలవాటయినవి. తన చాపల్యాన్ని అపుకోలేకపోయాడు. ఇంకేముంది! ఆనాట్నుటి నుండి యింట్లోవున్న చిల్లరడబ్బులు మాయమయేవి. అవసరమైన పుస్తకాలు, డబ్బాలు, సీసాలు వొక్కొకటిగా మాయమయేవి.

తండ్రికి తెల్సినా యేమీ అనేవాడు కాదు. తల్లి వారించినా లాభం వుండేది కాదు. అంతటితో వూరుకోక పొరుగిండ్లకు వెళ్ళి చేతి కందినవి కాజేస్తూ, కబుర్లు చెబుతునే జేబులు ఖాళీచేసేవాడు. ఒకసారి ఒకళ్ళు పట్టుకొని తిట్టికొట్టారు. లాభం లేకపోయింది పెద్దవాడయినాడు కాని చదువురాదు. ఏపని చేయడానికి బద్ధకం. క్రమంగా జేబుదొంగ అయి జైలుపాలయినాడు. ఒకసారి ఆ అబ్బాయి తెల్సినవాళ్ళకి కనిపించాడు. ఇకనైనా సరిగా వుండరాదా? అంటే 'ఏం చెయ్యమంటారండి, నన్నలా పెంచారు. నేనిలా తయారయాను. ఇక నన్నెవరూ మార్చలేరు. నేనింతే' అని వెళ్ళిపోయాడు — మొక్కగా వున్నపుడే వంగకపోతే మ్రానయిన తరువాత వంగుతుందా? చిన్నతనంలో చిరుతిండ్లు పెట్టి గారాబంచేసి, పెద్దయిన తరువాత నీ దారి నీదే అంటే యిక ఆ అబ్బాయి ఎలా తయారవుతాడు?—అందరూ యిలాగే వుండకపోవచ్చు. కొందరు పెద్దయిన తర్వాత తమ తప్పు తెల్సుకొని మారిపోతారు. కాని కొందరు అలా మారలేరు—అందుకే పెంచటంలో శ్రద్ధ తీసుకోవాలి!

*   *   *

ఎత్తుకున్న బిడ్డ మొత్తుకున్నా దిగదు— ఎంతవరకు నిజం?

సావిత్రమ్మగారికి లేకలేక వొక్కతే కూతురు పార్వతి. పార్వతికి పెళ్లయి వొక కుమార్తె పుట్టింది. ఇక చూడండి! ఆ సావిత్రమ్మగారు యీ మనుమరాలిని ఒక్క నిముషం క్రింద దింపేది కాదు. నడుస్తే కాలు కందిపోతుంది, అరుస్తే అలిసిపోతుందని అస్తమానం ఎత్తుకునేది! పార్వతి అత్తగారింటికి వచ్చింది. కాని యిక్కడ సావిత్రమ్మగారిలా వాళ్లత్తగారుఎత్తుకునేది కాదు. కాని యీపిల్ల ఎత్తు మరిగింది. పార్వతి ఆ పిల్లని ఎత్తుకు కూర్చుంటే పని ఎవరు చేస్తారు? ఇక చూడండి! అటు పని ఎవరు చేస్తారని అత్తగారి అరుపు—ఇటు దిగనని కూతురు యేడుపు. చివరికి బాత్ రూమ్‌కి వెళ్లవలసినా, కూడా వెళ్లవలసిందే! ఈ బాధ పడలేక ఆ పిల్లని సావిత్రమ్మకి వప్పచెప్పి వచ్చేసింది పార్వతి. ఇక ఆపిల్లకు ఏనిమిదేండ్లు వచ్చినా నడక సరిగా రాదు. ఎక్కడికి పోయినా ఎనిమిదేళ్ల మనుమరాలిని ఎత్తుకొని వెళ్లే ఆ సావిత్రమ్మగారిని చూసి అందరూ ఆశ్చర్యపోయేవారు!

*   *   *

గారాబం గజ్జెలు కడితే వీపు దెబ్బల కేడుస్తుంది!—

ఒకబ్బాయిని వాళ్లమ్మమ్మ అతిగారాబం చేసింది. ఏదికావాలంటే అది కొనివ్వటం ఎప్పుడు ఏది అడిగితే అప్పుడు అది హాజరు చేయటం—ఆలస్యం అయిందంటే అబ్బాయిగారి ఆరునొక్క రాగం ఆకాశం అందుకుండేది. తండ్రని వ్రాసుకునే పెన్ యిమ్మని వొకసారి గోల పెట్టాడు. ఏదో పనికిరాని కలము యిస్తే 'కాదు—అదే కావాలి' అని ఏడుపు.

(54-వ పేజీ చూడండి)

# నేనూ రచయిత నేనా?

వి. సత్యవతిదేవి
(విజయవాడ)

ఆరోజు ఆదివారం అవడం మూలాన్న కొద్దిగా తీరుబాటు దొరికింది. నాలుగు రోజులబట్టి చదువుదామనుకొంటున్న పుస్తకం అప్పుడే చేతులోపట్టుకొని కూర్చున్నాను. ఇంతలో ఎక్కడినుంచో మా,సరోజ వచ్చిపడింది; ఆమెనుచూడగానే నా గుండెల్లో రాయిపడింది. వారంరోజుల క్రిందటే ఒకకథ పట్టుకొనివచ్చి "ఏదైనా పత్రికకు పంపుదామని వ్రాసేను. చదివి నీ అభిప్రాయం చెప్పు" అంటూ నాకిచ్చింది. తీరుబాటు లేకపోవడంవల్ల (అంతకన్న ముఖ్యమైనది పరాకుమూలంగా) అది అలాగే పడివుంది ఆమెను చూడగానే ఆసంగతి జ్ఞాపకానికివచ్చి కూర్చోమని చెప్పి నేను కథను తీసుకొనివచ్చి చదవడానికి ప్రారంభించేను.

రెండుమూడు పేరాలు చదివేటప్పటికి ఇదివరలో నేనా కథను యెందులోనో చదివినట్టు జ్ఞాపకానికి వచ్చింది. చేతిలో కాగితాలు పట్టుకొన్నానన్న మాటేకాని మెదడుమాత్రం యింకోదగ్గర పనిచేస్తూవుంది. మెదడు చురుకుగానే పనిచేస్తూ వుండడంవల్ల హఠాత్తుగా ఏదోతట్టి "ఇప్పుడే వస్తానని" చెప్పి కాగితాలతోసహా లోపలికి వెళ్లేను. పాతపుస్తకాలబీరువాతీసి అందులో రెండేళ్ళక్రిందటిది ఒక పత్రికతీసి చూసేటప్పటికి అందులో నే ననుకొన్న కథవుంది. సరోజ వ్రాసినకథ, పాతపత్రికలోనికథ ఒకదగ్గరపెట్టిచూస్తే అదేకథ అవడమేకాక, వాక్యాలు మొదలు అవేపదాలుతో కూడి వున్నాయి. దానిధర్మమా అంటూ పేరు మాత్రం మార్చింది. దానితో నా అనుమానం తీరిపోయింది. పాతపత్రికతోసహా సరోజ దగ్గరకొచ్చి కూర్చున్నాను.

మా సరోజ, నేనూ స్నేహితులమేకాక ఒకరింట్లో ఒకళ్లం అరమరికలు లేకుండా తిరుగుతూవుంటాం. ఆ చనువుచేత "సరోజా! యిది నువ్వు స్వంతంగా వ్రాసిందేనా?" అని అడిగేను.

"అదేమిటి అలాఅడుగుతున్నావ్? నేను వ్రాయకపోతే యింకెవరిచేతనైనా వ్రాయించే ననుకొంటున్నావా?" అంది చిరుకోపం ప్రకటిస్తూ.

"అలా అని నేనన్నానా? అదీకాక నీకు ఈపాటి రచనలు చేసేటంతటి ప్రతిభవుందా" అంటూ, యింక సస్పెన్సులో పెట్టడం యిష్టంలేక పాతపత్రికనుకథ పేజీ తీసి ఆమె చేతిలో పెట్టెను. ఆ పత్రికను చూడగానే సరోజ తెల్లపోయింది.

ఇంక దబాయించడానికి అవకాశంలేక "అవునుసత్యా, నేను యిందులో చూసే వ్రాశాను." అని యింకా నేనేమి అనకుండానే "ఈ కాలంలో కాపీకొట్టడం తప్పుపనికాదులే. నేనొక్కర్తినే యీపని చెయ్యటంలేదుగా? నలుగురితోపాటు నారాయణ" అంది ఆ నేరానికి బాధ్యత అందరిమీద వేస్తూ. "పోనీ అంత కాపీ కొట్టైనా రాయకపోతేనేం?" అన్నాను.

దానికి సరోజ "రచయిత్రిగా పేరు గడించాలని సరదాగా వుంది. స్వంతంగా వ్రాయడం చాతకాలేదు. అదీకాక కష్టపడ నవుసరం లేకుండానే పేరుగడించే సులభమైన మార్గం యెదురుగా కనిపిస్తూవుంటే మానుకోమంటావా?" అంది చిన్న లెక్చరిస్తూ.

సరోజ సమాధానం విన్న నాకు ఆశ్చర్యంతోపాటు విచారం కూడా కలిగింది. సరోజ అభిప్రాయాలులాంటి అభిప్రాయాలు కలవాళ్లు యీప్రపంచంలో యెంతమంది వున్నారో అన్న ఆలోచన కూడా కల్గింది. ఈ మధ్య ఏ పేపరు తీసినప్పటికి తరచుగా చదివినకథలే మళ్ళీ చదవవలసివస్తూంది. చాలామంది పాతకథలే కాపీచేసి పంపిస్తూ, అవి అచ్చయితే నేనూ రచయితనే అని చెప్పుకొంటూ తిరుగుతున్నారనిపించింది.

కథలు వ్రాయాలి, పేరుపొందిన రచయితలుగా అవాలి అనే తృష్ణవుండటం గొప్ప విషయమేకాని స్వంతం అంటూ లేనినాడు ఆ ఆశక్తికి విలువయేముంది? అయితే "కాపీ కొట్టడంకూడా ఒక ఆర్టే. అది మాత్రం అందరికీ చాతనవుతుందా?" అంటుంది పరీక్ష హాలుల్లో అనుభవాన్ని గడించుకొన్న మా కమల. ఆ మాట నిజమే

# ఒరిస్సా మహిళలు



ఒరిస్సా అనగానే పూరీ, భువనేశ్వర క్షేత్రాలు చాలా మందికి జ్ఞాపకం వస్తాయి. ఉత్తర దేశీయులకి "ఒరిస్సా" అంటే వేగరం బోధపడదు. 'జగన్నాథ్ కె వేశ' అంటే తెలుస్తుంది. రామాయణ, మహా భారత, బౌద్ధ గ్రంథములలో ఉత్కళమని, కళింగమని, (ఉత్కళింగమనీఅంటారు) ఓ ప్రదేశమని దీనిని పేర్కొన్నారు. వేదాలలో కూడ ఈ రాష్ట్రం ప్రస్తావన ఉంది. ఈ ప్రాంతంవారు ఆర్యులలో ఒక తెగవారు. వీరిని ఓఢ్రాలు, లేక కళింగులని పూర్వం అంటుండేవారు. క్రమేపి ఒరియా వారనటం మొదలు పెట్టేరు. మొట్టమొదట ఓ ప్రదేశమని పేరుపెట్టిన వారు మహమ్మదీయులు. మహమ్మదీయులు ఒరిస్సాపై దండెత్తినప్పుడు వారిని అతి తీవ్రంగా ప్రతిఘటించి, తరిమివేశారు.

కళింగరాష్ట్రం చాలా ప్రాచీనమైనది. కొందరు చరిత్రకారులు, ఇది ఆరువేల సంవత్సరముల క్రితం వెలసినదని అన్నారు. దీనిని నంగులు, మౌర్యులు పూర్వం పరిపాలిస్తుండేవారు. ఇది పూర్వం స్వతంత్ర రాజ్యంగా వుండేడిది. అశోకుడు దండెత్తినది ఈ దేశము మీదే. ఈ యుద్ధంలో జరిగిన మారణ హోమం చూసిన మీదటనే అశోకుడి మనస్సు పూర్తిగా మారిపోయింది.

పూర్వకాలంలో ఉత్కళ మహిళలు చాలా ఘోషా పాటించేవారట. ఇప్పటికీ మన దేశంలో నాగరికత యెంత పెరిగినా ఒరిస్సా దేశంలోగల కొన్ని ప్రాంతలలో స్త్రీలు ఈ పద్ధతిని పాటిస్తున్నారు. పూర్వం

**విజయలక్ష్మి** (బరంపురం)

ఈ స్త్రీలు సంస్కృతాన్ని చదివేవారట. ఇప్పటికీ ఇక్కడ మెట్రిక్‌కి సంస్కృతము ఒక ముఖ్య పాఠ్యవిషయం మాతృభాష ఒరియాతోసహా, సంస్కృతము కూడా పరీక్ష ఉంటుంది. సంస్కృతము కంపల్సరీ సబ్జక్టుగా ఉన్న యూనివర్సిటీ ఈ ఒక్క ఉత్కళ యూనివర్శిటీయే. ఇక్కడ ఇంకొక విశేష మేమిటంటె, ప్రస్తుతము ఈ రాష్ట్రం కొంచెం వెనకబడి ఉండటంచే, స్త్రీ విద్యను ప్రోత్సహించే నిమిత్తం ఆడ పిల్లలకి ఇక్కడ మెట్రిక్ వరకూ జీతం కట్ట నక్కరలేకుండా సదుపాయం చేశారు. గజెటెడ్ ఆఫీసర్ల పిల్లలకుమాత్రం పుచ్చు కున్నా, అది చాలా స్వల్పం ఇంక, కాలేజీలోకూడ ఆడపిల్లలకి సగం జీతం. యూని వర్సిటీలో ఆడపిల్లలకి ప్రథమ అవకాశం ఇచ్చి ప్రోత్సహిస్తారు. ఇప్పుడిప్పుడు చాలా మంది పెద్ద చదువులు చదివి, ఉద్యోగాలు చేస్తున్నారు. ఒరియా దేశంలో ఇటు పచ్చని పసుపులో మునిగి తేలుతూ, పన్నెలు పారాణితో కలకలలాడే పాదాలు, నొసట రక్తవర్ణపు సింధూరపు బొట్టు, మోచేతి ముసుగువరకూ వేలాడే ముసుగుతో నాలుగు గోడలమధ్య నలిగిన స్త్రీలూ కనబడతారు. అటు ఉత్సాహవంతులు, విద్యావతులు ఐన స్త్రీలూ కనబడతారు. వీరూ ఇతర రాష్ట్రాలలో మహిళలకి ఏమీ తీసిపోరు అన్ని రంగాల్లోను ఇప్పుడు ఉత్సాహంతో రాష్ట్రాభివృద్ధికి ముందడుగు వేస్తున్నారు.

బాల్య వివాహాలు, ఘోషా పద్ధతి ఇంకా పూర్తిగా సమసిపోలేదు. చాలామందికి సాధారణంగా చిన్నప్పుడే పెళ్ళిళ్ళు అయిపోతాయి. ఒరియావారి వేష—భాషలు కొంత వరకు బెంగాలీలను పోలివుంటాయి. వీరూ అయిగుగజాల చీరలే కడతారు. పాపిటలో సింధూరం (వివాహితులైతే) పెట్టుకుంటారు. అయితే చాలామంది రవికలు తొడుగుకోరు. బయటకు వచ్చినప్పుడు మాత్రం వేసుకొని, కుచ్చెళ్ళుపోసి చీర కట్టుకుంటారు. కొందరు ఒంటి పొరతో కుచ్చెళ్ళు లేకుండా చీర కట్టుకుంటారు. దీన్నే మనవాళ్ళు, 'బుడిగుండా' రంటారు. అసలు కుచ్చెళ్ళుపోసి మనలాగ కట్టుకున్నా వీరు కట్టేవిధానం: వేరుగా ఉంటుంది. కాళ్ళ దగ్గిర కుచ్చెళ్ళు అంచు, మనలాగ క్రింది అంచుతో కలియదు, చాలా పైకి వుంటుంది కోసుగా.

బట్టల విషయంలో చాలా పొదుపుగా వుంటారు. వీళ్ళలో కనిపించే మరొక ముఖ్యమైన విశేష మేమిటంటే, స్త్రీ పొద్దున్న లేవగానే స్నానంచేసి తడిపి ఆరవేసిన బట్ట కట్టందీ ఏ ఒరియా గృహిణీ ఏ పనీ చేయదు. ఈ అలవాటు గొప్పఇంటి గృహిణుల దగ్గర నుండీ ఆఖరికి పాచిపనిచేసే పనిమనుష్యుల వరకూ వుంటుంది. అయితే పనిమనుష్యులు పని అయిన తరువాత స్నానంచేసి వంట

కాని పరీక్షల్లో కాపీ కొట్టినందువల్ల అప్పటికి ఫలితాన్నైనా పొందగల్గుతాం కాని రచనల్లో కాపీ చేసినందువల్ల అవగింజంతయినా ఫలితం వుండదు. కాపీకొట్టి వ్రాసినందువల్ల ఆ విషయం తెలియని నలుగురూ రచయిత అని ప్రశంసించవచ్చును కాని, వ్రాసినవాళ్ళకి మనసులో నిజంగా తృప్తి వుంటుందా? అదీకాక చదివిన కథలే చదువుతున్న పాఠకులకీ విసుగు. అసలు రచయిత లేకాని ఆ కథను చదివి సంపాదకులకు తెలియపరుస్తే వారు విచారించి పత్రికాముఖంగా క్షమాపణలు కోరుకోవడం, దాని మూలంగా యీ రచయితపేరు నలుగురి నోళ్ళలోపడి అపహాస్యపాలవటంతప్ప మరొకటి వుండదు. యీ నాడు కాకపోయినా మరొకనాడైనా స్వంతంగా కథ వ్రాసినా ఇదికూడా కాపీయేనేమో అనే అభిప్రాయం — అటు సంపాదకులకు, యిటు పాఠకులకుకూడా కలుగుతుంది. ఆఖరికి గొల్లపిల్లవాడు, పులికథలా తయారవుతుంది. కాపీకొట్టి రచనలు చేసిననాడు అసలు నాకు రచయితని అని నామట్టుకు నేను అనుకొనేందుకైనా అర్హతవుందా?

రచనలు చెయ్యాలనే ఆసక్తి గలవాళ్ళు అందులో కృషిచేస్తే ఫలించకపోదు. "సాధనమున పనులు సమకూరు ధరలోన" అన్నారు వేమన్నగారు. ఏ పనికైన పట్టుదల, దాని కవసరమగు కృషి వున్ననాడు సాధించలేనిది ఏదీ వుండదు. రచనాశక్తికి భాషాజ్ఞానం ముఖ్యం. అది అలవాడాలంటే ప్రముఖ రచయితల గ్రంథాలు విరివిగా చదవడం ముఖ్యం. అటువంటి గ్రంథాలను చదివి అందులోని సారాన్ని గ్రహించిననాడు, లోకంతీరు తెలుసుకొన్ననాడు మనకూ స్వంతభావాలంటూ కల్గి, రచనాశక్తికి దోహదాన్నిస్తాయి. అయితే మాకంత మట్టుకు ఓపిక యెక్కడ. కాపీకొట్టి వ్రాస్తే పని సులభమవటమే కాక మాకోరికా కూడా తీరుతుంది, అని అనుకొంటే మనల్ని మనమే మోసగించుకొంటున్నామన్న మాట.

ఎప్పటివో రచనలను కాపీకొట్టి పంపుతే అవి యిదివరలో అచ్చయినవో కావో తెలుసుకోవడం ప్రతిదినం వందలకొద్దీ రచనలందుకొనే సంపాదకులకు సులభమైన పని కాదు. రచయితలు సహృదయంతో సంపాదకులకు సహకరించిననాడే పత్రిక పాఠకుల మనస్సును రంజింపచేయకల్గి, దిగ్విజయాన్ని పొందకల్గుతుంది. ★

# ★ ఒరిస్సా మహిళలు ★

మొదలుపెడతారు. వీళ్ళలో నిష్టనియమం యెక్కువ శనివారాలు చాలా పట్టుదలతో అన్ని తెగలవారు శుచిగా చేస్తారు

ఒరియావారిలో బ్రాహ్మణులు కూడ చేపలు తింటారు. వారికా నిషేధంలేదు. విధవలుమాత్రం తినరు అఖరికి ఉల్లిపాయ కూడా తినరు. రంగుబట్టలు, అభరణాలు వేసుకోరు, జుత్తుమాత్రం తీయరు ఒరియా మహిళల్లో చాలామంది ముక్కుకి బులాకీ. కమ్మి పెట్టుకుంటారు కొన్ని జాతులలో మహిళలు విసనకర్రలా విచ్చుకున్నట్టుఉన్న పెద్ద కమ్మిలు రెండు వైపులా ముక్కుకి పెట్టుకుంటారు. చెవులకి ఎత్తు గొలుసులు, జూంకాలు, మెళ్ళో, జిగినీ నాను, పట్టెడ మొదలైన పూర్వకాలపు వస్తువులు కూడా ఇప్పటికీ చాలామంది గృహిణులు వేసుకుంటారు. జూంకాలు పొట్టివి పెద్దవారు కూడా పెట్టుకుంటారు. వారికి అక్షేపణ లేదు. అయితే అటు విద్యార్థినులను, ఉద్యోగం చేసే మహిళలను చూస్తే చాలా నిరాడంబరంగా వుంటారు. చాలామందికి జుత్తు బెంగాలీవారి వలె ఒత్తుగా, పెద్దదే ఉంటుంది. ఒక్కజడ ఎక్కడోతప్ప, చాలామంది రెండుజడలు (విద్యార్థినులైతే) వేసుకుంటారు చాలా మంది ముడివేసుకుంటారు రెండు జడలకి రకరకాల ముడులు వేసుకుంటారు.

చాలామందికి చిన్నప్పుడే పెళ్లిళ్ళయిపోతాయి, అని చెప్పేను కదూ. వీరికి కట్నాలు, ఖర్చులూ బాధవుండదు. కట్న మన్నది లేదు. ఏమి ఇవ్వాలన్నా సారె రూపంగా ఇస్తారు. ఎవరి శక్త్యనుసారం వారు అల్లుడికి బహుమతులిస్తారు. గాని దానికి ఖండితంగా పుచ్చుకొనే ఆచారం లేదు. పెళ్లంతటికీ ముఖ్యమైనవి సారె, బంధుభోజనం. ఈ రెండూ చాలా ఘనంగా జరుపుతారు. సారెలో ఆరునెలలవరకూ సరిపడే సరంజామా పట్టుకువెళ్లడం ఆచారమట గాని ఇప్పుడంత పెట్టే సామర్థ్యం చాలా మందికి వుండదు. సారెలో ఏ కొంచెం తక్కువైనా వధువు సారె సరంజామాతో తిరిగి పుట్టింటికే యాత్ర చెయ్యవలసి వచ్చేదట పూర్వం! ఇప్పటికీ అక్కడక్కడ ఇలా జరుగుతుంటుంది కొన్ని జాతులలో ఈ సారెను బాజా బజం[illegible]లతో ఊరేగిస్తారు. పెళ్లిలో వసం[illegible] జల్లుకోవడం ఒక ముఖ్యమైన ఘట్టం. ఇది విధిగా జరుపుతారు. వసంతం, బుక్కా గుండ జల్లుకుంటారు. మంగలి, చాకలి జాతులలో పెళ్లికూతురుకి చెమ్కిగాజులు వేస్తారు వీటిని "శోంబో" అంటారు. వాటిని వధువుకు తొడిగిస్తారు. వివాహ వేదికమీద నవ్వులు వేయించి (ఇద్దరుచేత) హోమం వేస్తారు. బ్రాహ్మణులలోఅయితే- ఒక రకమైన లోహాలు కలసినగాజు నల్లగాను పసుపుగాను వుంటుంది—ఆ గాజుల జత వధువుకు తొడిగిస్తారు. పెళ్లిళ్లలో బంధువులందరూకలసి పెళ్ళి అయిపోగానే నోటితో ఉలాలు పోస్తారు. వినడానికి చాలా గమ్మత్తుగా ఉంటుంది. ఇంక పెళ్లి చూడవలసింది వధువు ముసుగు చాలా క్రిందవరకూ వేలాడుతుంటుంది. ముఖం ఎవ్వరికీ కనిపించదు. పల్లెటూళ్లు అయితే పెళ్ళికూతుర్ని చూడడం ఒక తమాషాలా ఉంటుంది. ఒక ముత్తైదువవచ్చి ముసుగుఎత్తి ఆడవాళ్లకి కొత్త కోడలి ముఖంని చూపిస్తుంది. అప్పుడు వధువు సిగ్గు వర్ణనాతీతం. పెళ్ళిలోనూ, అత్తవారింటికి వెళ్ళినప్పుడూ విధిగా పసుపురాసి కాళ్లకి పారాణి పెడ్తారు. అత్తవారింటికి పల్లకీలో



"సోదడగరమ్మ...సోదో...!"
ఫొటో : ఏలేశ్వరపు నరసింహారావు—బాపట్ల.

కూర్చోబెట్టి సారెతో పంపుతారు. ఈ ఆచారాలు పట్నంలోకూడ కొంతమంది పాటిస్తారు. వివాహితలు తలపై మేలిముసుగు విధిగా వేసుకుంటారు. ఎంత డిగ్రీ ధారులైనా ముసుగు తలపై లేందీ బయటికిరారు దీనిని "ఉబేనా" అంటారు

చాలామంది కుండలలో వండుకుంటారు. ఇంట్లో ఎవరైనా చనిపోతే ఈ కుండలన్నిటినీ చెరువుకు తీసుకువెళ్ళి అక్కడ బ్రద్దలు కొడతారు. శవంతో సహా ఆడవాళ్లుకూడా స్మశానానికివెళ్లి స్నానంచేసి వస్తారు మొగవాళ్లకి (బంధువులకి) పన్నెండవరోజున క్రొత్తబట్టలిస్తారు.

వంటవిషయంలోఒరియా గృహిణి చాలా పొదుపుగా వుంటుంది కూరలన్నీ కలిపి ఒక కూరగా జేస్తారు. దీన్ని 'గొంట' అంటారు. వీరు కూరల్లో ఎక్కువగా సోపు, పసుపు, బెల్లం వాడుతారు. పచ్చళ్లలో కూడా పసుపు వేసుకుంటారు అటుకులు, పేలాలు, మురీలు లేని ఇల్లంటూ కనబడగు. ఇవిచాలామంది టిఫిన్‌క్రింద వాడుకుంటారు. ధనుర్మాసంలో పేలాలతో, పంచదారతో ధనుర్మా ఉండలవి అమ్ముతారు. ఇవి, పంపర పనాస పళ్లంతవి ఉండే చాలా రుచిగా ఉంటాయి. వీటిని స్నేహితులకి, బంధువులకి, కోవిళ్లకి పంపిస్తారు—క్రిస్‌మస్‌లో కేకులు బహూకరించినట్టు ఇలా ఒరిస్సాలో తప్ప మరెక్కడా చేయారు ఇది ఒక్క ధనుర్మాసంలో తప్ప, సంవత్సరంలో మరెప్పుడూ చేయరు

ఒరియా వారికి కుట్లు, అల్లికలూ అంటే చాలా శ్రద్ధ కుట్లు రానివారంటూ కనిపించరు. కొంతమంది బొంతలుకుట్టి అమ్ముతారు కుట్లకి, ముగ్గులకి చాలా శ్రద్ధ చూపుతారు దసరాముందు వచ్చే పొలాల అమావాస్య, దసరా తరుశాత వచ్చే పౌర్ణమి, వీరికి ముఖ్యమైన పండుగలు ఈ పౌర్ణమిని వీరు కుమార పౌర్ణమంటారు. మనకి సంక్రాంతి ఎలాగో వీరికి ఈ పౌర్ణమి అంత ముఖ్యం దీన్ని వీరు 'కుమార పౌర్ణమి' అంటారు. ఈ పౌర్ణమికి అల్లుళ్లని కూతుళ్లని పిల్చి క్రొత్త బట్టలు, కానుకలు ఇస్తారు.

వీరిలో ఎక్కువమంది తెలుపే. నలుపు వారు తక్కువగా కనిపిస్తారు.

కార్తీక పౌర్ణమి, మార్గశిర లక్ష్మివారాలు, చాలా పట్టుదలతోను, నిష్టతోను చేస్తారు. మార్గశిర లక్ష్మివారంనాడు ఎర్రమన్నుతో ఇంటిముంగు అలికి సున్నంతో రక, రకాల ముగ్గులుతో అలంకరిస్తారు. ఎవరింట్లో చూచినా ముచ్చటైన ముగులు కనబడతాయి. శివరాత్రి వినాయకచవితి, దీపావళీ, జంధ్యాలపౌర్ణమి, దసరా, గ్రహణాలు, చాలా పట్టుదలతో చేస్తారు. ముఖ్యంగా గ్రహణం రోజంతా వుపవాసం వుంటారు. ఒక్క పండుగలేకాక, పితృకార్యాలు కూడా చాలా నిష్టతో చేస్తారు. మహాళయపక్షాలు, తద్దినాలు వచ్చినప్పుడు ఇళ్ళకి వెల్ల వెయించీ మరీచేస్తారు. మనలా జాదాల పౌర్ణమికి పేకాట, ఎలా విధిగా ఆడతారో వీళ్లలో కుమార పౌర్ణమికి అలా ఆడతారు. వీరు అమ్మవారిని, జగన్నాథస్వామిని, ఈశ్వరుని ఎక్కువగా పూజిస్తారు అమ్మవారికి చాలా ఘనంగా వుత్సవాలు చేస్తారు. వీళ్లల్లో స్నేహకాంక్ష, మెండు. నేస్తాలు కట్టుకునే పద్ధతి ఇప్పటికీ వుంది. వీరిలో సంగీత నాట్యకళలు కళలు కాస్త వెనకబడిన వననొచ్చు. ఇప్పుడిప్పుడు స్కూళ్లల్లో సంగీతం క్లాసులు పెట్టారు. ఏమైనా ఇప్పుడిప్పుడు ఒరిస్సా మహిళలు అన్నిరంగాల్లో కృషి చేస్తున్నారు.



"సిపాయివేషంలో పాపాయి"

ఫొటో: శ్రీమని-కాకినాడ.

# ★ వంటలు ★

## గనుసుగడ్డలతో పిండి వంటలు

ఈ మధ్య ఆంధ్రపత్రికలో జి. లీలావతి గారు గనుసుగడ్డతో వంటలగురించి రాసినవి చదివాను. ఆ మె అన్నీ అన్నముకు ఆధరవులే చెప్పినారు. చిలకడ దుంపలతో చేసే కొన్ని పిండివంటలు నాకు తెలిసినవి చెప్తున్నాను. నేను చెప్పే పిండివంటలకు ముందుగా ఈ దుంపలు నీటతో వుడకపెట్టి తొక్క తీసి వేయవలెను.

### గులాబీజామ్

పెద సైజువి రెండు గనుసుగడ్డలు, పంచదార ½ వీశె నెయ్యి, లేక డాల్డా ¼ వీశె చిటకెడు సోడా, మైదా తాజాది ⅛

దుంపలు మెత్తగా వుడికిన తరువాత తొక్క తీసి మెత్తగా ముక్కలులేకుండా చేతిలో కలపవలెను. తరువాత మైదా వేసి పూరీల పిండిలా కలపాలి. నీళ్లు పోయరాదు. సోడాకూడా వేసి బాగా మర్దించాలి. తరువాత మనకు కావలసినమాదిరిగా కోలగా కాని, గుండ్రముగాకాని వుండలు చేయాలి. పంచదారతో కొద్దిగా నీళ్ళుపోసి లేతపాకము పట్టాలి. ఆపాకాన్ని వెడల్పాటి బేసన్‌లో పోయాలి. తరువాత బాండీలో నెయ్యిపోసి కుంపటిమీదపెట్టి మరగనివ్వాలి. తరువాత ముందుగాచేసి వుంచుకొన్న వుండలు తీసి నేతిలోవేసి సన్నవి సెగని ఎర్రగా వేగనిచ్చి చిల్లులుగరిటతోతీసి పాకంలోవేయాలి మళ్ళీ వాయ వేగేదాక గులాబీజాములు పాకంలోనేవుంచి తరువాత తీసి వేరే పళ్లెంలో పెట్టుకోవలెను. అన్నీ చేయడము అయ్యాక మళ్ళీ అన్నీ పాకంవేస బేసన్‌లోనే వుంచాలి. మనము సర్వ్ చేసేటప్పుడు గులాబీజామ్‌తో పాటు ప్లేటులో రెండు స్పూనుల పాకముకూడా వెయ్యాలి. దీనికి నూని వాడరాదు. నెయ్యి అయితేనే బావుంటుంది.

### పోళీలు

దీనికి తూనికప్రకారము వాడవలెను. తీపి తినలేనివారు పంచదార తగ్గించవచ్చును.

కావలసిన, పంచదార, మైదా, ఏలకులు కొద్దిగా నూని.

దుంపలు ఎన్ని అవుతే అంతా సరికి సరిగా పంచదార, మైదా పడుంది. మైదా మెత్తగా జల్లెడపట్టి 1-2 వుప్పురాళ్లు నీళ్లలో వేస, ఆనీళ్లు పోసి పిండికలపాలి. పూరీపిండి కంటె కొద్దిగా నూనివేసి 5 నిమిషములు నాననివ్వాలి. తరువాత వుడికిన దుంపలు తొక్కతీసి పంచదార ఏలకుపొడి వేసి మెత్తగా చిదపాలి. దుంపలు చిముడకుండా వుడికించాలి. లేకపోతే పంచదార వెయ్యగానే పాకంలా అవుతుంది. కనుక కొంచెము బిరుసుపగునుగానే వుడికించాలి. దుంపలు మెత్తగా ముక్కలు లేకుండా చిదపాలి. ఆలా చిదచిదపలేనివారు రోట్లోవేసి రుబ్బాలి. రుబ్బెటప్పుడే పంచదార ఏలకులు వయ్యాలి. తరువాత ఆ ముద్దని పెద్దనిమ్మకాయంత వుండలు చేసుకోవాలి. కుంపటమీద పెనము కాలిం తరువాత నానిన మైదాని వుసిరికాయంత వుండని చేతికి నూనె రాసుకొని చేతిలో బిళ్ళమాదిరిగా పరచి అందులో పూర్ణంముద్ద పెట్టి దానిని మైదాతో కప్పాలి. తరవాత అరటి ఆకుని నూనిబాగారాసి ఈ కప్పినముద్ద చేతితో ఆకుమీద పోళీ వత్తాలి. పెనముకాలిన తరువాత వంకాయలేక అరటికాయ ముచిక తీసుకుని దానితో నూనె పెనానికిరాసి. ఈ ఆకుమీద వత్తిన పోళీ మెల్లిగా పెనంమీదకు జార్చాలి. కాలిం తరువాత తిరగవేసి తీసివెయ్యాలి ఇవి నిలవ ఉండవు. ఏ రోజు కారోజే తినెయ్యాలి వీటికి బెల్లంకూడా వాడవచ్చుకాని పంచదార అంత రుచివుండవు.

### బూరెలు

పోళీపూర్ణం మాదిరిగానే తయారుచేసి, దానిని పెద్దనిమ్మకాయంత వుండలు చేసుకొని రెండు వంతులు బియ్యప్పిండి ఒకవంతు మైదా. లేక మినప్పిండి. కొద్దిగా ఉప్పు వేస జజ్జీల పిండిలాగ పల్చగా కలిపి నూనె ఎసరుపెట్టి వుండలుచేసిన పూర్ణాన్ని ఈ తోపుపిండిలోముంచి నూనెలో ఎఱ్ఱగా వేయించి తీసుకోవలెను. ఇవికూడా ఒకరోజే వుంటాయి. నిల్వవుండవు.

### కజ్జికాయలు

దీనికి ముందుగా దుంపలు వుడికించనక్కరలేదు. కావలసిన సామానులు. మైదా ½ వీ., పంచదార 1/4 వీ., దుంపలు ½ వీ., ఏలకులు నెయ్యి, లేక డాల్డా 1/4 వీ. జీడిపప్పు 4 తులములు.

ముందుగా దుంపలు శుభ్రంగా కడిగి ఎండుకొబ్బరి కోరాముతో సన్నగా తురమాలి కుంపటిమీద స్టీలుగిన్నె కాలవేసి రెండు గరిటెల నెయ్యివేసి, జీడిపప్పు వేయించి వేరే వుంచుకోవాలి. తరువాత కోరిన కోరును ఆ గిన్నెలోవేసి కలిపి మూతపెట్టి రెండు నిమిషాలు వుంచాలి. కొంచెము మగ్గిన తరువాత చక్కెర ఏలకుపొడి జీడిపప్పు కొద్దిగా నెయ్యి వేసి గరిటెతో కలుపుతూ వుండాలి. కొంచెము సేపటికి ముద్దలా అవుతుంది. చేతికి అంటుకోకుండావుంటే గిన్నెకిందకు దించెయ్యవచ్చును. తరువాత పూరీపిండిలాగ మైదా కలిపి పూరీలమల్లె పీటమీద అప్పడాలకఱ్ఱతో వత్తి ఆ వత్తిన పూరీని కజ్జికాయలబల్ల అని వేరే వుంటుంది. దానిలోవేసి రెండు స్పూనుల లస్కోరా ముద్దనిపెట్టి ఆ బల్లని మధ్యకుమడచి, మళ్ళీ తెరిస్తే పూరీమధ్యకు మడచుకొని కజ్జికాయ వస్తుంది. అలా అన్నీ తయారుగచేసి పెట్టుకోవాలి. బాండీలో నెయ్యివేసి మరిగాక, కజ్జికాయలు కొన్ని కొన్ని చొప్పున దోరగా వేయించి వేరే తీసుకోవాలి. ఇవి రెండు, మూడు రోజులు నిల్వవుంటాయి.

అయ్యగారి సుభద్ర,
(నర్సీపట్నం)

## పూసల సంచి

కావలసిన వస్తువులు: పూసల చెరులు-12 (తెలుపు, నలుపు), నిట్టింగ్ పుల్లలు 1 జత. 1 నెంబరు యాంకర్ (లంగరు) మార్కు దారపుఉండ 1. లైనింగ్‌కి బట్ట ⅛ గజము. దూది. ½ ఔన్సు. హేండిల్‌కి తాడు.

దీని ప్రారంభము — మనము ఏదారముతో సంచి అల్లెదమో దానికే పూసలన్నీ ఎక్కించవలెను. మొదట నలుపు 4 పూసలు, తెలుపు 4 పూసలు, మరల నలుపు, మరల తెలుపు. ఈవిధముగా 44 పూసలు ఎక్కించవలెను. ఇలాగ నలభై నాలుగేసి చొప్పున 4 వరుసలు ఎక్కించవలెను. 4 × 44=176 పూసలు అవుతె యన్నమాట. దానితరువాత ఒక కాగితపు ముక్కను గుచ్చవలెను. ఆనవాలుకోసము. దానితరువాత మరల మరియొక లైనుకు తెలుపుపూసలు మొదలు పెట్టవలెను. 4 తెలుపు, 4 నలుపు, 4 తెలుపు, 4 నలుపు చొప్పున 44 పూసలు ఎక్కించవలెను. మరల తెలుపు పూసలు 4 తో మొదలుపెట్టవలెను. ఈవిధముగా తెలుపు పూసలతో 4 సార్లు మొదలు పెట్టవలెను. ఈవిధముగా మరల 4 నలుపు, 4 తెలుపు చొప్పున 4 × 44=176 పూసలు ఎక్కించవలెను ఈ విధము నలుపుపూసలు మొదలు పెట్టుచు. 4 × 44=176 పూసలు తెలుపు పూసలతో మొదలుపెట్టుచు 4 × 44=176 పూసలు రావాలి. ఈప్రకారంగా ఒకదాని తరువాత ఒకటిగా 56 వరుసలు గుచ్చవలెను. 56 × 44=2856 పూసలు మొత్తం



విజయనగరంలో విజయా మహిళామండలి వార్షికోత్సవం జరిగిన సందర్భంలో బహుమతులు పంచిన శ్రీమతి మేరీఫిల్ఫోర్డ్, మండలి అధ్యక్షురాలు శ్రీమతి నెదురుమూడి రుక్మిణమ్మ, సభాధ్యక్షురాలు శ్రీమతి దిగుమర్తి సరస్వతీదేవి, మండలి కార్యదర్శిని శ్రీమతి లక్ష్మీరఘురామ్

# "వృష్" మెల్లిగా!...గోడలకు చెవులుంటాయ్!

ప్రపంచంలో చాలామందికి రెండు చెడ్డ అలవాట్లున్నాయి. మొదటిది అది ఎంత పనికిరాని విషయమైనా కానీ చిలవలు, పలవలు చేర్చి ఇరుగమ్మ పొరుగమ్మల్తో చెప్పకోంది నిద్రపట్టకపోవడం. అది గట్టిగా మామూలుగా మాట్లాడుకున్నట్లు చెప్పకుంటే పోతుంది. (అలా చెబితే అందులో ప్రత్యేకత ఏం వుంటుంది!?) అదేదో రహస్యం చెబుతున్నట్టు చెవిదగ్గరకెళ్ళి గుసగుసలు!

దీని పర్యవసానమే రెండవ అలవాటు: ఆ గుసగుసలాడే ఆవిడ ఏం చెబుతోందో, వాళ్ళేం మాట్లాడుకుంటున్నారో అనీ, మన్నిగురించే అయివుంటుందనీ, లేకుంటే ఏదన్నా కానీ విందామనీ తలుపులచాటునా, తడికలమాటునా దాగి మూడోవాళ్లు చెవులు రిక్కించివినటం.

నిజానికి యీ దాగివుండి వినటం అన్నంత తప్పపని మరేదీ వుండదు. ఒకరి వుత్తరాలు చదవకూడదని ఎల్లా గనుకుంటామో అలాగే ఒకరి మాటలనుకూడా వినరాదు

ఈ విధంగా దాక్కొని వినటంవల్ల చాలా నష్టాలున్నాయి. చూడండీ, ఒక్కొక్కప్పుడు వాళ్ళు మనమీద ఏవన్నా

**జంధ్యాల సరోజ, కర్నూలు**

నిందలు మోపి మాట్లాడుకుంటూ వుండవచ్చు. అపుడీ వింటున్నవాళ్ళకు ఎలాగుంటుంది? ఎంలిబాధ పడాలి దాంతో మనసుచెడి మాటలు బంద్ కావటమో, లేక మాటలు ముంచుకోవటమో జరుగుతుంది.

ఇంకోరకం వాళ్ళున్నారు, మొదటిరకం వాళ్ళలోనే వీళ్ళేంచేస్తారంటే తమకు ఏవరిమీదైతే కసివుంటుందో వాళ్ళు వినాలనే, వాళ్ళు చూచేట్టుగా వినీవినిపించకుండా సంభాషణ సాగిస్తారు. ఆమె రావటం చూచి వస్తానమ్మా అంటూ ఒకామె వెళ్ళిపోతుంది. ఇక యీ రెండో ఆమెకూ, ఆ వచ్చినామెకు పడుతుంది కుస్తీ. ఈ రెండోమనిషి తెలివిగలదే గనక అయితే మొదటిఆమె నీమీద యిలా చెప్పిందంటూ తప్పుకుని జుట్టుకు జుట్టు ముడేస్తుంది.

## లలితకళ!

తెలివిగల ఘటాలు తాము ఎవరివల్లనైనా లాభం పొందాలనుకుంటే వాళ్ళు తాము మాట్లాడేది వింటున్నారూ అని తెలియనట్టు నటిస్తూ వాళ్ళను గురించి పొగుడుకుంటూ, ఆకాశాని కెత్తేస్తూ మాట్లాడేస్తారు. వీళ్ళ మాటలు విని వాళ్ళు వుబ్బిపోయి చల్లగా కరిగిపోతారు. ఆ తర్వాత . ఇక అంతే.

చిన్నపుడు చదువుకునేరోజుల్లో మా పిన్ని కూతురు భాగ్యలక్ష్మి కూడా మాతో పాటే చదువుకొనేది. మా పిన్ని వుండేది పల్లెటూరు. ఒకసారి ఆమె మా వూరికొచ్చింది. మే ముండేది ఒక పెద్దయింట్లోని ఒక వాటాలో. ఆ యింట్లో ఇంకా రెండు కుటుంబాలుండేవి. మనిషెత్తుకుపైన ఓ మూరెడు పొడవువరకూ గోడలు కట్టేసి (అరలు అన్నమాట) అద్దెలకిచ్చారు. ఇక మాడండి తమాషా కాస్త గట్టిగా మాట్లాడుకున్నామంటే అవతలింట్లవాళ్ళకి వినిపించాల్సిందే.

## మాలక్ష్మి, మీలక్ష్మి

పిన్ని వచ్చాక రెండురోజులు కులాసాగా గడిచిపోయ్యాయి. మూడో రోజు సాయంత్రం స్కూలునుంచి వచ్చి చూద్దాంకదా పిన్ని ధుమధుమలాడిపోతూ వుందెందుకో. కూతుర్ని చూట్టంతోనే పట్టి నాలుగు బాదింది. అమ్మా, అన్నయ్యా అడ్డునెళ్ళి "ఏమిటట సంగతి ఎందుకలా కొడతావ్"

---

వచ్చును. ఈవిధముగా గ్రుచ్చవలెను. మొదట నిట్టింగ్ పుల్లతో, పూసలు గ్రుచ్చిన దారముతోనే 50 రింగులు వేయవలెను. 3 లైనులు ఊరికే నిట్ అల్లవలెను. దాతరువాత ఒక్కొక్క రింగునకు ఒక్కొక్క పూస చొప్పున అల్లవలెను. అల్లినప్పుడు మొదట మూడు రింగులకు పూసలు లేకుండా అల్లవలెను. తరువాత 44 రింగులకు 44 పూసలు అల్లి చివరకు మిగిలిన 3 రింగులు నిట్ అల్లవలెను. రాంగ్ సైడున (లోపలివేపు) పూస లెక్కించి అల్లకూడదు. నిట్ మాత్రమే అల్లవలెను. ఈవిధముగా ఎక్కించిన పూసలన్నీ అల్లవలెను అల్లినతరువాత ముగించినప్పుడు రింగులు చాల జాగ్రత్తగా ముగించవలెను. ఊలు సంచీలకు వేసినట్లే లోపల దూదిపెట్టి బట్టతో దానికి లైనింగ్ వేసి కుట్టవలెను. హేండిల్సు తాడు మనయిష్టము వచ్చిన రకాలు వేసుకోవచ్చును.

వి. కళ్యాణి (పోరంకి, క్రిష్ణాజిల్లా.)

# ★ సమాధానం దొరకని ప్రశ్న ★

(47-వ పేజీ తరువాయి)

తండ్రికి కళ్ళుమండి తన్నాడు. ఆపిల్లాడు ఇంట్లో యేదయినా వండినా, బజారునుండి తెప్పించినా అంతా తనకే కావాలని మొండికి వేసేవాడు. బడికి పొమ్మంటే క్రిందబడి దొర్లేవాడు. ఈవిధంగా చిన్నతనంలో అతి గారాబంవల్ల అర్థంలేని మొండితనం పట్టుదల ఎక్కువయి ఎందుకూ పనికిరాని యేదుపుముఖంలా తయారయాడు. తండ్రికి కోపం రెచ్చిపోయింది. చిన్నగా, నెమ్మదిగా చెప్పే సహనశక్తి నశించిపోయింది. తల్లికి యేమి చేయటానికి తోచేది కాదు-అసలు దీనికంతటికీ కారకురాలు ఎవరు?

అతివృష్టి- అనావృష్టి' ఆభార్యాభర్తలు తమ పిల్లవాడిని ఒక్కక్షణం 'ఫ్రీ'గా వుండనిచ్చేవారు కాదు, వయస్సుకిమించిన చదువు. అస్తమానం చదవమనేవారు ఆకుర్రవాడిని. వాళ్ళు చెప్పినట్టే చదివి మంచిపేరు ప్రతిష్టలు సంపాదించాడు పుత్రరత్నం కాని అతని మెదడుకి విశ్రాంతిలేక చివరికి పిచ్చియెక్కి పారిపోయాడు. చేతికందినవాడు కొఱగాకుండా పోయాడే కాని వాళ్ళతప్పును గుర్తించుకోలేకపోయారు.

కొందరు 'బడి చాలదూరం-మాపిల్లలు పోలేరు. అయినా యిప్పుడేం ఘరవాలేదు. ఎందుకండీ! బడి! చెడ్డపిల్లలతో చేరి మా పిల్లలు చెడిపోరూ' అంటారు అక్కడికి తమపిల్లలు ఎంతో మంచివారయినట్లు. మరొకరకం వాళ్ళున్నారు. అసలు వాళ్లు బడికి పంపరు-ఇంట్లో చెప్పరు. ఎందువల్ల అంటే 'వాళ్ళు మొగ్గులు వాళ్ళకిరాదు. వాళ్లకు చదువుచెప్పటం దండగ' అని ముందరే వాళ్లను నిరుత్సాహపరచి నిజంగానే మొద్దల్ని చేస్తారు.

అతడు చిన్నతనంలోనే తల్లీతండ్రిని కోల్పోయిన నిర్భాగ్యుడు. అతనికి అన్న వదిన వున్నారు. కాని వాళ్ళు పట్టుమని పది సంవత్సరాలు నిండని ఆ కుర్రవాడిచేత గాడిదచాకిరి చేయించేవాళ్ళు. బజారువెళ్ళి సరుకులు తేవటం మొదలు నీళ్లు తోడటం వరకు ఆ అబ్బాయిపనే. 20 సంవత్సరాలు వచ్చాయి. హృదయంవుండీ, లేని వదిన గారు 'ఎంతకాలమని తింటూ కూర్చుంటావోయ్ ఎవరు సంపాదిస్తారు?' అంటూ అన్నంపెట్టేది. సంపాదించమని సలహా యిచ్చిందికాని అక్షరజ్ఞానంలేని తన మరిదికి ఉద్యోగం ఎలా వస్తుందని యోచించలేకపోయింది. చివరికి వదినగారి సూటిపోటీ మాటలు భరించలేక అతను యేమయి యెవరికి కావాలి-ఇప్పుడతని జీవితపతనానికి కారకురాలెవరు?

వీరందరూ కాక మరొకరకం వారున్నారు. అసలు పిల్లలను పెంచవలసిన బాధ్యత తమకు లేనట్లుంటారు. ఎవరూ యే మనరు కదా అని ఆ పిల్లలు చెడ తిరుగుతారు. కాని అంతవరకు వూరుకున్నవాళ్ళు యేదో వుద్ధరించినట్లు ఆ పిల్లలకు పెండ్లి చేస్తారు 'తాదూర దారిలేదు - మెడకో డోలు' అన్నట్లుగా ఉద్యోగంలేదు (అసలు చదువుకుం), తనకాలుమీద తాను నిలబడలేరు—అలాంటి వారికి పెళ్ళి, పిల్లలూను! ఇక వీళ్ళు ఆ భార్యను నానా తిప్పలుపెట్టి నట్టేట్లో ముంచినంత పని చేస్తారు—నిజానికి తమ బాధ్యతను సద్వినియోగం చేయటం తెలియదేమో కొందరు పెద్దలకి. పెళ్లి అయిననాటినుంచి కొందరు "నిన్నూ నీ పెళ్లాన్ని ఎన్నాళ్లు మేపమంటావు' అని సాధిస్తారు

కొంతమంది చిన్నతనంలో అతి గారాబంగా పెంచి తెగపెడుతుంటారు. కాని వాళ్ళు పెండ్లి సమయానికి రోలింగ్ బండల్లాగ తయారయి కూర్చుంటారు. పైగా గారాబంవల్ల చదువురాదు— వంట రాదు. ఇక యిలాంటి పిల్లల్ని చేసుకోటానికి చాలమంది సాహసించరు. 'అయ్యో! పెండ్లి కాలేదే' అని తమ కూతుర్ని చూసి విలపిస్తారు కొంతమంది. ఆ అమ్మాయినే తిట్టి, ఛీదరించుకుంటారు మరికొందరు కాని ఆ అమ్మాయి పరిస్థితి అలా తయారవటకు కారణమేమిటో యెవరు యోచిస్తారు ?

పైన వ్రాసిన సంగతులు అందరికీ తెల్సిన విషయాలే! మరి తమ పిల్లలు ఎందుకు చెడిపోతున్నారు? అదే తమాషా! అదేమంటే అంతా వాళ్ళ 'ఖర్మ' అంటారు. మన చేతులారా చేసి రాతమీద రుద్దుకుంటూ 'కర్మ' అంటున్నాము అంతేగా! అయితే మరి పిల్లలు పాడయిపోయారని దుఃఖించటం దేనికి ? ✿

# గోడలకు చెవులు

అనసుగతే పిన్ని చెప్పిన కారణం ఆరోజు మాపిన్ని అవతలి వాటాలవాళ్ళు మాట్లాడుకుంటూ వుంటే ఒక చెవిని గోడకానించేసి దానిద్వారా సంగ్రహించిన సారాంశం యిది.. అక్కడినుంచి "ఏమిటమ్మా లక్ష్మి మరీనూ బొత్తిగా భయం భక్తీ అనేవి లేకుండాపొయ్యాయ్. పెద్దవాళ్ల మాటరవంతేనా వినిపించుకోదే. అలా తిరగొద్దే, మంచిదికాదు అని చెబుతే వింటేనా, ఎవరు చెప్పబోయినా అలా మీదకొచ్చేస్తుంటేనూ మరీ ఏవిటోనమ్మా.. " అంటూ ఓ ముసలి గొంతుక అంది. ఆ తరువాత—

"ఏమోలేత్తా మనకెందుకు. చెబుతే వింటే వాళ్లకే మంచిది, లేకుంటే వాళ్లే చెడిపోతారు. ఇంతకీ చిన్నప్పుడు వాళ్లఅమ్మ మంచిగా, వినయం, భక్తి నేర్పివుంటేనా! వస్తా" అంటూ ఇంకో గొంతు.

ఇది మా పిన్ని తనకూతుర్ని బాదటానికి గలకారణం. పక్కింటివాళ్లు ఇట్లా అనుకుంటున్నారు. మా యింట్లో విడిచాననేకదా, ఇట్లా తయారుచేసి అందర్తోనూ అనిపిస్తున్నారు. అంటూ పై స్థాయిలో కెళ్ళింది కాస్త.

మాకంతా ఆశ్చర్యమేసింది. లక్ష్మి చాలా మెతకపిల్ల. యెక్కడికీ తిరిగేది కాదు. స్కూలు విడిచాక మేమంతా ఆడుకోటానికి పోతే తను చక్కగా ఇంటికొచ్చేది. ఇంట్లో పనంతా చేసేది పాపం! అలాంటి లక్ష్మిని ఇట్లా ఎందుకనుకున్నారబ్బా అని. ఆమెనే అడిగి చూదాం అనుకుని అడిగితే ఆ ముసలామె "అయ్యో తల్లీ మీ లక్ష్మి సంగతి కాదమ్మా మా కోడలుందే ఆ లక్ష్మి విషయం మేం మాట్లాడుకొంది. చూడమ్మా బాలెంతరాలుకదా అప్పుడే అన్ని పనులకూ నీవు తిరగొద్దే అంటే వినేదికాదు. ఆ సంగతే నేను కామాక్షమ్మతో చెబుతూ వుంటే విని లక్ష్మిని తన్నిందేమో పాపం! అన్యాయంగా మీ లక్ష్మికి దెబ్బలుపడ్డాయే"అంది.

దీనితో మా పిన్నితోసహా మా అందరి సందేహాలూ వీడిపొయ్యాయి అయితే పిన్నికి దాక్కొని వినే గుణం వుందని నలుగురికీ తెలిసిపోయింది. పైగా ఆలోచించకుండా మా అమ్మనూ, అన్నయ్యనూ అన్ని మాటలంది. చాటుగా వుండి వినటంవల్ల వచ్చిన అనర్థంకాదూ ఇది? ఈనాడు మా పిన్నే ఈ మాట నలుగురికీ చెప్పి నవ్వుతూ ఉంటుంది.

మొత్తానికి అలవాటు చెడ్డది. గూఢచారులకూ, రహస్యాలు ఆరాతీసే డిటెక్టివులకైతే చెల్లుతుందికానీ, మనకెంత మాత్రం తగదు: కాస్త కాస్త వినటం, తర్వాత బాధపడటం ఎందుకొచ్చిన బాధ.

హాయిగా అవతలివాళ్లు ఏం మాట్లాడుకోని మనకెందుకు అని గప్‌చుప్‌గా వుండటం నేర్చుకుంటే ప్రాణానికి హాయీ, మనస్సుకు శాంతీ ఉంటాయ్!

కొందరికి (అందరికీ కాదుసుమా) ఈ జబ్బు విపరీతంగా ఉంటుంది. అసలు ఒకరిమీద ఒకరు మాట్లాడుకోవటం తగ్గితేకానీ ఈ "వుఫ్‌గోడలకు చెవులుంటాయ్" అనే మాట మాయంకాదు. ★

# వనితా వాణి



"గృహిణిగా తమ అనుభవాలు తెలుపుతూ బి. ఎస్. లక్ష్మిగారు వ్రాసిన వ్యాసము చాలా బాగుంది. అది చదువుతుంటే మా చిన్నతనాన జరిగిన అనుభవాలు జ్ఞాపకానికి వచ్చాయి ఆమెకి నా ధన్యవాదాలు.

పి. రామలక్ష్మి (అత్రేయపురం)

* * *

శ్రీమతి సి. రాధారాణిగారు "ప్రచారం చేసేవారికి నమ్మకం ఉందా?" అని వ్రాసిన వ్యాసం నాకెంతో సబబుగా నేకనిపించింది. ఎందుకనగా మనకు శరీర శాస్త్రముగురించి ఎన్నియో విషయాలు తెలియవు కనుక డాక్టర్లు ఏది చెప్పినా నమ్మవలసి వస్తుంది. అందుకొరకు డాక్టరు కుటుంబనియంత్రం పైసలహాఇచ్చే ఉద్యోగబాధ్యతలు యుతంగాను, సంపూర్ణంగాను ఈ విషయంసాధక బాధకాలను పరిశీలించి తమకు తాము నచ్చచెప్పుకొని, మనకూ ఓపికగా చెప్పాలి. ఇలా వివరంగా ఎంత వరకైతే సరియైన సమాచారం యివ్వరో అంతవరకు ప్రజలు కుటుంబనియంత్రణకు సంబంధించిన శస్త్ర చికిత్సకు సాహసించడం కల్ల.

రాధారాణిగారు అన్నట్లు ప్రభుత్వం యిటువంటి అత్యవసరమైన సేవను మరింత సమర్థతతో అమలులో పెడుతుందని నేను నమ్ముచున్నాను.

రాయుంచ సుగుణ. (జగిత్యాల)

* * *

"కుటుంబ నియంత్రణ" సమస్య మీద వ్యాసములు చదివితిని చాలా బాగున్నవి. ఈ సమస్య యిప్పటి దేశపరిస్థితులబట్టి ఐక్య రాజ్య సమితిలో ఎత్తుకోవటం (ఆ ప్రశ్న రావటం) చాలా ప్రశంసనీయం. వ్యాస రచయిత్రులకు వనితావాణిద్వారా అభినందనలు.

ఏ. శాంతకుమారి. (కాకినాడ)

* * *

నేను ఈమధ్యనే ఆంధ్రపత్రికలో పద్మ "ఒక్కగానొక్కపిల్ల" వ్యాసం చదివాను. ఆ తర్వాత వారంలో ననుకుంటా హైదరాబాదు సోదరి వ్రాసిన విమర్శకూడ చదివాను. ఆవిడ విమర్శ నాకు నచ్చలేదు బహుశా ఆవిడకూడ ఒక్కగా నొక్కపిల్లే కావచ్చు మంచిగుణాలే ఉండవచ్చు వాళ్ల బంధువులమ్మాయికూడ అలాగే ఉండవచ్చు. అంత మాత్రంచేత అందమూ అలాగే ఉంటారా? ఏదో సినిమాలో చూసి రచయిత్రి అలా వ్రాసిందని అనుకోవటం పొరబాటు పోనీ సినిమాలో చూసే వ్రాసిందనుకుందాం! ఏం? సినిమాలో మాత్రం సంఘంలో జరిగేవే కొంచం మార్చి చూపస్తున్నారుగా!

లక్ష్మి (హైదరాబాద్)

* * *

## సమాధానం

4 2-59 వారపత్రికలో నేను చెప్పిన "గెనుసుగడ్డలతో నిమ్మరసం పప్పు" వండడం గురించి బి. గుగ్గగారు వ్రాసిన సందేహం చూశాను మామూలుగా నిమ్మరసంతో చారుపెట్టుకుంటే నేతిపోపే వేస్తారు. ఇది అందరికీ తెలిసిన విషయమే. అలా కాకుండా నూనెపోపు వేసే పక్షంలో, అప్పటికప్పుడు వేడిమీద బాగున్నా, చల్లారిన తరువాత తప్పకుండా చిరుచేదుకు విరుగుతాయి ఇది నా అనుభవం మీద వ్రాస్తున్నా. అలాగే నిమ్మరసంతో పులిహోర కలుపుతే, నేతి పోపే వేయాలి తప్పకుండ. అలా కాకుండ నూనె పోపు వేసే పక్షంలో - (1) నిమ్మరసం రుచిని కొడగొడుతుంది నూనె (2) నూనె ఎక్కువగా పడుతుంది కనుక చల్లారిన తరువాత చిరుచేదు కెక్కుతుంది సాధారణంగా తీపి పిండివంటలకు "నెయ్యి" తప్పితే "డాల్డా" వాడుతారు గాని "నూనె" అరుదు. అలాగని తీపి పిండివంటలన్నిటికీ నెయ్యే వాడుతారని గాని నా అభిప్రాయం. నెయ్యికి బదులు నూనె వాడే వాండ్లు వున్నారు. అయితే నేతితో చేస్తే బొర బొరలాడుతూ గుల్ల విచ్చుకొని వుండే పిండి వంటలు కొన్ని, నూనెతో చేస్తే గట్టిగా వుంటాయి. పైగా కొంచం ఎక్కువ తింటే నోరు చేదుక్కుతుంది. గెణుసుగడ్డలలో ఒక విధమైన తీపి వుంటుంది. అలాటి తీపి కంద, చామ, పెండలం-వీటికి వుండదు. నేను చెప్పిన పప్పుకు పులిహోర వాసన వచ్చేలా మరి కొంత పోపు పెట్టాలని, నాలుగు టేబిల్ స్పూన్స నెయ్యి వేయాలని రాశా. తీపి వుంటుంది కనుక తప్పకుండ నేతి పోపు పెట్టాలి. ఏమైనా నేను నిమ్మరసం పిండే ఏ కూరకుగాని ఇంతవరకు నూనె వేయలే. కొద్దిగా నూనె వేసి పోపుపెట్టుకుంటే పక్షంలో చేదుకు విరగదేమో. కాని నేను చెప్పినట్లు మరికొంత నూనె వేసి పోపుపెట్టుకుంటే పక్షంలో, చల్లారిన తరువాత తప్పకుండా చేదుకు విరుగుతుంది.

జి లీలావతి, వేటపాలెం.

---

## మహిళా సంఘాలు

కోగకొల్లు (భీమవరం తాలూకా)లోని శ్రీ అన్నపూర్ణాదేవి మహిళా సంఘంవారు మార్చి 12 న ప్రథమ వార్షికోత్సవం జరుపుకొన్నారు. ఆరోజునే గ్రామంలో అంబరు చరఖా శిక్షణ కేంద్రం స్థాపించారు. 113 సంవత్సరాల వయస్సుగల పండు ముదుసలి, కాంగ్రెసు సేవిక అయిన శ్రీమతి కోటపర్తి కనకమ్మగారు ఈకేంద్రానికి ప్రారంభోత్సవం జరిపి ఇది బాగా నడవాలనీ పదిమందికి జీవనోపాధి చూపించగలగాలనీ దీవించారు.

సభకు శ్రీమతి మునుండి చంద్రకాంతమ్మ అధ్యక్షత వహించారు. అధ్యక్షురాలు, గ్రూపు ఆర్గనైజరు శ్రీ కోడాలి వెంకటేశ్వర్లు, చరఖా ఇన్స్పెక్టరు శ్రీమతి జంపన చంద్రమ్మ గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో అంబర్ చరఖా ప్రాముఖ్యాన్ని వివరించారు. దీనివల్ల స్త్రీలు, కుటుంబం రాబడిని పెంచుకోవచ్చునన్నారు.

సాయంకాలం వార్షికోత్సవ సభకు జంపన చంద్రమ్మగారి అధ్యక్షత వహించారు. సంఘ కార్యదర్శిని శ్రీమతి శ్రీ గిరి రత్నమాల వార్షిక నివేదికను సమర్పించి గత సంవత్సరం కార్యకలాపాలను వివరించారు. సంఘం అధ్యక్షురాలు శ్రీమతి మంతెన లీలావతమ్మ, శ్రీమతి గోకరాలు వెంకాయమ్మ పి. సూర్యకాంతమ్మ కూడా మాట్లాడారు.

# సినిమా

## సంగీత వ్యాఖ్యానం



శారదా వారి ఉగాదికానుక 'జయభేరి'లో మదిరతో పతనం చెందిన మధుర గాయకుడుగా నాగేశ్వరరావు; అతనిలో కళాంశాన్నే చూచి మన్నించగలిగిన రసజ్ఞుడు, విజయానంద చక్రవర్తిగా రంగారావు



అరిటికాయ, బంగాళదుంపా వేసి కొందరు కూరొండితే, తిన్నవాళ్ళు పెండలం అంటారట. ఏమన్నా, కూరబాగుంటే అది మెప్పు, కాకపోతే తప్పూను. సంగీత రచయితలు కూడా అప్పుడప్పుడు ఇలాటి ప్రయోగాలు చేస్తూఉంటారు.

రెండు వయొలిన్ల మీద ఒక ఫ్లూట్ వాయిస్తే క్లారినెట్‌లా వినిపిస్తుంది. ఆరు ఫిడేళ్ళమీద రెండు మాండలిన్లతో పంక్చువేషన్లు పెట్టుకుంటూ పరిగెడితే చెరువులో తేటనీటిమీద అంటీ అంటకుండా విసురుగా కప్పదాట్లు వేసుకుపోయే చిళ్ళపెంకులా ఉత్సాహం కలిగిస్తుంది. అక్కడక్కడ వేణువీణా నాదాలతో ప్రతివాదనలు చేస్తే ఒళ్ళుఝల్లుమని ప్రాణం ఎక్కడికో తేలిపోతుంది. సుశీల గాత్రానికో, ఘంటసాల బంగారు కంఠానికో, మధురమైన త్రీని వాయిస్‌కో వెనకాల దూరంగా బేస్‌లో మిళాయించిన వాద్యాలు పెడితే,—ముద్దబంతిపూల రథమల్లె ఉన్న అమ్మాయి తాలూకు దోసపండులాంటి పచ్చని మొహానికి నల్లనిజుట్టులా అద్భుతమైన కాంట్రాస్టు కనిపిస్తుందని ఒకరినిమించి ఒకరు ఉపమించి ఆనందించే వారున్నారు. ఈ మధుగోహాలను కార్యరూపంలో పెట్టినవారూ ఉన్నారు; పెట్టాలని ఆశపడి, పరిస్థితులవల్ల సాధించలేనివారూ ఉన్నారు. ఉత్తరాదిన ఇలాటి సదుపాయాలు ఎక్కువ. షఫీమహమద్, సజద్ హుసేన్, వంటి సంగీతదర్శకులూ, సెబాస్టియన్‌వంటి ఆర్కెస్ట్రా నిర్వాహకులూ, అడపా దడపా ఈ ప్రయోగాలుచేస్తునే ఉంటారు. ఈ స్వేచ్ఛ ఉత్తరాది వారికి మద్రాసులో ఇంకా ఎక్కువలభిస్తుంది.

ఇక్కడివారికిమాత్రం కనీస సదుపాయాలు కూడా జరగవని కొందరు అంటారు. ఆరు వయొలిన్‌లు కావాలంటే రెండిటితో సర్దెయ్యమనే పరిస్థితులు ఇంకా ప్రవర్తిల్లుతున్నాయి. వీణకి ఒక బిట్ ఉందంటే అది కట్‌చేసి ఫిడేలువాణ్ణే వీణలా వాయించీ మంటున్నారూ అనేవాళ్లున్నారు.

"నీ పియానో నాకెక్కడా వినిపించలేదు డబ్బెందుకివ్వాలి" అనే రసికులు కూడా ఉన్నారు.

"అల్లదిగో ఆ నల్ల మెట్టుమీద నొక్కండి. ఆ అక్కడినించి మొదలెట్టి వరసకట్టండి" అనగల బాక్ సీట్ డ్రైవర్లూ ఉన్నారు.

ఈ పరిస్థితులలో మంచి సంగీతం ఎక్కడనించి వస్తుంది? కొత్త పోకడల రాకడకి దారేదీ?" అన్నాడొక సంగీతదర్శకుడు.

రీరికార్డింగ్ ఘట్టంలో (సంగీత వ్యాఖ్యానం) వీటికి తోడు ఇంకో కొత్త చిక్కు కూడా వస్తోంది. దీనికి ఎవరూ బాధ్యులు కారు. కాస్త అటూ ఇటూగా బయటపడాల్సిన చిత్రాలన్నీ హడావుడిగా ఒకేసారి ముహూర్తం పెట్టుకుంటాయి. అప్పుడు వాద్యబృందంలో ఉండవలసినంత మందీ ఒక్కొక్కసారి దొరకరు. ఉన్నకొద్ది మందీరోజుకి 24 గంటలూపనిచేసినా, కొన్ని చిత్రాలకు కావలసినవాళ్ళు వేళకి దొరకటం లేదు. పని కూడా దాన్నొట్టే ఉంటోంది. ఇది పెద్ద సమస్యగా కనిపించకపోవచ్చు గాని సినిమాలో నేపథ్య సంగీత ప్రాముఖ్యాన్ని, సన్నివేశాలకు ప్రాణం పోయగల సంగీత వ్యాఖ్య అవకాశాలనూ పరిశీలిస్తే, దీనికి మన నిర్మాతలు ఈనాడు ఇస్తున్నదానికన్న ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వవచ్చుననీ, ఈ కార్యక్రమాన్ని హడావుడిగా మొదలెట్టి అర్జెంటుగా ముగించకుండా కాస్త ముందంగానే ఆరంభించి స్థిమితంగా సాగించవచ్చుననీ అనిపిస్తుంది. ❀

## నమ్మినబంటు

శంభుఫిలింస్‌వారి గ్రామీణ సాంఘిక చిత్రం 'నమ్మినబంటు' చాలావరకు పూర్తి అయింది. గతవారం చీరాల పరిసరాలలో కోడెలపందాలు, కొన్ని ముఖ్యసన్నివేశాలు చిత్రించి వచ్చారు. నాగేశ్వరరావు, సావిత్రి, రంగారావు, రేలంగి ఇందులో ముఖ్య పాత్రధారులు. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు. నిర్మాత యార్లగడ్డ వెంకన్న చౌదరి. ❀

# ★ ఉగాది కానుకలు ★

ఈ నెలలో, ఇప్పటికి ఖరారైన వివరాల ప్రకారం హీనపక్షం ఐదు చిత్రాలు విడుదల అవుతున్నాయి. వీటిలో ఒకటి తర్జుమా-చిత్రం. మిగతా వాటిలో మూడిటిలో ముఖ్యపాత్రధారి నాగేశ్వరరావు. వీటిలో రెండిటిలో నాయిక అంజలీదేవి.

మార్చి 27 న రావలసిన రిపబ్లిక్ వారి హాస్యరస ప్రధానచిత్రం 'పెళ్లిసందడి' ఈ నెల ఒకటవ తేదీన వస్తోంది. ఈ చిత్రం దర్శకుడు యోగానంద్. సంగీతం ఘంటసాల. చురుకుపాలు బాగా ఉన్న అమ్మాయిలూ అబ్బాయిల ప్రేమాయణాలు కథావస్తువు.

* * *

శారదావారు విశేష వ్యయప్రయాసలతో భారీఎత్తున నిర్మించిన సంగీతరస ప్రధాన చిత్రం 'జయభేరి' 9 వ తేదీ ఉగాదినాడు విడుదల అవుతోంది. శాస్త్రోక్తమైన సంగీత విద్య నభ్యసించి, ఆవిద్యను పండితపామర జనరంజకంగా ప్రయోగించి సద్వినియోగం చేసుకొన్న ఒక మహాగాయకుడి కథను ఇందులో చిత్రించారు. చిత్రకారులు పి. పుల్లయ్యగారు. నటులు నాగేశ్వరరావు, రంగారావు, గుమ్మడి, నాగయ్య, రేలంగి, రమణారెడ్డి, అంజలీదేవి. రాజసులోచన.

ఛాయాగ్రహణం: పి. ఎల్. రాయ్.

ఉగాదినాడే విఠల్ ప్రొడక్షన్స్‌వారి పౌరాణికచిత్రం 'జయవిజయ' విడుదల కాగలదనుకొంటున్నారు. కృష్ణకుమారి, కాంతారావు, రాజనాల, ముక్కామల మొదలగువారున్నారు. దర్శకుడు విఠలాచార్య.

తమిళనాడులో విశేష జనాదరణ పొందిన జానపదం 'నాడోడి మన్నన్' చిత్రాన్ని రాజశ్రీవారు తెనిగించి "అనగనగా ఒకరాజు" అనేపేరున ఏప్రిల్ 17 న విడుదలచేస్తున్నారు. మాటలూ, పాటలూ శ్రీశ్రీ వ్రాశారు.

భానుమతి, ఎం. జి. రామచంద్రన్ ఇందులో నాయికానాయకులు.

ఏప్రిల్ 24 న ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్‌వారి "ఇల్లరికం" విడుదల అవుతుంది. నాగేశ్వరరావు. జమున, గిరిజ, సి. ఎస్. ఆర్. రమణారెడ్డి, ఆర్. నాగేశ్వరరావు మొదలగువారు పాల్గొన్న ఈ చిత్రానికి తాతినేని ప్రకాశరావు దర్శకత్వం నిర్వహించారు. రచయిత ఆరుద్ర. సంగీతం చలపతిరావు. నిర్మాత అనుమోలు సుబ్బారావు.

* * *

"నేషనల్ ఆర్ట్ థియేటర్స్‌వారి భారీ జానపదచిత్రం "రేచుక్క పగటిచుక్క" మే నెలాఖరున గాని, జూన్ తొలివారంలో గాని రాగలదనుకుంటున్నారు.

రాజ్యం పిక్చర్స్‌వారి "కృష్ణలీలలు" జూన్‌లో విడుదల కావచ్చును.

* * *

అన్నపూర్ణావారి తృతీయ చిత్రం 'మాంగల్య బలం' ఏప్రిల్ 16 నుండి 28 వరకూ ఆంధ్రలో ఏడు కేంద్రాలలో శతదినోత్సవాలు జరుపుకోబోతోంది. ఈ సంవత్సరం రాష్ట్రపతి ప్రశంసాపత్రం అందుకోవడం, ఇటు ఉత్సవాలు జరుపుకొని కృతజ్ఞతాభివందనలు అర్పించడం ఒకటి రెండు రోజులు అటూఇటూగా ఒకేసారి జరుపుకోవడం ఈసారి వీరి ఉత్సవాల



ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్‌వారి 'ఇల్లరికం' లో నృత్య దృశ్యం.

విశేషం. ఈ చిత్రంలో అన్నపూర్ణా సంస్థ 'హాట్ ట్రిక్' కొట్టిందని కూడా చెప్పుకోవాలి. వరసగా ఒకసంస్థ తీసిన మూడు చిత్రాలు వరసగా ప్రశంసలతో పాటు ఆర్థిక విజయాన్ని సాధించగలగడం తెలుగు పరిశ్రమలో అరుదనీ, ఆ మాటకొస్తే ఇదే తొలిసారి అనీ ఒక బాక్సాఫీసర్ అన్నారు.

*　　*　　*

చెప్పుకోతగిన ఇతర విశేషాలలో ఆదుర్తి సుబ్బారావు ('తోడి కోడళ్ళు' చిత్రానికి కూడా ఈయనే దర్శకుడు) దర్శకత్వం వహించిన మూడు చిత్రాలలో రెండు శత దినోత్సవాలు జరుపుకోవడంతోపాటు రాష్ట్రపతి ప్రశంసాపత్రాలు పొందగలగడం.

'మాంగల్యబలం' తమిళ్ప్రతి మంజల్ మహిమైకూడా తమిళనాడులో ప్రజాదరణ పొందుతోంది. వారానికో కొత్తచిత్రం చొప్పున భారీ తమిళచిత్రాలధాటిని తట్టుకు పోటీచేసి నిలబడింది మంజళ్ మహిమై.

మాంగల్యబలం శతదినోత్సవకేంద్రాలు నెల్లూరు, గుంటూరు, ఏలూరు, విజయవాడ, రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్టణం. ●

# అకాదమీ సత్కారాలు

అఖిలభారత సంగీత నాటక అకాదమీ ఈ సంవత్సరం సత్కరించబోతున్న వారిలో సినిమాకు చెందిన కళాకారులు ఇద్దరూ, అన్ని విధాలా ఈ గౌరవానికి, ఇంతకు మించినదానికీ కూడా అర్హతగలవారిని వార్త విన్నవారంతా ఆనందిస్తున్నారు.

## అపరాజితుడు

భారత చలనచిత్ర చరిత్రలో ఈ తరానికి హీరో, ప్రపంచచలనచిత్ర ప్రపంచంలో తొలిచిత్రంతోనే గొప్ప సంచలనం కలిగించి, అది అదృష్టం అని అనుమానించిన వారి హృదయాలను కూడా రెండవ చిత్రంతో జయించి, ప్రపంచావధిని జైత్రయాత్రచేసి బహుమతులను ప్రశంసలను అంగకొన్న ఘనుడు, సత్యజిత రాయ్ ఈ అపరాజితుడిని చలనచిత్ర దర్శకుడుగా అకాదమీ సత్కరిస్తుంది

## అశోక్ కుమార్

ఎంతటవాళ్ళూ కాలచక్రంధాటిని నిభాయించుకోలేరంటారు. సినిమా కాలచక్రం మరీ దూకుడుగా తిరుగుతుంది. పడమటా, తూర్పునా కూడా దీన్ని తట్టుకు రెండు తరాలు నిలబడ్డ వాళ్ళని వేళ్ళమీద లెక్కించవచ్చు. ఎవర్ గ్రీన్ హీరో అశోక్ కుమార్ ఆ శ్రేణిలో మనిషి. అతను చిన్నప్పుడు ఎత్తుకు ఆడించిన ఆడపిల్లలో కొంత కాలం క్రితం హీరోయిన్లు వేశారు అతని కళ్ళముందు పుట్టి పెరిగినవాళ్ళు ఇప్పుడు వేస్తున్నారు. ఎందరో వచ్చారు వెళ్ళారు గాని "బేబీ నాజ్ తో హీరో వేస్తాను" అని అనగల ఈ నిత్య యౌవనుడు నిజమైన తెరవేలుపు అశోక్ కుమార్, ధ్రువతారాపథంలోనే విహరిస్తున్నాడు. అక్కడ ఉండడం వల్ల గొప్పవాడు కాబోలు అని కొందరి గురించి అనుకోవలసిఉన్నా, గొప్పవాడు కావడం వల్లనే ఇతను అక్కడ ఉంటున్నాడు అని అంతా అంగీకరిస్తారు ఉత్త చెత్త చిత్రాలలో చెత్త పాత్రలను ధరించినా, అశోక్ కుమార్ వాటిని నిబ్బరంగా నిలబెట్టి నడిపించగలడు. పరిణీత, కారిగార్, అలనాటి నయా సన్సార్ వంటి మంచిచిత్రాలలోఅతనిని చూసినవారు, ఈనాడు అతను ఒకచిత్రంలో పాత్ర ధరించడం బాగుండకపోయినా, అతని గురించి అన్యథా భావించడానికి సాహసించలేరు.

## మూలవిరాట్టు, ఉత్సవ విగ్రహం

పోతే, చలనచిత్ర కళాకారుడుగానే సత్కరింపబడదగిన మరొకవ్యక్తి వంగ దర్శకుడు శంభు.మిత్ర. ఈయనా, అమిత్ మైత్ర అనే మరో యువకుడూకలిసి రాజకపూర్ సహకారంతో ఉత్తమశ్రేణి భారతీయ చిత్రం 'జాగ్ తేరహా'ను సృష్టించారు. దేశీయ చిత్రాలలో దీనికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. కథ, చిత్రణ' కొత్తదనంతో శిల్పంతో మంచి ప్రమాణాలను నెలకొల్పాయి. రాజ్ కపూర్ అందులో చాలా గొప్పగా నటించినా, ఆ పాత్రను ఆ కథను, చిత్రానికి ఆ రూపాన్ని సృజించినవారు శంభుమిత్ర, అమిత్ మైత్రాలే. ఇంటర్నేషనల్ అవార్డులూ గట్రా రావడంతో మూలపురుషులు మూలపడిపోయారు. నిజంగా ఇది మంచి చిత్రం అన్న ప్రశంసలు బలపడడంతో, అసలు ఈ బెంగాలీ వాళ్లు ఇందులో ఆటే పని చెయ్యలేదనీ, 'యస్సార్ నోసార్' బాపతుగానే ఉన్నారనీ ఆ చిత్ర నిర్మాత 'వెల్లడించాడు. మరో ఘట్టం గడిచాక, 'చార్లీచాప్లిన్ పిక్చర్లు నేనేం చూడలేదు. చాలాచిన్నప్పుడు పరాగ్గా ఓటి చూశానేమో' అని కూడా ఆయన ప్రకటించాడు...

భారతీవారి 'బభ్రువాహన' చిత్రంలో ఎస్. వరలక్ష్మి

శారదావారి సంగీత రసప్రధానచిత్రం 'జయభేరి లో ఒక ఉద్విగ్న సన్నివేశం. గుమ్మడి, శాంతకుమారి, అంజలీదేవి, నాగేశ్వరరావు

# ★ చిత్రలేఖ ★

ఆర్యా, మన చిత్రాల నిడివి మూడు ఘంటలకి తగ్గితే ఒప్పుకోనివాణ్ణే అయినప్పటికీన్నీ మాటల విషయంలో బహు పొదుపరిని అని గ్రహించగలరు. ఇంతా అంతా కాదు. అపరిమిత మిత భాషిని. నా మిత్రులంతా అ స్తమానూ అదే అంటారు. వాళ్లన్నారనే కాదుగాని, ఏ మాట కామాటే చెప్పుకోవాలి. మితి చాలా మంచిది. ఇంతకీ చెప్పొచ్చిన ముక్క మన చిత్రాల నిడివి గురించికదూ. మన చిత్రాలు చాలా పొడుగైనవని నా మటుకు నాకు ఎన్నడూ అనిపించటంలేదు.

అసలు నిడివి అనేది సాపేక్ష సిద్ధాంతం క్రిందకు వస్తుంది. కథనుబట్టి, అది చిత్రించే పధతినిబట్టి ఈనిడివిఉంటుంది పిట్టకధకీ మహాకావ్యానికీ కూడా పదివేల అడుగులే పరిమితి అనడం తగునా? ఒక దానికి ఎక్కువ అయితే, రెండో దానికి ఏ మూలకీ చాలదు. ఆ ప్రకారం మన చిత్రాలలో ఒకొక్క చిత్రానికి పది కథలు ఉంటాయి. కాబట్టి పది పదులు నూరువేల అడుగులు నిడివి ఉండవచ్చు. అలాగే కొందరికి నాలాగే చక్కగా టూకీగా సంగతి చెప్పడంవచ్చు. కొందరికి, మోహన్, రామయ్యగారి కొడుకనీ, వాళ్ళకి డబ్బుందనీ, లలిత మోహన్‌ని, ప్రేమించిందనీ లలిత బావ చెంగిజ్ ఖాన్‌కి వీళ్ళ ప్రణయం నచ్చలేదనీ చెప్పి కథ ఆరంభించడానికి ఇంగ్లీషు పిక్చరు తీసినంతపని అవుతుంది. ఇంత నిడివితగదని చెప్పేందుకు మనం ఎవరం? సాపేక్ష సిద్ధాంతం (రిలెటివిటి) ప్రకారం మనం రిలెటివ్‌లం అయి, మనకి ప్రొడ్యూసరుమీద అపేక్ష ఉంటే నిడివి తక్కువ, కాపోతే ఎక్కువే. అలా ఇలా కాదూ నీవంటి మిత భాషి ఒక్కముక్కలోగీటు రాయలాటి సూత్రం ఒకటి వేసకపోతే వల్లకాదు అంటారా? నాజవాబు ఓకే. నేనురాసిన ఈ లేఖలో అక్కరలేని, అనవసరపు, నిష్ప్రయోజనపు మాటలుగాని, తగ్గించి, తొలగించి ఒక్కమాటలో దాన్ని కుదించి ఇంతకన్న చిన్నదిగా గ్రహ స్వీకరించడం ఎంత సాధ్యమో నేటి మన చలనచిత్రాలలో అనవసర అవాంఛనీయ భాగాలను తీసి కుదించడమూ అంతే సాధ్యం.

(నా పేరు పొడుగు గాన చిన్న అక్షరాలలో వేయించగోర్తాను.

ఇట్లు

పొడుగుపాటి లక్ష్మీనృసింహా సీతా రామాంజనేయ యుద్ధ పట్టాభి రామారావు.



---

మొత్తానికి అంత మంచిచిత్రంలో దర్శకుడని పేరు వేయించుకోగలిగిన ఈ మిత్రులు మిత్రా, మైత్రాలు ఇద్దరూ మళ్ళీ సినిమాలు తియ్యలేదు. నాటకాలలో ఉండిఉండాలి. అందువల్లనే సినిమాలో అలా దెబ్బతిన్న మిత్రా ఇప్పుడు తిరిగి హఠాత్తుగా నాటకాలలో కూడా ఉత్తమ దర్శకుడు అని పేరు తెచ్చుకోవడంతో అకాడమీవారు అతనిని ఉత్తమ నాటక దర్శకుడుగా సత్కరించ నిశ్చయించారు. ఇంతవరకూ ఇదైనా సంతోషించవలసిన సంగతే.

# ఉత్తమచిత్రాలకు బహుమతులు

ఈ నెల ఆఖరు వారంలో తిరిగి దేశీయ చలనచిత్ర కళాకారులను ప్రభుత్వం సత్కరించబోతున్నదన్న వార్త వినగానే, సంతోషం తరువాత కలిగే తొలి ఊహ "ఈసారి బాగా జరగాలి" అన్నదే. నాలుగేళ్ళనాడు డా॥ కేస్కర్ గారు ఈ సత్సంప్రదాయాన్ని ఆరంభించారు. నాటికీ నేటికీ పరిసితులు మెరుగయ్యాయి ఈ బహుమతులపట్ల ప్రజలలోనూ, సినిమా పరిశ్రమలోనూ కూడా గౌరవాభిమానాలు పెరిగాయి. డబ్బు గడించడమే కాక, మంచి చిత్రం తీసి బాగుందన్న పేరు తెచ్చుకోవాలన్న ఉత్సాహం సర్వత్రా ప్రవర్తిల్లుతోంది.

దీనికి తగినట్లే ప్రభుత్వం ఉత్తమ చిత్రాలకు పతకాలూ సర్టిఫికెట్లు ఇచ్చి చప్పట్లు కొడితే చాలదని గుర్తించి నగదు బహుమతులు (లాంఛనంగా నేఅయినా) ఇస్తోంది. బొంబాయివంటి రాష్ట్ర ప్రభుత్వాలు, తమ ప్రాంతాలలో మంచి చిత్రాలకు వినోదం పన్ను మినహాయించి ప్రోత్సహిస్తున్నాయి.

ఒక్కసారి వెనక్కు తిరిగిచూస్తే—ఈ ప్రోత్సాహాల ప్రత్యక్ష ప్రభావం కనిపించినా మానినా మొత్తానికి దేశీయ చలనచిత్రాల స్థాయి నానాటికి కొద్దికొద్దిగా పెరుగుతోందనే అనిపిసుంది. ఇది వర్ధిల్లాలంటే, జరగదగిన కార్యకలాపాలు కొన్ని త్వరగా జరగాలి. బహుమతులు పొందిన చిత్రాలకు దేశవ్యాపమైన ప్రచారం కావాలి. ఇవాళ 'సాగర్ సంగమే' అనే బెంగాలీ చిత్రానికి రాష్ట్రపతి సువర్ణ పతకం ఇస్తున్నారు. ఇది బెంగాలీ చిత్రం. దీని గురించి ఇంతకన్న విలువైన సమాచారం మిగతా ప్రాంతాలవారికి తెలియదు. కేంద్ర సమాచారశాఖ ఈ కార్యం నిర్వహించడం భావ్యం. ఆ పైన, దేశం మొత్తంమీద ఉత్తమోత్తమమైన ఈ బహుమతిపొందిన ఈ చిత్రాన్ని ఇతరచిత్రాలనూ దేశంలో మిగతా ప్రాంతాలవారు కూడా చూచి ఆనందించే సదుపాయం ఒకటి జరుగవలసి ఉంది. వీటిని చూడడానికి ప్రజలు లక్షోపలక్షలుగా రాకపోవచ్చు. హాలు క్రిక్కిరిసి పోకపోవచ్చు. అయినా కనీసం అన్ని రాష్ట్రాల ముఖ్యనగరాలలోనూ తగుపాటి ప్రచారంచేసి ప్రదర్శిస్తే, చూడవచ్చేవారు చాలామంది ఉంటారు. దీన్నిబట్టి డాక్టర్ కేస్కర్ గారు ఫిలిం డిస్ట్రిబ్యూషన్ వ్యాపారంకూడా ఫిలింస్ డివిజన్ పేరిట ఆరంభించాలని సూచించటంలేదు. కేంద్ర సమాచారశాఖవారు నిర్మాతల సంఘంవారు సంప్రతించుకుని ఇందుకుమార్గం ఆలోచించవచ్చును. అటువంటిది జరగకపోతే యీ సత్కారాల ప్రయోజనం పూర్తిగా నెరవేరదు. అన్ని రాష్ట్రరాజధానులలోను యీ బహుమతిప్రదానం తరువాత చలనచిత్ర వారోత్సవాలు జరిపి చిత్రాలను చూపడం ఒకపద్ధతి అని ఒకనిర్మాత అన్నారు.

* * *

ప్రాంతీయ బహుమతులపేరిట రజత పతకాలు ఇచ్చే చిత్రాలకుకూడా నగదు బహుమతులు ఇవ్వడం వాంఛనీయమనీ లేదా వినోదం పన్నులో కొంతశాతం మినహాయించవచ్చుననీ పూర్వం వినిపించిన సూచనలు ఈసారికూడా పునరుక్తం అవుతున్నాయి. కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు సానుభూతితో పరిశీలించతగిన విషయాలలో ఇది ఒకటి.

* * *

ఇక ఢిల్లీలో ఉత్సవంగురించి, గత సంవత్సరం అనుభవాలదృష్ట్యా ఈసారి కొన్ని ముఖ్యకర్తవ్యాలను ముందుగానే ఆలోచించుకోవడం మంచిదని కొందరు ఫిలింవర్గాలవారు అంటున్నారు.

గతసంవత్సరం ఆహ్వానాలు పురస్కరించుకొని ఢిల్లీ వెళ్ళిన చలనచిత్ర నటీనట దర్శక నిర్మాతలలో కొందరికి వసతి సదుపాయాలు జరిగాయి. కొందరికి జరుగబోయి మానేశాయి

బహుమతి ప్రదానసమయంలో పేర్లు పిలవగానే వెళ్ళి రాష్ట్రపతి ఇచ్చిన బహుమతి పుచ్చుకు చక్కా రావడం జరుగుతుంది. వేదిక మీదికివచ్చిన వాడి పేరు వినా, అతనిగురించిగాని, అతని చిత్రంగురించిగాని సభికులలో ఎవరికీ ఏమీ తెలియదు. అంతా టూకీగా మొక్కుబడిలా జరిగిపోతుంది.

బహుమతులు అందుకునేవారు అంతా కలిసి పాతికమందికి మించరు కాబట్టి, వారినీ వారిచిత్రాలను కొద్దిపాటిగానైనా పరిచయం చేయడం అవసరమని అంతా భావిస్తున్నారు.

* * *

1958 లో సెన్సారు అయిన దేశీయ చలనచిత్రాలలో, 'సాగర్ సంగమే' అనే బెంగాలీ చిత్రాన్ని ఉత్తమ కథాచిత్రంగా ఎన్నిక చేశారు. డాక్యుమెంటరీలలో 'రాధాకృష్ణ' చిత్రానికి ఈ గౌరవం లభించింది. వీటికి రాష్ట్రపతి సువర్ణ పతకాలను, ఇచ్చి గౌరవిస్తారు. ఆ పైన కథాచిత్రానికి రు 25 వేలూ, డాక్యుమెంటరీకి 5 వేలూ నగదు బహుమతులుకూడా ఇస్తారు.

ద్వితీయ తృతీయ స్థానాలు సంపాదించిన 'జల్సాఘర్' (సత్యజిత్ రాయ్), స్కూల్ మాస్టర్ (బి. ఆర్ పంతులు) కథాచిత్రాలకూ, 'డా॥ కార్వే', 'కాల్ ఆఫ్ ది వైల్డ్' డాక్యుమెంటరీలకూ ప్రశంసాపత్రాలు ఇస్తారు. ద్వితీయశ్రేణి చిత్రాలు రెండింటికీ నగదు బహుమతులుకూడా ఇస్తారు.

ఈసారి కూడా తెలుగు చిత్రాలలో

## బహుమతి వివరాలు

రాష్ట్రపతి సువర్ణ పతకాలు: సాగర్ సంగమే-(బెంగాలీ)-కథాచిత్రం; రాధాకృష్ణ (డాక్యుమెంటరీ). కథాచిత్రం నిర్మాతకు రు 20 వేలూ, దర్శకునకు ౫ వేలూ, డాక్యుమెంటరీ నిర్మాతకు ౫ వేలూ, దర్శకునకు వెయ్యి, నగదు బహుమతులుకూడా ఇస్తారు.

ప్రశంసాపత్రాలు: జల్సాఘర్ (బెంగాలీ)-కథాచిత్రం; ది స్టోరీఆఫ్ డాక్టర్ కార్వే-డాక్యుమెంటరీ. కథాచిత్రం నిర్మాతకు 10 వేలూ, దర్శకునకు రు. 2,500 డాక్యుమెంటరీ నిర్మాతకు 1000, దర్శకునకు రు. 500, నగదు బహుమతులుకూడా ఇస్తారు.

తృతీయశ్రేణిలో ఉంచిన స్కూల్ మాస్టర్ (కన్నడం) కథా చిత్రానికీ, కాల్ ఆఫ్ ది వైల్డ్ అనే డాక్యుమెంటరీకీ ప్రశంసాపత్రాలు ఇచ్చి సత్కరిస్తారు.

ప్రధాని పేరిట బాలలచిత్రాలకు ఇచ్చే సువర్ణపతకం అందుకొనడానికి యోగ్యమైన చిత్రం రాలేదు అని నిర్ణాయక సంఘంవారు అభిప్రాయపడ్డారు. ఆంగ్లచిత్రం 'వర్నా అండ్ ది మాజిక్ డాల్'కు ప్రశంసాపత్రం ఇస్తారు.

## ప్రాంతీయస్థాయి

రజతపతకాలు: సాగర్ సంగమే (బెంగాలీ), స్కూల్ మాస్టర్ (కన్నడం), మధుమతి (హిందీ), రాంగాపోలీస్ (అస్సామీస్), పెళ్ళినాటి ప్రమాణాలు (తెలుగు).

ప్రశంసాపత్రాలు. లాజ్వంతి, కారిగార్ (హిందీ), ధక్తిజావూ (మరాఠీ), జల్సాఘర్, డాక్ హర్కారా (బెంగాలీ), తంగప్పగుమై, అన్నైయిన్ ఆనై (తమిళం), మాంగల్యబలం (తెలుగు). నాయర్ పుడిచ్చ పులివాల్, రాందీదంగాజీ (మలయాళం)

బహుమతులకు అర్హమైన చిత్రాలు నిర్ణయించిన కేంద్ర సంఘానికి కలకత్తా విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుడు శ్రీ ఎస్ కె. సిద్ధాంత అధ్యక్షులు. వివిధ రంగాలకు చెందిన 11 గురు ఇందులో సభ్యులుగా వ్యవహరించారు తెలుగు చిత్రాలను పరిశీలించిన ప్రాంతీయ సంఘానికి శ్రీమోటూరిసత్యనారాయణఅధ్యక్షులు.



పొన్నలూరి బ్రదర్స్‌వారి "దైవబలం" చిత్రంలో జయశ్రీ

# ఫిలిం బాలెట్

ఆంధ్రప్రదేశ్ సినిమాప్రేక్షకసంఘం (రాజమహేంద్రవరం) వారు ఏప్రిల్ మూడోవారంలో జరుపనున్న మహాసభ సందర్భంగా ఇటీవల ఫిలింబాలెట్ నిర్వహించారు.

1958 వ సంవత్సరపు చిత్రాలలో ఈ ఎన్నిక జరిగింది. ఒక లక్ష బాలెట్‌పత్రాలు ముద్రించి వివిధపట్టణాలలో సినిమాలలో ప్రేక్షకులకు పంచిపెట్టారనీ, 28 వేల మంది వాటిలో తమఅభిప్రాయాలువ్రాసి పంపిఓటు వేశారనీ బాలట్ నిర్వాహకులు ప్రకటించారు.

ఫలితాలు. ఉత్తమచిత్రం—శ్రీ ప్రొడక్షన్స్‌వారి 'మంచిమనసుకు మంచిరోజులు' ఉత్తమదర్శకుడు కె. వి రెడ్డి, ఉత్తమ నటుడు అక్కినేని నాగేశ్వరరావు, నటి అంజలీదేవి, హాస్యనటుడు రేలంగి వెంకట రామయ్య, సహాయనటుడు జె. వి. రమణ మూర్తి, సహాయనటి రాజసులోచన, బాల నటుడు బాజ్జీ.

ఈ నెల మూడోవారంలో న్యాయమూర్తి శ్రీ పి. వి. రజమన్నారు అధ్యక్షతను జరిగే సభలో ఈ కళాకారులను సన్మానిస్తారు.

దేనికీ అఖిలభారత స్థాయి బహుమతి లభించ లేదు.

ప్రాంతీయ స్థాయిన జయంతీవారి 'పెళ్లినాటి ప్రమాణాలు' చిత్రానికి రజతపతకం, అన్నపూర్ణావారి 'మాంగల్య బలం'కు ప్రశంసాపత్రం లభించాయి తమిళంలో ఈసారి దేనికీ రజతపతక బహుమతి లభించలేదు తంగప్పగుమై, అణ్ణాయిన్ ఆనై అనే చిత్రాలకు ప్రశంసాపత్రాలు ఇవ్వ నిశ్చయించారు.

జయంతీవారికి 'పెళ్ళినాటి ప్రమాణాలు' తొలి చిత్రం. నిర్మాత పి. ఎస్. రెడ్డి, దర్శకుడు కె. వి. రెడ్డి, రచయిత పింగళి నాగేంద్రరావు. సంగీత దర్శకుడు ఘంటసాల. ఛాయాగ్రహణ దర్శకుడు ప్రసాద్.

ఈ చిత్రంలో ముఖ్యనటుడు ఎ. నాగేశ్వరరావు, నాయిక జమున. సహనటులు రాజసులోచన, ఎస్ వి. రంగారావు, రమణారెడ్డి, చదలవాడ కుటుంబరావు, ఆర్ నాగేశ్వరరావు, అల్లు రామలింగయ్య.

అన్నపూర్ణావారి తృతీయ చిత్రం 'మాంగల్యబలం' వీరి రెండవ చిత్రం తోడికోడళ్ళు కూడా గత సంవత్సరం పురస్కారం అందుకుంది ఈ చిత్రం నిర్మాత డి మధుసూదనరావు, దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, ('తోడికోడళ్లు' చిత్రానికి ఈయనే దర్శకుడు) మాటలు ఆత్రేయ, పాటలు శ్రీ శ్రీ కొసరాజు వ్రాశారు. సంగీత దర్శకుడు వేణు. ఛాయాగ్రహణ దర్శకుడు సెల్వరాజ్. కళాదర్శకులు కృష్ణారావు జి. వి. సుబ్బారావు.

ఇందులో కూడా నాగేశ్వరరావే ముఖ్య నటుడు. సావిత్రి నాయిక. సహనటులు రంగారావు, రేలంగి, రమణారెడ్డి, కుటుంబరావు, సీతారాం, రమణమూర్తి, కన్నాంబ, సూర్యకాంతం, రాధిక ❁

నవశక్తి ఫిలింస్‌వారి 'మాయింటి మహాలక్ష్మి'లో
గిరిజ, నూతన నటుడు హరనాథ్.





ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ఇల్లరికం' చిత్రంలో రామకోటి, రేలంగి, ఆర్ నాగేశ్వరరావు, సి. ఎస్. ఆర్, రమణారెడ్డి.

# హిందీ చిత్రవార్తలు

అన్నపూర్ణా, ఎ. వి. ఎం. సంస్థలు కలసి తలపెట్టిన హిందీ చిత్రం ('దొంగరాముడు' కథతో అని పాఠకులకు విదితమే) నిర్మాణానికి సన్నాహాలు చురుకుగా జరుగుతున్నాయి. రచన (రాజేంద్రకిషన్) రెండు నెలల క్రితమే పూర్తి అయింది. నాగేశ్వరరావుకు నాయికగా మాలాసిన్హా (దొంగరాముడులో సావిత్రి భూమిక) గాని, మీనాకుమారి గాని నటించవచ్చునని తెలుస్తూంది. ఇతర నటీనటుల ఎన్నిక పూర్తి అయినట్లేనని, గతవారం బొంబాయి వెళ్లి వచ్చిన నిర్మాత మధుసూదనరావు చెప్పారు. వారిలో ముఖ్యులు: నందా, మనోరమ, యశోధరా కట్జూ, అచలా సచ్ దేవ్, సులోచన, ప్రతిమాదేవి, హాస్యనటుడు రాధాకిషన్, అన్వర్ హుసేన్, రాజ్ మెహ్రా, కేసరి. ఈ చిత్రానికి కె. వి. రెడ్డిగారే దర్శకులు. సంగీతం మదన్‌మోహన్.

బిభూతిమిత్రా నిర్మిస్తున్న 'బసంతి' త్వరలోనే విడుదలకాగలదని తెలుస్తూంది. షమ్మీకపూర్, నూతన్, రాగిణి ముఖ్యపాత్రధారులు. జోకర్ జానీవాకర్.

సంగీతం నయ్యర్.

* * *

బి. ఆర్. (సాధనా) చోప్రా కొత్త చిత్రం 'ధూల్ కే ఫూల్' కూడా చాలవరకు పూర్తిఅయింది.

చోప్రా, తరువాతి చిత్రం 'కానూన్'కు కూడా మొన్ననే ప్రారంభోత్సవం జరిగింది. షూటింగ్ రెండు వారాలలో ఆరంభిస్తారు. అశోక్‌కుమార్ ఇందులో తొలిసారిగా తండ్రిపాత్ర ధరిస్తున్నాడు. నాయికానాయకులు నందా, రాజేంద్రకుమార్. మహమూద్ ఒక ముఖ్యపాత్ర ధరిస్తాడు.

సంగీతం ఎన్. దత్త సమకూర్చుతున్నాడు

* * *

సోలార్ ఫిలింస్‌వారి 'పట్వార్'లో భరత్‌భూషన్, నిమ్మి, అభిభట్టాచార్య, సజ్జన్, తున్‌తున్, జాగీర్దార్ మొదలగువారు పాల్గొంటున్నారు దర్శకుడు దలాల్ గుహ. సంగీత దర్శకుడు చిత్రగుప్త.

* * *

కొన్స అంతర్జాతీయచలనచిత్రోత్సవానికి మనదేశంలోనుండి మోహన్‌సెగాల్ చిత్రం 'లాజ్‌వంతి'ని పంపిస్తున్నారు. ఇందులో నటులు నర్గీస్, బల్‌రాజ్ సాహ్ని.

మోహన్‌సెగాల్ కొత్తచిత్రం 'అప్నా హార్ జగన్నాథ్' (డీలక్స్ ఫిలింస్) సగం వరకు పూర్తిఅయింది. కిశోర్‌కుమార్‌కు ఇందులో నాయికగా సయీదాఖాం అనే చిన్నదాన్ని తొలిసారి పరిచయం చేస్తున్నారు.

* * *

నటన, సంగీతం, నృత్యం మొదలైనవాటిలో స్వయంగా శిక్షణ యిచ్చి, చదువు చెప్పించి తన తనూజ నూతన్‌ను, స్వయంగా తనే నిర్మించిన చిత్రంలో పరిచయంచేసి తారాపథందాకా తీసుకువెళ్లిన శోభన సమర్థ్, ఇపుడు అదే కార్యక్రమాన్ని అంత కట్టుదిట్టంగానూ ఆరంభించింది. ఈసారి ఆమె రెండవకుమార్తె తనూజను, ఆమెపక్క నటించడానికి కేసీమెహ్రా అనే చక్కని

# ★ న్యూఢిల్లీ లేఖ ★

(7-వ పేజీ తరువాయి)

ఏదో ఒక బెడద తెచ్చిపెడుతూంటుందని ఇక్కడొక అనుమానం బాగా వ్యాప్తిలో ఉంది. ముందు రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణం అన్నారు. తరవాత హిందీ అధికారభాష అన్నారు. ఈ ఆందోళన తగ్గుతూండగానే నాగపూర్ తీర్మానం అనిచెప్పి ఇంకో సమస్యను దేశంమీదికి వదిలిపెట్టారు. ఈలోపల ప్రజల పరిస్థితి ఏమవుతోంది? నానాటికి హెచ్చుతున్న ధరల మరలోపడి జనం నలిగిపోతున్నారు. కాని ఈ దుర్భర దారిద్ర్య బాధా సర్పదష్టుల్ని గూర్చి శ్రద్ధగా ఆలోచించడు. నాగపూర్ తీర్మానాన్ని గురించి మాత్రం కావలసినంత గాలిదుమారం రేపుతారు.

* * *

ప్లానింగ్ శాఖను గూర్చి లోక్‌సభలో ఈమధ్య ఒక గాలిదుమారం రేగింది. అసలు ప్లానింగ్‌కు ఒక మంత్రి, ఒక డిప్యూటీ మంత్రి ఉన్నారే గాని ప్లానింగ్ శాఖ అంటూ ప్రత్యేకంగా ఏమీ లేదు. లాలా గుల్జారీలాల్ నందా ప్లానింగ్ సంఘం వ్యవస్థాపకులలో ఒకడు. ఆ ప్లానింగ్ సంఘానికి పార్లమెంటుకీ మధ్య వ్యవహారాలు నడిపేందుకు గాను ఆయన్నే ప్లానింగ్ మంత్రిగా నియమించారు. ఆయన నిజానికి కార్మిక శాఖ మంత్రి. కాని అవసరార్థం పార్లమెంటులో ప్లానింగ్ వ్యవహారాలను చూడమన్నారు.

కేంద్రప్రభుత్వం కేరళ రాష్ట్రానికి ఇస్తున్న ధనసహాయాన్ని కేరళ ప్రభుత్వం దుర్వినియోగం చేసిందా అని ప్రశ్న వచ్చింది. వస్తే ప్లానింగ్ డిప్యూటీ మంత్రి తమకేమీ తెలియదని సమాధాన మిచ్చారు. ఆ ప్రశ్న ఆర్థిక శాఖను అడగవలసిన ప్రశ్న అని చెప్పటానికి బదులు, ప్లానింగ్ సంఘ ప్రతినిధు లిద్దరూ ప్లానింగ్ మంత్రిత్వశాఖను గూర్చి చర్చలోకి దిగారు. ఎక్కడుందో మరి ఈ ప్లానింగ్ శాఖ?

* * *

ప్రధాన మంత్రి ఇటీవల 'జపానీస్ టీ హౌస్'కు ప్రారంభోత్సవం చేశారు. ఈ భవనాన్ని బయటినుంచి చూస్తే అది కట్సూరా భవనమో, షుగక్యూన్ భవనమో (క్యోటో నగరంలో నేటికీ నిలిచివున్న 17 వ శతాబ్దారంభపు భవనాలు) అనిపిస్తుంది. జాపనీస్ ప్రాచీన వాస్తుశిల్పంలోని అనేక ఉత్తమాంశాలను ఒకచోట చేర్చి నిర్మించిన భవనమది. అంతర్భాగమంతా జపానులో అనూచానంగా వస్తున్న "టీ" సంప్రదాయాన్ని అనుసరించి రమణీయంగా కట్టారు.

జాపనీస్ గృహాలలో సాధారణంగా ఒక టీ గది ఉంటుంది. టీగదిలేని ఇళ్లలో కూడా అతిథులను ఆహ్వానించటం, టీ ఉత్సవం జరపటం సంప్రదాయం. జపానీయులు సంతోషసందర్భాలలోనూ, సంతాపసమయాలలోనూ కూడా తమ స్నేహితులను ఆహ్వానించి వారితో కలిసి టీ సేవిస్తారు. ఒక్కొక్కసారి నాలుగేసి గంటలసేపు టీ ఉత్సవంచేసి మరీ టీ సేవిస్తారు. ఒక్కొక్కసారి ఊరికే ఒకగంటసేపు సన్నిహితహితులతో సరదాగా కబుర్లు చెబుతూ టీ త్రాగుతారు.

తేయాకుపొడుంతో తయారుచేసిన టీ తాగటం జపానులో ఆధ్యాత్మికార్థం కలిగిన ఉత్సవంగా పరిణమించింది. తినుట, టీ త్రాగుట, చక్కని చిత్రాలను కావ్యాలను మెచ్చుకుంటూ ఆనందించుట ఈ ఉత్సవంలో ముఖ్యాంశాలు.

జపానులో మిడిల్ స్కూలు పైబడిన స్కూళ్లలో టీ ఉత్సవం జరపటం పాఠ్యాంశాలలో ఒకటిగా ఏర్పాటు చేశారు. యువకులేకాక, పెద్దవాళ్లుకూడా టీ ఉత్సవం చేయటంగొప్పగా భావిస్తారు. అది నేర్చుకోటం ముఖ్యమని తలుస్తారు. ఈ ఉత్సవం మూలంగా చాలెమంది స్నేహితులవుతూ ఉంటారు. అసలు ఈ రోజున జపానులో సమావేశాలనేకం 'టీ' పానగోష్ఠిగానే జరుగుతున్నాయి. అందుచేతనే టీ ఉత్సవం జపానులో ఈనాడు అత్యంతప్రాధాన్యం వహించింది.

## హిందీ వార్తలు

చిన్నవాడినీ సిద్ధంచేసింది. ఈసారి వీరిని వెండితెర వెలుపుల సీమలో షికారు పంపడానికి ఆమె కడుతున్న రాకెట్ పేరు 'ఛబీలీ'. ఈ చిత్రంలో ఈ యిద్దరూకాక, నూతన్, కె. ఎస్. సింగ్, గులాబ్, ఇఫ్తికర్, హెలెన్, ఆగా మొదలగువారు పాల్గొంటున్నారు.

విశేషం, శోభన సమర్థ్ స్వయంగా దర్శకత్వం నిర్వహించడం. సంగీతం స్నేహాల్ భత్కార్.

* * *

భారతప్రభుత్వ సమాచారశాఖ ఫిలింస్ డివిజన్‌వారు ఈ సంవత్సరం 62 డాక్యుమెంటరీ చిత్రాలు నిర్మించాలని సంకల్పించారు. 'అస్పృశ్యతపై' కథాచిత్రం ఇందులో ఒకటి. డాక్యుమెంటరీలలో ప్రజాళిక ప్రచారానికి కావలసినది, ప్రబోధాత్మకమైనవి, విదేశాలలో మనదేశంగురించి తెలియచెప్పడానికి తీసేవికూడా ఉన్నాయి. ●

# ★ స్వామివారి ఉత్సవం ★

[11-వ పేజీ తరువాయి]

వాగాడు ఒకతను; ఆశా అని మీదమీదకు వచ్చాడు.

'ఎంత ఇవ్వాలేమిటి' అన్నాను ఆశతో నెమ్మదిగా.

'మా అమ్మను కనుక్కొస్తామా అమ్మను కనుక్కొస్తా" అంటూ లోపలికి వెళ్ళింది.

ఏమని చెప్పిందో యేమో! మంగమ్మ వస్తూనే 'మీబోటివాళ్ళ కనికరంవుండాలి గాని, యెంతయిస్తే మాత్రం యేం అసలు యివ్వకపోతే మాత్రం యేం' అన్నది యెంతో సాత్వికంగా.

'భోజనానికి, యిక్కడ వుండటానికి యెంత డబ్బయిందని అడిగాను. అంతే' అన్నాను.

'ఏమే నువ్వట్లా చెప్పావేమిటే' అంటూ కూతుర్ని కసురుకుని వెళ్ళిపోయింది.

రాత్రి పది దాటిపోయింది. వెడ్డింగు తెచ్చుకుని వాకిట్లో అరుగుమీద పడుకున్నాను. ఈరాత్రి యిక్కడనుంచి బైట పడితే పీడ విరగడయిపోతుందని.

రెండు కుక్కలు పోట్లాడుకుని అరుగు మీదికి వచ్చినాయి. ఎంత తోలినా పోవటం లేదు. మనం నిద్రపోగానే అవికూడావచ్చి మెల్లిగా చేరతాయి. నిద్ర కనురెప్పల మీదకువచ్చి బరువుగా కూర్చుంది. కునుకు పాట్లు పడుతున్నాను.

ఆశ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వచ్చింది.' మాఅమ్మ గదిలోకి రమ్మన్నదండి' అన్నది.

'ఎవరూ! మీఅమ్మ'అనివులిక్కిపడ్డాను.

'నిన్ను అక్కడ పడుకోమంది. ' ఆశ నవ్వింది.

'అవును నాయనా అవును. ఈ అరుగు మీద ఆడపిల్లలు పడుకుంటారు. నువ్విక్కడ వుంటే వాళ్ళు రావటానికి సిగ్గుపడుతున్నారు' అన్నది మంగమ్మ లోపల్నుంచి.

గబగబ వెడ్డింగుచుట్టి లోపలకు వెళ్ళాను. నావెనకాలే ఆశకూడ కిలకిలమంటూ వస్తోంది. నాగది గుమ్మంముందర ఆపేసి, గభాలున లోపల ఘడియవేసుకున్నాను. దీపం నూనెంతా పీల్చేసి బైతక్కలాడుతోంది. వత్తి పెద్దదిచేశాను. అయితే దీపం పెద్దది కావటంలేదు. ఈ అంధకారంలోకి వచ్చిపడ్డానేమా అనుకుంటున్నాను. కిటికీ లోంచి రివ్వున గాలొస్తోంది. ఉండి ఉండి గప్పుమంది దీపం. గదిలో ఓమూలగా బుస్సుమంది నిప్పుపెల్ల వెలుతురు ఒక్కక్షణంలో గదంతా నిండిపోయింది. నాగుండె ఝల్లుమన్నది. వళ్ళంతా వణికిపోతోంది. పెదిమలు తడబడుతున్నాయి. వస్తోంది నావైపుకే వెలిగించినవిప్పుపుల్ల పట్టుకుని, అసలే దయ్యాలంటే భయం. అందులో ఆడదయ్యం అంటే మరీభయం. ఇదెక్కడ నాకు దాపరించిందిరా అని గజగజలాడిపోతున్నాను. దగ్గరగావచ్చి యింకో నిప్పుపుల్ల వెలిగించింది. వెలుతుర్లో మొహం చటుక్కున కనిపించింది, పోల్చుకున్నాను. అబ్బ గుండె దడ అప్పటికే తగ్గలేదు. ఏమిటా సాహసం అనిపించింది.

అప్పుడేం చేశేటట్టు! తలుపుతీద్దామా ఆశ పట్టుకుంటుంది. అట్లాగే వుందామా సులోచన నా గదిలో. అందులో రాత్రిపూట ఎవ్వరికీ తెలియకండా! ఎట్లా ఆరాత్రి గడపటం. కల్లు అనుకునేవాళ్ళందరికి పాలుపాలు అని యేమని రుజువు చెసుకుపోతాం. ఎట్లాగు నమ్మించటం! గట్టిగా కన్నుమూసుకుని నిద్ర పోదాం అనుకుంటే యివొచ్చిపడ్డాయి. నాకు తెలీక యీ బురదలోకి వచ్చాను, ఎట్లాగు తప్పించుకుపోవటం?

వెడ్డింగుచుట్టి, పర్సుకోసం జేబు తడుముకున్నాను, హాఠాత్తుగా జ్ఞాపకం రావటం వలన, పర్సు కనపడలేదు. గాభరాగా అటూ యిటూ చూశాను, ఎవర్నని అడిగేటట్టు. అందరూ దొరలేను! అర్ధరాత్రివరకు కన్ను మూయకండా అట్లాగే కూర్చుని, సులోచనను ప్రతిమాలుకున్నాను, 'ఈ రాత్రికి రాత్రే యెక్కడికైనా వెళ్ళిపోయి, యే చెట్టుక్రిందో పడుకుంటాను,' అని సులోచన యేమీ అభ్యంతరం చెప్పలేదు పైగా సహాయం చేసిందికూడా. 'ఈ దొడ్డిదోవన పోతే యెవ్వరూ కనిపించరు, వాకిటి తలుపు కనక తీస్తే, యే క్రిరుమని చప్పుడయినా యెవరైనా లేవొచ్చు,' అన్నది. మెల్లిగా అడుగుల్లో అడుగులు వేసుకుంటూ మనస్సులో సులోచన మంచితనానికి కృతజ్ఞత తెలుపుకున్నాను. మెల్లిగా జారుకున్నాను. గది దాటాను. వంటింటి ఎదురుగా వున్న తడిక హద్దులుకూడా దాటి మెల్లిగా ముందుకు వెళుతూ, యెందుకో ఓసారి సులోచనను చూడాలనిపించింది. వెనక్కి తిరిగి చూశాను మనోనేత్రంతో, ముందుకు అడుగు వెయ్యబోతున్నాను. 'ఎక్కడికి యీ అర్ధ రాత్రి ప్రయాణం?' అన్నది ఆశ ఎదురుగా వచ్చి. ★

# మంచుమనిషి

(16-వ పేజీ తరువాయి)

వొంటినిండా జుట్టుతోనూ, క్రూరులుగానూ, మహాబలయుతులుగానూ వుంటారట. అచటికి కొద్ది దూరములో మెలూంచీ (మెలుంబూ) అనే గ్రామంలో ఒకయేటీ తల్లికీ, షెర్పా తండ్రికీ కలిగిన సంతానమున్నదట.

ఎవరెస్టు శిఖరం క్రింద 14,000 అడుగుల మట్టమున పాంగ్ బోచ్ అనే బౌద్ధమత పీఠమున్నది. అచట నూరు సంవత్సరముల క్రితం లాంగ్ డోర్జీ అనే గొప్ప సన్యాసి వుండేవాడట. ఆయన ఒకోసారి కొన్ని వారాల తీరబడి ఆహారంకోసం బయటికి పోమేవాడు కాడట. ఒకనాడు పెద్ద శరీరంతో మానవాకృతితో నుండి, కోతి లాంటి ఒక జీవి, కొన్ని పళ్ళూ, దుంపలూ తెచ్చి ఆయనముందుంచిందట. ఆనాటి నుండి కొంతకాలం వరకూ ప్రతి రోజూ అలా సమర్పించేదట. మరికొన్ని యేండ్ల అనంతరం, ఒకనాడు దాని మృతకళేబరం కనబడిందట. వార్ధక్యంవల్ల చనిపోయిందట. అప్పుడు లాంగ్ డోర్జీ, దాని శిరస్సుపై భాగాన్ని తీయించి, తన మత సంస్థయొక్క విలువైన వస్తువులతోపాటు భద్రం చేయించాడట. వారు దానిని చాలా గౌరవిస్తారు. అది కోణాకృతిలో వున్నది మనిషి తలమీద టోపీలాగా అమరుతుంది. బిరుసైన వెంట్రుకలు, ముందటిభాగాన పైకిపోయి, వెనక భాగాన క్రిందికుంటాయి. దాని నిప్పటికీ ప్రతియేడూ పండుగ దినాలలో తీసి, ధరించి, యేటీ వేషంవేసి, పండుగ నాట్యం చేస్తారు.

1948 లో థార్ బెర్గ్, ఫ్రాటిస్ అనే యిద్దరు నార్వేజియనులనూ, వారి అనుచరులనూ, జెమూకనుమవద్ద, మానవాకృతిలో వున్న ఒక పెద్దజంతువుతాకి, అందులోఒక్కణ్ణి బాగాకొట్టిపారిపోయినట్లుకూడా తెలుస్తోంది.

ఏటిని పట్టాలని అన్య దేశీయులకున్నా, అదిషెర్పాల సాయంలేనిదే సాధ్యంకాదు. కాని అలా చేస్తే, యేటలు తమ జాతి మొత్తాన్నే తుడిచిపెట్టేస్తాయనే భయంతో షెర్పాలసలుసాయమేచెయ్యరు ఏటిలిప్పుడు చాలా తక్కువగా వున్నాయి. అదీకాక ఏటీలను బాధించడంగానీ చంపడంగానీ వీలులేదని నేపాల్ ప్రభుత్వ ఉత్తర్వులున్నాయి. ఏటిని చెరపట్టకుండానూ, బాధించకుండానూ, ఫొటోలు తీసుకోడానికి మాత్రం అనుమతించింది.

మంచుమనిషిని గూర్చి మొదటిగా విన్నప్పుడు, "హామ్మో! హిమాలయాల్లో ఆంజనేయస్వామి దర్శనమిస్తున్నాడు. ఇక తపస్సును చాలించి, బ్రహ్మ కాబోతున్నాడు" అనుకున్నవారు—నే సైతం—వున్నారు. ★

(శ్రీ ఏమ్. ఎమ్. గుప్త వ్యాసం ఆధారంగా)

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras 1 Editor S. Sambhu Prasad




కర్షక కుటుంబం

చిత్రకారుడు: "చెల్ల"—మద్రాసు.

Regd No. M. 4479 Andhra Patrika




ఆంధ్ర అనే పదము ఐతరేయ బ్రాహ్మణ మంత ప్రాచీనమైనది. సువిశాల దక్షిణాపథములో ఆంధ్రులు యెంతకాలము నుంచియో నివసిస్తున్నారనేందుకు నిదర్శనములు అనేకములున్నవి.

ప్రస్తుత ఆంధ్రప్రజ 322 లక్షలు—యిరువది జిల్లాలలో నివసిస్తూన్నారు. విద్యావంతులు 15%, వ్యవసాయదార్లు 66.9%. ప్రపంచములో ప్రతిజాతికున్నట్లే ఆంధ్రులకు కూడ ప్రత్యేకమైన అభిరుచి, సాంస్కృతి, సాంప్రదాయములు గలవు.

ఆంధ్రపత్రిక అనేక సంవత్సరాలనుండి ఆంధ్రదేశమునకు, ఆంధ్రప్రజకు, అంకితమై యున్నది. ఆంధ్రుల అభిరుచిని చూరగొనేందుకై చేయు, మా నిరంతర కృషిని సహృదయముతో చరిత్రాకారులు, రాజకీయవేత్తలు, వర్తకప్రముఖులు, ఆంధ్ర ప్రజానీకము గమనిస్తున్నారు!!

ఎందుకు?

ఈ ప్రశ్నకు జవాబు మామీద నమ్మకముంచి తమ సరకులను పాఠకులకు అమ్ముచుండే నిష్పాక్షికమైన ప్రకటనకర్తలే చెప్పెదరు.

**ఆంధ్రపత్రిక**

**నెం. 6, 7, తంబు చెట్టి వీధి, మద్రాసు-1.**